# పొడుపు కథలు
# ఒకపరిశీలన

7/8
3-89

ACC NO. 13897




(రి. నెం. 534/72)

డా॥ కసిరెడ్డివెంకటరెడ్డి

# పొడుపుకథలు ఒక పరిశీలన

డా॥ కసిరెడ్డివెంకటరెడ్డి
[ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ
ఆర్థిక సాహాయ్యంతో ప్రచురితం]

ప్రథమ ముద్రణ : డిసెంబర్, 1986

ప్రతులు : వేయి

A CC No. 13897

ముఖపత్రాలంకరణ : సూరి

ముద్రణ : సువర్ణముద్రణాలయ,
నల్లకుంట, హైదరాబాదు-500 044

ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్
(రి. నెం. 534/72)

398.6
VEN

ప్రతులకు :
సాహిత్యనికేతన్
3-4-852, బరకత్‌పుర
హైదరాబాదు-500 027.
సాహిత్యనికేతన్
ఏలూరురోడ్డు - విజయవాడ - 2.

వెల : రూ॥ 20/-

# ముందు ముచ్చట

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ పరిశోధన చేయడానికి అవకాశం కల్పించడంతో నాకు పొడుపు కథలమీద సహజంగానే ఉన్న ఆసక్తి మరీపెరిగింది. పొడుపుకథలు సేకరించి పరిశీలించి విశ్లేషించి పరిశోధించే అదృష్టం లభించింది. ఆ పరిశోధన ఫలితంగా బయల్వెడ్డ "తెలుగు పొడుపు కథలు" బృహద్గ్రంథంగా మారింది. ఆ గ్రంథ ప్రచురణ అసాధ్యమనిపించింది. అందుకే "ఉపరిశోధన" లాంటి "పొడుపుకథలు-ఒక పరిశీలన" అనే ఈ చిన్న గ్రంథాన్ని ప్రచురించాలనే సంకల్పం కలిగింది.

ఆ సంకల్పబలానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ ఆర్థికపుష్టి సమకూర్చింది. ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు ఆశీస్సులు పలికింది. "సూరి" కలం అందంగా ముఖపత్రాన్ని తీర్చిదిద్దింది. సువర్ణా ప్రెస్సు పరిశ్రమించి సకాలంలో పుస్తకాన్ని అందించింది.

ఈ పుస్తకం ఇలారావడానికి కొంత పూర్వరంగముంది. తెలుగు పొడుపు కథల మీద పరిశోధనకు అవకాశం కల్పించిన ఆచార్య బిరుదురాజు రామరాజు గారు, పర్యవేక్షించి సముచిత సలహాలనందించిన ఆచార్య సి. నారాయణరెడ్డిగారు, ఆశీర్వదించి ప్రోత్సహించిన ఆచార్య నాయని కృష్ణకుమారిగారు. నాకు సేకరించిన పద్యాలనిచ్చిన శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు ఇంకా ఎందరో ఆపూర్వరంగంలో వెన్నుతట్టి నడక నేర్పారు. ఆ మహామహులందరికీ వందనాలు.

15-12-1986

రచయిత

# ఆశీస్సు

డాక్టర్ కె. వెంకటరెడ్డిగారి గ్రంథం "పొడుపుకథలు-ఒక పరిశీలన"-చూచాను. ఈ విషయం, ఆయన పిహెచ్.డి. పట్టాన్ని సంపాదించడానికి చేపట్టి, పారం చూచిన విషయం కనుక, ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని గురించి పలు మాటలలో చెప్పవలసిన అవసరం లేదు. సౌమ్యుడూ, నెమ్మదైన వర్తనం కలవాడూ, అయిన రచయిత యొక్క స్థిరలక్షణం, ఈ గ్రంథ విశ్లేషణరూపంలో చక్కగా కనపడుతున్నది. పొడుపుకథలు, సామెతలు, గాథలు, పద్యాలు, గేయాలు, లెక్కలు, అనే పద్ధతిలో మొత్తం విషయాన్ని స్పష్ట విభాగాలుగా చేసి చూపిన తీరు బాగున్నది. కాని, కథ, గాథ అనే రెండుమాటల్ని విభిన్నార్థాలలో వాడడానికి రచయిత ప్రయత్నించారు. ఆయా సందర్భాలలో "గాథ" అంటే "యిది" అని రచయిత స్పష్టం చేసినా, లోకుల వాడుక (connotation)లో అటువంటి స్పష్టరేఖ. ఈ రెండు పదాల మధ్య గీయబడి ఉండకపోవడం వల్ల, ఈ వాడుక కొంత సందిగ్ధతకు తావిస్తుందేమో! గాథ బదులు "గుప్తకథ" అని ఉంటే బాగుండేదనిపించింది నాకు.

పొడుపు పద్యాలు, గేయాలు, లెక్కలు, అనే అధ్యాయాలలో రచయిత చూపించిన ఉదాహరణలు, కుతూహలజనకాలుగా ఉండడమేకాక, విషయ సేకరణలో ఆయనకు గల ఆసక్తిని, ఆర్తిని వ్యక్తం చేస్తున్నాయి.

ఈ గ్రంథం జానపద సాహిత్యానికి మంచి అలంకారం.

ఈ గ్రంథానికి ఆహ్వానమూ, ఈ కవికి శుభాకాంక్షలు నా పక్షాన్నుండి!

నాయని కృష్ణకుమారి
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్.

15-12-86

# అంకితం

# సింగమ్మనాయనమ్మకు

ఆకాశం పందిరికింద అద్దమ్మ రేతిరిదాకా ఏవేవో కథలు చెబుతుంటే ఊకొడుతూ నిద్దురపోయిన తీపిగుర్తులీనాటివి కావు, ముప్పయి సంవత్సరాల క్రిందిటివి. నల్లటి ఆకాశంనుండి మా వైపు తొంగిచూసేచుక్కలు నల్లగొంగడి మీద తెల్లబట్టలతో నేనూ మా నాయనమ్మా ! మేమిద్దరమేకాదు, మా తమ్ముడూ చెల్లెలూను. మా నాయనమ్మ ఏమేమోచెబుతుండేది, మాకప్పుడెంత అర్థమయ్యిందో! ఎంత మనసులో నిలిచిందో ! ఎంత గాలికి పొయ్యిందో !

"పుట్టెడు సెనిగల్లో ఒకటేరాయి" అంటే మాకేంతెలిసింది ! సెందురుడని ఆమే చెప్పేది. "అమ్మ అంటే దగ్గరికొస్తయి-నాన్న అంటే దూరంపోతయి" అంటే మాకు అర్థం అంతు చిక్కేదా ! ఆమే చెప్పేది పెదవులని." నీల్లులేని బాయిల బోగమోల్లాడిరి" అని పొడిస్తే బిత్తరపోయి మేముంటే ఆమే చెప్పేది పేలంగింజలని. ఇలా ఎన్నని ! ఒకటా ! రెండా !

ఇలా ఎన్నితట్లు (పొడుపులు) విన్నామో ! విడుపుల కొరకు ఎంత ఆలోచించామో ! నాకైతే ఈ పొడుపుకథల మీద పరిశోధన చేయడానికి పూను కొన్ననాడే, దీనికి బీజం ఆనాడే పడింది అనిపించింది. అందుకే ఆ నాయనమ్మ కాని నాయనమ్మకే ఇది అంకితం ఇవ్వాలనే ఆలోచన వచ్చింది.

కథకాని కథ పొడుపుకథ అయినట్టుగా నాయనమ్మకాని నాయనమ్మ నాయనమ్మ అయ్యింది. మా నాన్న ఆమెను "అమ్మ" అనేవాడు. మాది పోలెపల్లి, ఆమెది కలకొండ. పూర్వం ఒక దగ్గర ఉన్న కసిరెడ్డివాళ్ళు పోలెపల్లి చెంద్రాన్‌పల్లి (చెన్నరాయనిపల్లి) కలకొండ తదితర గ్రామాల్లో స్థిరపడ్డారట. నాన్నగారికి తన తల్లి తీపిగుర్తులేంలేవు. కన్నతల్లిలా మంచిచెడ్డలు చూసి మమతనూ ఆత్మీయతను పంచిపెట్టింది, తన కోడళ్ళమీద అత్తపెత్తనం చెలా యించింది మా సింగమ్మనాయనమ్మే.

అలా గుర్రంమీద నిటారుగా కూచొని, మా ఊరిశివారులో ప్రవేశించి నప్పటినుండి, చేలో-చెలకలో పనిచేసేవారిని కేకలువేస్తూ, మంచీచెడ్డా తెలుసుకొని పరామర్శిస్తూ, ఒక్క ఉదుటున మా ఇంటి ముంగిట గుర్రంమీన్నుండి కిందికి దిగే నాయనమ్మ ఈనాటికీ కళ్ళముందు తారట్లాడుతున్నది.

ఆ రోజు మా నాన్నా నాయనమ్మా ఎందుకో-ఏమో మా పెదనాన్నను పిలుచుకురమ్మన్నారు, ప్రక్కనే ఇల్లు, నేనూ మా కలకొండ అన్న (వెంకటరాం రెడ్డి) పరుగెత్తాం. నడుముల బండిగోడ దుంకిపోవాలనే ప్రయత్నంలో నేను గోడ రాయికి గుద్దుకున్నాను, ఆనాటి ఆ దెబ్బ నాకు ఈనాటికీ చెరగని గుర్తుగా ఫాల భాగంమీద నిల్చిపోయింది. ఆ గుర్తు చూసుకొన్నప్పుడల్లా సింగమ్మ నాయ నమ్మ గుర్తొస్తుంది.

మా ఇంట్లో స్తంభాలకు దుక్కిమోకులు కట్టుకొని ఊగేవాళ్ళం. మా చిన్నతనంలో నాన్నే ఆ తాళ్ళు కట్టేవాడు. నేను ఇంటివెనుకనుండి వచ్చేవరకు తమ్మునికీ (మోహన్‌రెడ్డి) చెల్లెలికీ (నర్సమ్మ) నాన్న ఊయలలు కట్టాడు. ఇద్దరూ ఊగుతున్నారు, నాకు ఉక్రోశం ముంచుకొచ్చింది. పరుగెత్తి కెళ్ళి నాన్న తొడల మీద దబాదబా బాదాను. ఆయన కసురుకొని తన చేతికర్రతో నన్ను రెండంటిం చాడు. అప్పుడు తెలిసింది ఆ కుర్చీలో కూచున్నది మా నాన్నకాదని, కోపిష్టి కర్ణాటి బుచ్చిరెడ్డి అని. అక్కడే బల్లపీటమీద కూచున్న మా నాయనమ్మ నన్ను ఒళ్ళోకి తీసుకుంది. అప్పటికప్పుడు నాన్నను పురమాయించి మరో ఉయ్యాల కట్టించింది.

మా జొన్నచేలో, మా కుంటకట్టున, మా జొరిబావిగడ్డన మా నాయనమ్మ కేకలువేస్తూ పనిపాటల వాళ్ళతో కలిసి తిరుగుతుంటే చిటుకుచిటుకున నడుస్తూనే. నాన్న చంకకూ, నాయనమ్మభుజంమీదికి ఎక్కినఘట్టాలు లీలగాగుర్తొస్తూంటాయి. రజాకార్లబారినుండి తప్పించుకోడానికి అమ్మానాన్నలు మా ఊరువదలి భువనగిరి చేరినప్పుడు మా నాయనమ్మ మాకు అండదండగా ఉండిందట. అప్పుడు నాకింకా మూడేళ్ళుకూడా నిండలేదట. పుట్టుకతోటే నాయనమ్మతో అనిర్వచనీయమైన ఆత్మీయతాబంధం అలా పెనవేసుకుని పోయింది.

ఆమె చివరిదశలో నేనూ తమ్ముడూ చెల్లెలూ కలకొండకువెళ్ళాం. అప్పుడు మా ముగ్గురి వయస్సు పదేళ్ళలోపే. మాకు అన్నంపెట్టి చేతుల్లో నెయ్యివంచింది. నాయనమ్మ. మేం చేతులు దొప్పల్లా పట్టాం. మా చేతిదొప్పలు నిండినై. అప్పుడే గుమ్మంలోకి వచ్చింది మా కక్కమ్మ (మా నాయనమ్మ కోడలు). ఆమె చూపులవేడికి తట్టుకోలేని సింగమ్మనాయనమ్మ మా చేతుల్లోని నేతిని గిన్నెలోకి వంపుకొని వంటింట్లోకి వెళ్ళిపోయింది.

మా ఊళ్ళో-మా ఇంట్లో సింగమ్మ నాయనమ్మ సింహమే. కాని ఆమె ఇంట్లో !...."అత్తకాలం కొన్నాళ్ళు కోడలికాలం కొన్నాళ్ళు" అని సరిపుచ్చుకుందామంటే ఈనాటికీ మనసొప్పదు, ఎందుకో ! ఎందుకేంటి ! ఈ నామనస్సు పొడుపులకు విడుపులు వెదకడంలో బీజంనాటిన నాయనమ్మచేయి కిందికయిందంటే సహించని తపన అంతే ! ఆ తపన అంతరంగంలో అప్పటినుండీ ఉంది. అందుకే ఆ నాయనమ్మ ఆత్మకు ఇది అంకితం ఇవ్వాలనిపించింది.



# పొడుపుకథలు
## ఒక పరిశీలన

# పొడుపు కథలు

ఈ సృష్టిలో మానవుడెప్పుడు పుట్టాడో పొడుపు కథ ఆనాడే పుట్టింది. మానవుని పుట్టుకతోనే సమస్యలు మొదలయ్యాయి. సమస్యల్ని పొడుపుకథలు ప్రతిబింబించాయి. ఇంకేం పొడుపుకథ ఓ సమస్య అయి కూర్చుంది. ఈ సమస్య ముడి విప్పడానికి సృష్టించిన మానవుడే ఆలోచించాల్సి వచ్చింది. ఆ ఆలోచనలకు ఒక రూపం వచ్చేసింది. ఇంకేం అది పొడు పయ్యింది. పొడువు పొడిచిన వాడూ మానవుడే, పొడుపు విడిచిన వాడూ మానవుడే. పొడుపు కథా కర్తా-వ్యవహర్తా మానవుడే అనడంలో సందేహం లేదు. అయితే కర్త ఒక్కడా పదుగురా అనేదే తేలని విషయం. ఇటీవలి కాలానికి చెందిన కొన్ని పొడుపు పద్యాల్ని మినహాయిస్తే అతి వేలంగా ఎదిగి, వటవృక్షంలా విస్తరించిపోయిన జానపదుల పొడుపు కథలకు కర్తలెవ్వరో కన్ను పొడుచుకున్నా కనిపించరు. చిటారుకొమ్మలోని మిఠాయి పొట్లమైనా దొరుకుతుందేమో కాని పొడుపుకథాకర్త చిక్కడూ దొరకడు. అయితే వ్యవహర్తలు మాత్రం పల్లె పల్లెలో దొరుకుతారు. అడిగిన వెంటనే ముచ్చట్లు పెడుతూనే మురిపాలొలికిస్తూనే పొడుస్తారు. తమ తరువాతి తరం వారు అదేవిధంగా పొడపడానికి ముళ్లడొంకలు తీస్తారు. పూల బాటలు వేస్తారు.

ఇంతకూ తేలిందేమంటే పొడుపు కథాకర్త ఒక్కడు కావచ్చు, పదుగురు కావచ్చు, తరంనుండి తరానికి సంక్రమించడంవల్ల ఓ వ్యక్తి వ్యవహరించవచ్చు మరో పదిమంది పలక వచ్చు. అంటే పొడుపుకథా సంజననానికి ఏక మూల సిద్ధాంతం ఆధారం కావచ్చు. బహుమూల సిద్ధాంతం కారణంకావచ్చు. సాంప్రదాయికతా బలం మూలం కావచ్చు. ఇందులో ఏ ఒక్కటో సత్యమంటే అది ఆంశికసత్యం మాత్రమే అవుతుంది. ఈ మూడూ కలిస్తేనే పూర్ణసత్యం సాక్షాత్కరిస్తుంది. ఆకారణాననే పొడుపుకథకి మూడూ మూలాలే అనడంలో అసంభవం కాని అసహజంకాని ఎంత మాత్రంలేదు-కాదు.

మరి ఇలాంటి పొడుపు కథ అతి ప్రాచీనమైంది అనడంలో భిన్నాభిప్రాయాలేం లేవుకాని ఆ అతి ప్రాచీనతలో ఏ దశకు చెందింది అని నిరూపించడంలో పరిశోధకుల మార్గాలు వేర్వేరయ్యాయి. సాహిత్య ప్రక్రియల్లో గేయాలు కథాగేయాలు ప్రథమ దశకు చెందినవిగా పరిగణింపబడతాయి. గద్యకథనాలు ద్వితీయ దశలోకి వస్తాయి. పొడుపుకథల్లో కనిపించే ఆలంకారికత, మార్మికత, అస్పష్టత కారణాన అవి తృతీయ దశలోకి వస్తాయి. శతపత్ర సూచీన్యాయంలో పత్రపత్రానికి సూది గుచ్చుకొనిపోయిన కాలాన్ని నిర్ణయించడం ఎట్లా కష్టసాధ్యమో అనంతకాలంలో అంతులేకుండా ప్రాదుర్భవించిన పొడుపు కథలు కూడా ఎప్పుడెప్పుడు దేని తర్వాత ఏది వచ్చిందని చెప్పడంకూడా కష్టమే! అంతే కాకుండా ఈ మూడు దశల మధ్య కాలాన్ని కొలవడానికి కూడా కొలతబద్దలేం లేవు. అందువల్ల ప్రాక్తన మానవ మనోవికాసం బాల్యదశలో ఉన్నప్పుడే పొడుపు కథలు పొడుచుకొని వచ్చాయని నిర్ధారణ చేసెయ్యవచ్చు.

## మనపొడుపుకథ

సంస్కృతభాషలోనే మనదేశంలో మొదటి పొడుపు కథలు కనిపిస్తున్నాయి. అపౌరుషేయాలుగా పరిగణింపబడుతున్న వేదాల్లోని సంకేతార్థాలున్న ప్రతిస్థలంలో పొడుపు కథాలక్షణాలు భాసిస్తున్నాయి. ఆధునిక యుగంలో మేధావులచే ప్రశంసింపబడుతోన్న ప్రతీకవాదం బహుముఖంగా వేదాల్లో విస్తరించి ఉండడమే దీనికి ప్రధాన కారణంగా పేర్కొనాలి. ఆ తర్వాత వచ్చిన ఉపనిషత్తుల్లోనూ, స్మృతుల్లోనూ, దర్శనాల్లోనూ, పురాణాల్లోనూ, దృశ్యశ్రవ్య కావ్యాల్లోనూ ఎడనెడ పొడుపు కథా లక్షణాలున్న మంత్రాలు, సూత్రాలు, శ్లోకాలు దర్శనమిస్తాయి.

భారత గ్రంథంలోని యక్ష ప్రశ్నల్లో అధికభాగం పొడుపుకథలే, యక్ష ప్రశ్నలనగానే పొడుపుకథ గుర్తుకు రావడం ఇందుమూలాన్నే. యక్షుడడిగిన ప్రశ్నలు నిన్నటివా మొన్నటివా? ధర్మరాజు కాలంనాటివి. ఓ పాండవుల నాటికథ అనేమాట తెలుగునాట వినిపించడం అతిప్రాచీన కాలాన్నే సూచిస్తోంది.

1 గాలికంటె వేగం గలది = మనస్సు

2 గడ్డికంటె దట్టమైంది = చింత

3 నిద్రలోనూ కళ్లు ముయ్యనిది = చేప

4 పుట్టి కూడా చేతనత్వం లేనిది = గుడ్డు

5 రూపం ఉండి హృదయం లేనిది = రాయి

6 సుఖాల్లో గొప్పది = సంతోషం

7 ధర్మాల్లో గొప్పది = అహింస

8 లోకాన్ని కప్పి ఉన్నది = అజ్ఞానం

9 లోకానికి ఆధారం = సత్పురుషులు

10 తపస్సంటే ఏమిటి = తన కులధర్మం ఆచరించడం

11 వేగంవల్ల పెరిగేది = ఏరు

12 మనుష్యుని ఆత్మ = కొడుకు

13 ధనాల్లో గొప్పది = శాస్త్రజ్ఞానం

ఈ విధంగా వినిపించే వందలాది యక్ష ప్రశ్నలు పొడుపు కథ లే అనడంలో ఎలాంటి సందేహం లేదు, సంస్కృతంలో కేవల ప్రహేళికలనే విరచించి ధర్మదాస సూరి, విశ్వేశ్వర పండితులు బహుళ ప్రచారం గావించారు, భారతీయ భాషలన్నిటికి సంస్కృతం అన్ని దానాలు చేసినట్లే ప్రహేళికా ప్రదానం కూడా చేసింది. ఆకారణాననే పొడుపుకథా సాహిత్యం అడ్డూ ఆపూ లేకుండా విస్తరించి పోయింది. ఇప్పుడిప్పుడే వివిధభాషల్లో పొడుపు కథల మీద పరిశోధనలు జరుగుతున్నాయి. తెలుగులో కూడా జరగడం ముదావహం. పొడుపు కథల యుగం అంతరించిందని కొందరను కుంటోన్న తరుణంలో పొడుపుకథ యుగారంభం ఇప్పుడే అయ్యిందనాలనిపిస్తోంది.

## తెలుగు పర్యాయపదాలు

పొడుపుకథకు తెలుగులో అనేక పర్యాయపదాలున్నాయి. ఇందులో కొన్ని అన్యభాషల నుండి వచ్చినవి కాగా మరికొన్ని ప్రాంతీయ భేదాన్నిబట్టి యేర్పడ్డవి.

1. పొడుపు కథ :- సూర్యోదయాన్ని పొద్దు పొడుపు అంటాం. చీకటి తర్వాత వెలుగు. పొడుపుకథ అంటే జ్ఞానోదయమే మరి. అక్షర సామ్యాన్నిబట్టి ప్రహేళికా శబ్ద భవమే పొడుపు అనవచ్చును. కాని అన్ని అక్షరాల్లో ఈ సామ్యం కనిపించదు.

**2.** విడుపు :- వేయబడ్డ పొడుపు కథను పరిష్కరించేదే విడుపు. అయినా విప్పు కథలు-విప్పేకథలు అనే మాటలు కూడా వినిపిస్తున్నాయి. కట్టి

విక్రమార్కకథల్లో "నేను విడికథ చెబుతాను, నీవుదాన్ని పరిష్కరించాలి" అని భేతాళుడు విక్రమార్కునితో అంటాడు. బ్రౌణ్యనిఘంటువులో కూడా విడుపు శబ్దాన్ని పొడుపుకథార్థంలో వాడడం జరిగింది, విడుపు కథ నుండే విప్పుకథ విచ్చుకథ అనే పదాలేర్పడ్డాయి.

3. తట్టు :- తెలంగాణాలోని కొన్ని మండలాల్లో ఈ పదం వాడబడుతోంది, స్పృశించడం, చిన్నగదెబ్బకొట్టడం మొదలైన అర్థాలు దీనికున్నా మనిషిలోనివాణ్ని తట్టి మేల్కొల్పడమే దీని ఉద్దేశం.

4. మారుతట్టు :- తట్టు వేసినట్లే ఉండదు. మరో అర్థం వస్తుంది. అంటే మారుతుందన్నమాట. మారేతట్టు మారుతట్టయ్యింది. తట్టొకరు వేస్తారు, మరొకరు మరొకతట్టుతో ఎదుర్కొంటారు. ఈ ఎదుర్కోవడమే మార్కోవడం. మార్కోవడమే మారుతట్టు. తట్టుకు మారుతట్టు అంతే. రెండింటికి భేదమేమీ లేదు. రెండూ ఒకే అర్థంలో ప్రయోగింపబడుతున్నాయి.

5. మారుకథలు :- తట్టు, మారుతట్టు ఉన్నట్లుగా కథ, మారుకథ అని ఉండాల్సింది. రాయలసీమలోని కొన్ని ప్రాంతాల్లో పొడుపుకథను మారుకథ(త)గా వ్యవహరిస్తున్నారు. అయితే కథాశబ్దం పొడుపుకథార్థంలో వ్యవహరింపబడ లేదు. కథకు అనుకోని విధంగా అర్థం మారిరావడం వల్లకూడా ఇవి మారుకథలుగా ప్రయోక్తాలయి ఉంటాయి.

6. శాస్త్రాలు :- వరంగల్లు, ఇందూరు (నిజామాబాదు), కరీంనగరం మండలాల్లోని కొన్ని ప్రదేశాల్లో పొడుపుకథల్ని శాస్త్రాలంటున్నారు. శాస్త్రాల్లో ఉండే సూత్రనియమాలు, శాస్త్రాంశాలు వీటిలో ఉండడం మూలాన, శాస్త్రం వలె విప్పడం కష్టసాధ్యమైనందువల్ల శాస్త్రాలుగా పిలుస్తున్నారని భావించడానికి అవకాశం ఉంది.

7. సమస్యలు-సమిచ్చలు :- సంస్కృతంలో పొడుపుకథను సమస్యాగూఢమని కూడ పిలుస్తున్నారు. తెలుగుసాహిత్య ప్రక్రియల్లో సమస్యల కొక ప్రత్యేక స్థానముంది, పొడుపు కథాలక్షణాల్ని పుణికి పుచ్చుకొన్న వానిలో సమస్య ఒకటి. ఆ కారణాన్నే కొన్ని ప్రాంతాల్లో పొడుపుకథల్ని సమస్యలు-సమిచ్చలు అంటున్నారు, సమస్యయే సమిచ్చగా మారడానికి ఆస్కారం ఉంది.

8. చిటుకులు :- పాలమూరు మండలంలో తట్లు బాగా చెప్పేవాణ్ని "వాడు బలె సిటుకులు సెప్తడు" అని అంటారు. చిటికవేసి "చిటుక్కున విడి చెయ్ చూద్దాం" అని సవాల్ చేసే విధంగా పొడుపుకథా వ్యవహర్త ప్రవర్తిస్తాడు కాబట్టి వీనిని చిటుకులు అని వ్యవహరించడంలో అసామంజస్యం ఏమీలేదు. చిటిక ఏక మాత్రాకాలికం. పొడవబడే పొడుపుకథల్లో కథారహితాలైనవి పెక్కులు చిటికవేసినంతకాలాన్నే తీసుకుంటాయి. విడుపుకూడా అంతకాలంలోనే రావాలని వ్యవహర్త ఆశిస్తున్నాడన్నమాట.

9. చిట్కాలు :- కొన్నిరకాల చిట్కావైద్యాలు పొడుపుకథల్లో దర్శన మిస్తాయి. ఏదైనా చిక్కుసమస్య వస్తే దీనికో చిట్కా కనిపెట్టాలని అంటుంటారు. చిట్కా అంటే ఉపాయమన్నమాట. ఉపాయంలేనివాడు చిట్కాలు తెలుసుకోలేడు, ప్రయోగించలేడు. మొత్తమ్మీద పొడుపు కథల్లోని యుక్తుల కారణాన, చిట్కా వైద్యాల మూలాన వీనిని చిట్కాలంటున్నారని భావించాలి.

10. చిక్కుముళ్ళు :- చిక్కుముళ్లు వేసి విడదీయుమనేతత్త్వం పొడుపు కథకున్నందువల్ల ఇదికూడ అన్వర్థ నామధేయమయ్యింది.

11. యక్షప్రశ్నలు :- త్వరగ సమాధానం చెప్పడానికి సాధ్యంకాని గుణం యక్షప్రశ్నలకుంది. అయితే ఆనాడు ధర్మరాజు వెంటవెంటనే సమాధానాలు చెప్పేశాడు. పొడుపు కథాలక్షణాలు నాటి యక్ష ప్రశ్నల్లో ఉన్నందువల్ల ఈనాడు కొన్ని పత్రికలు తట్లను యక్షప్రశ్నలంటున్నాయి. వీటినే కొందరు యుక్తి ప్రశ్నలని చిత్రప్రశ్నలనీ చిక్కులెక్కలని అంటున్నారు. తమాషా లెక్కలని కూడా మరికొందరంటున్నారు. వాటికెన్ని పేర్లు ఉన్నా వాటిల్లో పొడుపు కథాలక్షణాలు కొద్దోగొప్పో కనిపిస్తూనే ఉన్నాయి.

12. అడ్డుకథ :- పొడుపుకథ వేయబడ్డ తర్వాత పొడిచిన వ్యక్తిని అడ్డుకొనేందుకు మరొకటి మరొకరు పొడుస్తారు, అడ్డుకోవడానికి ప్రయోగింపబడేది కాబట్టి అడ్డుకత, అడ్డకథ, అడ్డుకథ అనేపేర్లు వచ్చి ఉంటాయి. అనంతపుర మండలంలోని కొన్ని గ్రామాల్లో ఈ పదాన్ని ప్రయోగిస్తున్నారు.

13. ఒడ్డుకథ :- పన్నుట, ప్రయోగించుట అనే అర్థంలో ఒడ్డు శబ్దం

వ్యవహృతమవుతోంది. ఒడ్డబడేది కాబట్టి ఒడ్డుకథ అనేపేరు వచ్చి ఉంటుంది. కర్ణాటక భాషాప్రభావం వల్ల ఆ సమీప ప్రాంతాల్లో ఈ పదాన్ని ఉపయోగిస్తున్నారు.

వేసేకథలు-విప్పేకథలు అనే పదాలుకూడా వినిపిస్తున్నాయి, జానపద సాహిత్యంలో రాగ యుక్తంగా పాడే ఏలకతల్లో పొడుపు కథల ఛాయలున్నవి. కొన్ని కనిపిస్తాయి, అంతమాత్రంచేత ఏలకత పొడుపు కథకు పర్యాయపద మనడానికి ఆస్కారంలేదు. తెలుగులో పొడుపు కథకు అనేక పర్యాయపదాలున్నట్లె ఇతర భాషల్లోనూ ఉన్నాయి, ఇవన్నీ పొడుపు కథా ప్రాధాన్యాన్ని తెలియ జేయటమే గాక, పొడుపు కథపై ప్రాక్తన అధునాతన మానవునికున్న జిజ్ఞాసనూ అభిరుచినీ అభివ్యక్తం జేస్తున్నాయి. మరి ఇలాంటి పొడుపు కథకు లక్షణా లేంటో తెలుసుకొందాం.

## లక్షణాలు

ఏయేకాలాల్లో ఎవరెవరెట్లా లక్షణాలు చేశారో సవివరంగా తెలుసుకోవాల్సిందే. కాని ఈ చిన్న ప్రణాళికలో అదిసాధ్యంకాదు. అందువల్ల సంస్కృతాలంకారికులు, పాశ్చాత్యులు, ఆంధ్రులు చెప్పిన లక్షణాల పిండితార్థాన్ని మాత్రమే ఇక్కడ పరిశీలిద్దాం.

పొడుపుకథ నిగూఢార్థ భావాలు కలిగి ఉంటుంది. అభిప్రాయాన్ని సూచిస్తుంది. అర్థస్వరూప వివరణం అసలే ఉండదు. ఉక్తివైచిత్రి అవశ్యం. రసానికి శత్రువు. చిత్రకవిత్వాంశ ఉంటుంది. కళాత్మకమైన గుణాలుంటాయి. చెప్పబడే విషయం కప్పబడి ఉంటుంది. స్థూలంగా సంస్కృతాలంకారికుల సారాంశం ఇది.

పొడుపుకథ ఒక జటిల ప్రశ్న. ఉద్దేశ్య పూర్వకంగా కల్పింపబడి ఉంటుంది. ఎదుటివానిని తికమక పెట్టేగుణం సహజాతి సహజం. నిజం మరుగుపుచ్చే వక్రోక్తి తప్పనిసరిగా ఉంటుంది. సూత్రప్రాయమైన ఆరంభాంశం ముగింపూ ఉంటాయి. తప్పుత్రోవపట్టించే కథనం తప్పదు. రూపకసాన్నిహిత్యం అధికం. అస్పష్టత కొన్నిట కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఇది పాశ్చాత్యుల లక్షణ సార సంగ్రహం,

పొడుపు కథలపై వ్యాసాలు వ్రాసిన ఆంధ్రుల అభిప్రాయాలను క్రోడీకరిస్తే తేలే లక్షణా లిట్లా ఉన్నాయి. పొడుపుకథలు గంభీరంగా ఉంటాయి. కవిత్వ లక్షణా లుంటాయి. రూపకాలంకార లక్షణా లుంటాయి. కళాత్మకమైన విలువ లుంటాయి. పొడుపుకథలో లయాత్మకత ఉంటుంది, సంక్షిప్తత, నిగూఢత తప్పదు.సమస్యాత్మకమై పరిష్కారాన్ని కోరుతుంది. శబ్దచమత్కార

వ్యంగ్యరామణీయకత, ఆలంకారిక ధర్మం అడుగడుగునా దర్శనమిస్తాయి. అతిశయోక్తు లుంటాయి. అపార్థ కల్పన లుంటాయి.

సంస్కృతాలంకారికుల లక్షణాల్ని, పాశ్చాత్యుల నిర్వచనాల్ని ఆంధ్ర పండితుల అభిప్రాయాల్ని అనుశీలించి పొడుపుకథా హృదయ ధర్మాల్ని పరిశీలిస్తే అష్టాదశ లక్షణ సంశోభితమై పొడుపుకథ అలరారుతోం దనాలనిపిస్తుంది. వీటన్నింటికి ఒక్కొక్క ఉదాహరణ మిస్తూ వివరిస్తూ పోగితే ఉపోద్ఘాతం బంగాళాఖాతం అన్న సామెత సత్యమవుతుంది. అందువల్ల ఇక్కడ కేవలం లక్షణాల్ని సూచించి మున్ముందు కొన్నిటికి వివరణ లిస్తాను,

1 సంక్షిప్తత 2 నిగూఢత 3 అపార్థద్యోతకత 4 కథాత్మకత 5 కథారహితాత్మత 6 ప్రతీకాత్మకత 7 ఘటనాపిశిష్టత 8 విధినిషేధాత్మకత 9 లోకోక్తి రామయణీకత 10 లయాత్మకత 11 చమత్కారచారుత 12 దృశ్యాత్మకత 13 ఆలంకారికత 14 సమస్యాత్మకత 15 రసాత్మకత 16 ధ్వన్యాత్మకత 17 సాంప్రదాయికత 18 కవితాత్మకత.

ఇంత వైవిధ్య సంశోభితమైన పొడుపు కథసాహిత్యంలో ఒక ప్రక్రియగా ప్రఖ్యాతి చెందింది, అదొక ప్రక్రియ అనేకన్నా, అది సర్వ ప్రక్రియల్నితనలో ఇముడ్చుకున్న సాహితీ విరాణ్మూర్తి అనవచ్చు. ఆ అనడం అతిశయోక్తి అనిపిస్తే ఆలంకారిక ధర్మంగా చెప్పినమాట అని భావించవచ్చు.

# వర్గీకరణం

పొడుపు కథ స్వరూపాన్నిబట్టి, స్వభావాన్నిబట్టి అనేకరకాలుగా విభజించడానికి అవకాశం ఉంది. లయాత్మకమైన గుణాన్ని ఆధారంగా తీసుకొని వచనాలు, గేయాలు, వచన గేయాలు, పద్యాలుగా వర్గీకరించవచ్చు. పొడుపు కథలకున్న పాదాల్నిబట్టి ఏకపది, ద్విపది, త్రిపది, చతుష్పది, పంచపది, షట్పది, సప్తపది, అష్టపది మొదలైన విభాగాలు చేయవచ్చు. ఒక్క పొడుపుకథకు ఒక్క విడుపున్నవానిని. ఒక్కపొడుపు కథకు పెక్కు విడుపులున్న వానిని, ఒకే పొడుపు కథలో పెక్కు పొడుపుల్నీ పెక్కువిడుపుల్నీ వేర్వేరుగా సూచింపవచ్చు. వచనాల్లో దీర్ఘ వచనాల్ని హ్రస్వవచనాల్ని, గేయాల్లో దీర్ఘ గేయాల్ని, హ్రస్వగేయాల్నీ, వచనగేయాల్లో హ్రస్వ దీర్ఘాల్ని సూచించవచ్చు.

పొడుపు కథలోని ఛంద శ్శిల్ప అనుశీలనానికి, భాషావైభవ పరిశీలనానికి ఈ పై విభజనలన్నీ తోడ్పడుతాయి. అందువల్ల పొడుపు కథలోని త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణాదుల్ని తెలియజేయడానికి వీలవుతుంది. భాషా పరిశీలనంవల్ల విశేష సంధుల్ని, ధ్వనుల మార్పుల్ని, క్రియల్ని, విశేషణాల్ని, జాతీయాల్ని, పలుకుబళ్లను, విలక్షణ ప్రయోగాల్ని గుర్తించడానికి అవకాశం కలుగుతుంది. కాని తెలుగు పొడుపుకథా హృదయాన్ని అర్థం చేసుకోడానికి విషయాన్ని బట్టి విభజించడం కన్న ఉత్తమమైన పద్ధతి మరొకటి లేదు.

1. గృహజీవన ప్రహేళికలు : ప్రపంచంలో తలమానికమైంది భారతీయ గృహజీవన వ్యవస్థ. తల్లి దండ్రి, కొడుకు కోడలు, మనుమలూ మనుమరాళ్ళు అందరూ కలసియున్న సమిష్టి కుటుంబం వసుధైక కుటుంబ వాతావరణానికి, కేంద్ర బిందువు మాత్రమే. గృహజీవనంలోని పెండ్లి పేరంటాలు, కలతలూ, కలహాలూ, శాకపాకాలు తదితరాలన్నీ దీని క్రిందికే వస్తాయి,

అనంతపురంలో తప్పెట కొడితే
అంతకు తగులు, ఇంతకు తగులు
చెరువులో ఉండే చేపకు తగులు
గాళ్ళలో ఉండే గొడ్డుకు తగులు
బాలింతకు తగులు (పసుపు)

పచ్చి పసుపును వాడుకునే పసుపుగా మార్చే అర్థాన్నే తప్పెట కొట్టడంగా పొడుపు కథాకారుడు భావించాడు. పసుపుగా మార్చేప్పుడు అంతకూ ఇంతకూ తప్పకుండ తగులుతుంది. అంతకూ ఇంతకూ అనడంలో ఇంట్లో తయారుచేసే అన్నింటికీ అనే అర్థంకూడా ధ్వనిస్తుంది. చేప వంటకానికి కూడ పసుపు తప్పని సరి అంటున్నాడు పొడుపుకథా వ్యవహర్త. గాడి పశువులను కట్టివేసే స్థలం. దెబ్బ తాకినప్పుడు, పుండు పుట్టినప్పుడు పశువుకు కూడా పసుపు అవసరమే. ఇక్కడొక విశిష్టార్థం కూడా ఉంది. గాలి అనే ఒకరకమైన రోగం పశువులకు వస్తుంది. గాళ్ళలో ఉండే గొడ్డు అంటే గాలి అనే జబ్బు చేసిన పశువు అనే అర్థం గాలి పోసిన పశువు కాళ్ళకూ వాలికకూ పల్లెల్లో ఇప్పటికీ పసుపు రాస్తున్నారు.

ఇక బాలింతకు పసుపు పూసే ఆచారం తెలుగుచాట అంతటా ఇప్పటికీ ఉంది. ఈ పొడుపు కథకో పాఠాంతరం ఉంది.

అంతారం కాడ చెట్టు గొడ్డె
అంతకు దాకె - బాలెంతకు దాకె
చెర్లున్న చేపకు దాకె
గుండులున్న కుందేలుకు దాకె
మళ్ళొచ్చి మనకు దాకె

ప్రతి పొడుపు కథకూ మాండలిక భేదమొకటి ఉందనడానికి, ఉంటుందన డానికి ఇదొక నిదర్శనం.

అన్ని ప్రేమలకన్నా - మిన్నైన ప్రేమ (తల్లిప్రేమ)

కేవల సంబంధ బాంధవ్యాలేగాక గృహజీవన సౌఖ్యానికి సౌభాగ్యానికి తోడ్పడే అనేక పరికరాలు ఈ కోవలోకే వస్తాయి.

2. శ్రామికజన ప్రహేళికలు : కూలీ నాలీ చేసేవారు, వ్యవసాయం చేసేవారు వృత్తిపనుల్లో మునిగి తేలేవారు, ఆయా సమయాల్లో శ్రమాపనోదం కొరకు పొడుపు కథల్ని పొడుచుకుంటుంటారు. వాళ్ళు వ్యవహరించేవే గాక ఇత రుల శ్రమ జీవనాన్ని సూచించేవి కూడా ప్రయోగిస్తుంటారు. అలాంటివన్నీ ఈ కోవలోకి వస్తాయి.

ఇంటి వెనుక కుప్పవేసి
కుప్పకు నిప్పును పెట్టి
కుప్ప కాలిపోతేను
అప్పులెల్ల తీరిపోయె. (కుమ్మరావం)

కుమ్మరి చేసే కర్మను ఈ పొడుపుకథ తెలుపుతుంది. కుంటమట్టి తెచ్చి కుండలుచేసి, కుప్పపెట్టి, కాల్చి అంతవరకు తాను చేసిన అప్పుల్ని తీర్చుకుంటాడు కుమ్మరి. పొడుపువల్ల పుట్టిన అపార్థ మేఘం విడుపు గాలివల్ల విచ్చిపోయింది.

నున్నటి బండమీద
నూగులు ఎండబోస్తే
నాలుకలేని పాము
నాక్కొని పోయె (మంగలి కత్తి)

నున్నటి బండతల, నూగులు వెంట్రుకలు, నాలుకలేని పాము మంగలి కత్తి, నాక్కొని పోవుట కొరుగుట. మంగలి శ్రమజీవనాన్నే తెలుపుతుంది ఈ పొడుపు కథ.

పొద్దున్నే పోయి
పెద్ద ఎనుము బావిలో పడె (కపిల)

మోటలు పోయి కరంటు మోటర్లు వస్తున్న ఈ కాలంలో కపిల వెనక్కి పడిపోయినా ఒకనాటి వరిపంట కదే ఆధార మయింది. కపిల (మోట) పాటల్లో దాగి ఉన్న జానపదుని హృదయ సౌందర్యం సాహిత్యానికే సౌందర్యాన్ని సంతరించి పెట్టింది. వ్యావసాయిక శ్రామిక జీవనాన్ని సూచించే ఇలాంటి పొడుపు కథలు వేలకొలది లభిస్తున్నాయి,

3. ప్రకృతి సంబంధి ప్రహేళికలు : ప్రకృతి జీవనానికివరవశించిన ప్రాక్తన మానవునినుండి ఆధునికుని వరకు అందరూ ప్రకృతిని ప్రయోజనవంతంగా తీర్చి దిద్దుకున్నవారే. జానపద ప్రహేళికలు ప్రకృతిని సంభావించినట్లుగా సారస్వతంలో మరే సాహిత్య ప్రక్రియ సంభావించలేక పోయింది. ఉరుములు, మెరుపులు, వానలు, వరదలు, భూమ్యాకాశాలు, సూర్య, చంద్ర, నక్షత్రాదులు, మట్టీ, గుట్టా, చెట్టూ పుట్టా, ఒక్కటా రెండా ఎన్నని ! అన్నీ పొడుపు కథలు పొదుగు కున్నాయి.

అడవిలో అక్కమ్మ తల విరగబోసుకొంది (ఈతచెట్టు)
అని అసహ్యంగా చెప్పినా ....
అడవిలో అక్కమ్మ పసుపు గుడ్డలు ఆరేసు (తంగేడి పూలు)

అని అందంగా చెప్పినా ప్రకృతి మాతను సముదాయించినట్లే, సాదర పూర్వకంగా సన్మానించినట్లే.

అంతులేని చెట్టుకు
అరవై నాల్గే కొమ్మలూ
కొమ్మకు కోటి పువ్వులూ
పువ్వుల్లో రెండేకాయలు (ఆకాశం, చుక్కలు, సూర్యుడు, చంద్రుడు)

ఆకాశానికి అంతులేదు - పొంతులేదు, ఇరవై ఏడు నక్షత్ర కుటుంబాల్ని

అరవై నాల్గే అన్నా అంతకన్నా ఎక్కువే అన్నా మునిగి పోయేదేమీ లేదు. ఒక్కొక్క నక్షత్ర కుటుంబానికి కోటి పువ్వులేం కర్మ పదివేల కోట్లూఉండవచ్చు. పువ్వుల్లో రెండే కాయలు సూర్య చంద్రులు. అనంతాకాశాన్ని, తత్సౌందర్యాన్ని వృక్ష రూపంలో బొమ్మ కట్టించిన పొడుపు కథాకారుడు ఎంత గొప్ప చిత్రకారుడో ఎంతటి ప్రకృతి సౌందర్యారాధకుడో చెప్పడానికి కొలమానాలూలేవు, కొలత బద్దలూచాలవు.

4. తిర్యక్ సంబంధి ప్రహేళికలు : పిపీలికాది బ్రహ్మ పర్యంతం ఎన్ని కోట్ల జీవరాశులున్నాయో చెప్పడం కష్టమే. కష్టమే అని ఊరుకుంటే యెట్లా ప్రహేళికాకర్తా వ్యవహర్తా ఊరుకోనే ఊరుకోడుగా ! అందుకే తన పరిచయంలోని పశుపక్ష్యాదుల్ని, క్రిమికీటకాదుల్ని పొడుపుకథల్లో బంధించేశాడు.

అడ్డగోడమీద
బుడ్డచెంబు - (ఎద్దు మూపురం)
ఉద్యోగం సద్యోగంలేదు
ఊరంతా వ్యాపకమే - తీరికే లేదు (కుక్క)

గొలుసు కట్టు లేకపోతే ఇక కుక్కకు పనేమిటి ? పనీపాటలేక అలా తిరిగి రావడమే. ప్రహేళికాకారుని పరిశీలన గమనార్హమైందే కాదు, అందే అంత రార్థం అందుకో దగ్గది, ఆచరించదగ్గది.

5. క్రీడావినోద ప్రహేళికలు : కేవల వినోదార్థం, క్రీడకొరకే అన్న దృక్పథంతో నిర్మాణమైన కొన్ని పొడుపు కథలు కనిపిస్తాయి. పొడుపుకథే ఒక రకమైన సంవాదాత్మక క్రీడ. బోడివాడెవడయ్యా, బొచ్చువాడెవడయ్యా అని పోతులూరును సిద్దయ్య అడిగాడు. బోడోడు ఎవడురా ! బొచ్చోడు ఎవడురా అని జానపదుడు దరువులు వేస్తూ తన ప్రక్కవాణ్ని అడిగినా వినోదంతో అడిగినవే కాని మరేంకాదు.

పండుగాని పండు-పసిడి వెన్నెల చెండు
పువ్వుకాని పువ్వు-పూసుకుంటె నవ్వు
కర్రగాని కర్ర కరివేపాకు జుర్రా

గొడుగుగాని గొడుగు - కొరకరాని పిడుగు
(విభూతిపండు, కుంకుం పూవు,
జీలకర్ర, కుక్కగొడుగు

ఇట్లాంటివే కాక కొన్ని దాగిన పదాలు కనుక్కోవాల్సిఉంటుంది, అవి కూడా వినోదార్థం సృష్టించబడ్డవే.

వెంకప్ప ఇంకా రాలేదు (కప్ప)
ఏదో మనవాడని ఊరుకున్నాడు (దోమ)
రేపు మాపు మందు తాగాలి (గాలి)

6. తాత్త్విక ప్రహేళికలు : తత్త్వచింతనం మానవజీవనంలో పెన వేసుక పోయిన ఒకఅంశం. ప్రాణి ప్రకృతుల సత్యనిరూపణార్థమే తత్త్వచింతన మావిర్భవించింది. తాత్త్విక భావాలు గల కర్మ జ్ఞానభక్తి సంబంధమైన ప్రహేళిక లన్నీ ఈ కోవలోకి వస్తాయి.

ముందు ఆరు కాళ్ళు
రెండు తలలు - నాలుగు చేతులు
వెనుక నాలుగు కాళ్ళు
మూడు తలలు - ఆరుచేతులు (శవ వాహనం)

చనిపోయిన తరువాత చేసే కర్మయిది. పాడెపైఉన్న శవం కాళ్ళుముందు వైపుంటాయి. పాడెను ముందువైపు పట్టుకున్న ఇద్దరితోకలసి ఆరు కాళ్ళవుతాయి అలాగే రెండు తలలు. నాలుగుచేతులు. వెనుకవైపు పట్టుకున్న ఇద్దరివి నాలుగు కాళ్ళ, శవంతో కలిపి మూడుతలలు, ఆరుచేతులు, దేవుళ్ళను స్మరించే ప్రహేళి కలు కూడా ఇందులోనే చేర్చాల్సి ఉంటుంది.

పుట్టించు వాడు
పుట్టించుదానికి
తాళి కట్టినవాడు
తగవుల తండ్రికి తండ్రి (బ్రహ్మ)

పుట్టించువాడు అన్నప్పుడే బ్రహ్మఅని తేలిపోయింది. సరస్వతి చదువు పుట్టించునది. ఆ చదువుల తల్లికి తాళిగట్టినవాడు. తగవుల తండ్రి నారదుడు.

అతనికి తండ్రి బ్రహ్మకద. మొదటే అర్థం తేల్చివేసిన పుట్టించువాడు అనే పదం చివర ఉంటే రమ్యంగా ఉండేది.

గాలికన్నా వేగంగా పోయేది (మనస్సు)
చచ్చేదాక చావనిది (ఆశ)

7. అస్పష్ట ప్రహేళికలు : ఇవికూడా కొంతవరకు తత్త్వసంబంధులే అయినా విషయం అస్పష్టంగా ఉండడం మూలాన ప్రత్యేకంగా పేర్కొన వలసి వస్తుంది. ఒకటి మాత్రం ఉదాహరిస్తాను.

గోపాలయ్య కుంటలోన
వల్లెలైదు వుత్కవోతె
వల్లెలన్ని మల్లెలాయె
నూటికొక్క వల్లెచిక్కె

ఇది ఏ మోట పాటలోనుండి జారిపడ్డ ముక్కగాని గొంతెత్తి పాడడానికి అద్భుతంగా కుదిరిపోయింది. పంచభూతాత్మకమైన దేహాన్ని కృష్ణార్పణం చేయడానికి ఓ గోపిక పోయింది. ఆ దేహం పూలమాలగా మారింది. ఇంకేం పంచభూతాల్లో కల్సిపోయింది. ఇలాగే ఊహించడానికే వీలుగా ఉండే కొన్ని గేయ ప్రహేళికల్ని జానపదులు పొడుస్తున్నారు, వీనిని అస్పష్ట ప్రహేళికల్లో చేర్చాల్సిందే మరి.

8. ఆత్మాశ్రయ ప్రహేళికలు : ఆత్మ, ఆత్మ సిద్ధాంతం పరమార్థ పరమై పోయినా, లౌకిక వ్యవహారంలో అది వ్యక్తినీ, వ్యక్తి భావననూ సూచించేదిగా స్థిరపడిపోయింది. ఆధునిక సాహిత్యంలోని భావకవిత్వమంతా ఆత్మాశ్రయ పరమైందే అనే అభిప్రాయంకూడా ఉంది. ఆత్మాశ్రయ పరమైందంతా వ్యక్తి మాత్రైక భావనే అనాలి. ఇలాంటి పొడుపుకథల్లో ఆత్మాశ్రయాలు, ఆత్మాశ్రయాభాసాలు, ఉభయాలు అని వేర్వేరు చేయడానికి ఆస్కారముంది. ఆత్మాశ్రయాల్లో వ్యక్తి సహజంగా ఉంటాడు. ఆభాసాల్లో కనిపించే వ్యక్తి వ్యక్తికాడు. మరెవ్వరో అయి ఉంటారు, లేదా ఏదో వస్తువయి ఉంటుంది. ఉభయాల్లో వ్యక్తి ఉంటాడు, ఆ మరోవస్తువూ ఉంటుంది.

పెట్టుకుంటానే
పట్టి చూసుకుంట్లి (కొప్పు)

వచ్చునీ పెట్టెలో-విచ్చుకోనుంది
తెచ్చుకో బోతేను గుచ్చుకుంటుంది
ఎంతగుచ్చుకున్నా గాని-ఏమైన మరిగాని
తెచ్చుకోమానను - మెచ్చుకోమానను. (మొగలిచెండు)

ఈ రెండు పొడుపుకథల్లో వ్యక్తి కనిపిస్తాడు, అయితే మొదటిది ఆత్మాశ్రయం. రెండవది ఆత్మాశ్రయం, అన్యాశ్రయం. రెండవది ఉభయాల కోవలోకి వస్తుంది. ఆభాసానికి ఒకటి గమనిద్దాం.

కాట్ల గాల్తి-సావిట్ల నస్తి
రోట్ల రుబ్బు రాయికి తగిలి
రోసానికి వస్తి (సున్నం)

ఇది మనిషికి సంబంధించిందే అనే భ్రమ కలుగుతుంది. కాని సున్నమని తేలినప్పుడు ఆభ్రమ పోతుంది. భ్రమ కలగడమే ఆత్మాశ్రయం. భ్రమ పోవడమే ఆత్మాశ్రయాభాసం.

9. శాస్త్రవిజ్ఞాన ప్రహేళికలు : వైద్యం, జ్యోతిషం, గణితం మొదలైన శాస్త్ర విషయాలున్న పొడుపుకథలన్నీ ఈ విభాగంలోకి వస్తాయి. ఇవి గృహ జీవనానికి సమాజ జీవనానికి సంబంధించినవే అయినా ఇందున్న ప్రత్యేక విషయాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ విభాగమొకటి చేయాల్సివచ్చింది.

వంకర టింకర-శొ
వాని తమ్ముడు-అ
నల్లని పిల్లా-మి
నాకే మిస్తావు-తే
నాలుగు కాళ్ళ - మే

అజీర్ణరోగం వచ్చి వంకర టింకరలు పోతున్నవాడికి (శొ) శొంటికావాలి. శొంటే కాదు (అ) అల్లం కలపాలి. అల్లంతో సరిపోదు (మి) మిరియం వేయాలి. ఇవన్నీ కలసి పోవడానికి (తే) తేనె కావాలి. ఇవన్నీ కలిపితే తయారైన మంచి మందు మాత్ర. ఈ మందివ్వకుంటే పెద్ద ప్రమాదం ముంచుకవస్తుంది. "మే" అంటూ కాళ్ళు నేలకు బారచాపి పడిపోతాడు. కొన్ని పొడుపు పద్యాల్లోకూడా

ఇలాంటి చిట్కా వైద్యాలు కనిపిస్తాయి. గణితసంబంధులైన పొడుపు కథల్ని ఈనాడు కొన్ని పత్రికలు ప్రకటిస్తున్నాయి. పావులూరి మల్లన గణితశాస్త్రం గణిత ప్రహేళికలకు మార్గదర్శనం చేసింది.

పిల్లికి ముందు రెండు పిల్లులు
పిల్లికి వెనుక రెండు పిల్లులు
పిల్లికి పిల్లికి మధ్య ఒక పిల్లి
మొత్తం పిల్లులు ? (మూడు)

సాధారణంగా అందరూ వెంటనే తొమ్మిది అనేస్తారు. కాని మూడే పిల్లులు అనాలి. గణిత సంబంధులైన జానపదుల పొడుపు కథలుకూడా అతి వేలంగా కనిపిస్తున్నాయి.

ఈ విధంగా విషయాన్ని దృష్టిలో ఉంచుకొని పొడుపుకథల్ని నవ విధాలుగా విభజించడానికి ఆస్కారముంది. బాలబాలికలకు సంబంధించిన పొడుపు కథలన్నింటిని ఈపైవిభాగాల్లోనే చొప్పించవచ్చు. లేదాప్రత్యేకంగా చెప్పుకోవచ్చు.

## పిల్లల పొడుపు కథలు

పిల్లల పొడుపు కథల్ని ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన అవసరముంది. బాలబాలికలచేత సృష్టింపబడ్డవి, బాలబాలికల కొరకుపెద్దలు సిద్ధంచేసినవి ఈవిభాగంలోకి వస్తాయి. నా సిద్ధాంతవ్యాసంలో వీనిని విషయ విభజనంలోనే చేర్చి తరులతా ఫలపుష్పాదుల్ని, మానవేతర ప్రాణుల్ని, మానవసంబంధుల్ని, పంచభూతాదుల్ని గృహపరికరాల్ని, వినోదపరికరాల్ని, ఖాద్య విశేషాల్ని, వ్యావసాయక సంబంధుల్ని, వృత్తి కళా సంబంధుల్ని, ప్రశ్నా ప్రాధాన్యాల్ని వేర్వేరుగా సూచించడం జరిగింది.

పిల్లలకు నేనంటే మోజు
వారు నా మీద కూర్చుని
కదిలించడానికి కాలు చాచుతారు (ఊయల)

ఊయలేకాదు, పిల్లలకు పొడుపు కథలంటే బలే మోజు ! పిల్లల ఆలోచనా శక్తిని, ఏకాగ్రతను, జిజ్ఞాసను పెంపొందించడానికి పొడుపు కథవంటి సాధనం మరొకటి లేనేలేదు.

పిల్లోడు ఎగిరెగిరి దుమాలు చుట్టు (బొన్న పేలం)

కేవలం రుమాలే చుట్టడు. తలలో ఆలోచనల్ని చుట్టపెడతాడు. రుమాలు చుట్టడం భౌతిక దృశ్యం అయితే ఆలోచనల్ని కూర్చడం భావసంబంధి దృశ్యం. ఒకటి కనిపించేది, మరొకటి కనిపించనిది.

రాళ్లు కాని రాళ్లు (ఉప్పురాళ్ళు-ఏరాళ్ళు-బేరాళ్ళు-కీచురాళ్ళు-పొయ్యిరాళ్ళు)
కాయ కాని కాయలు (ఎండ్రకాయ-మొట్టికాయ-తలకాయ)

ఈ మాట కానిమాట (టమాట) లన్ని యెవరివి? ఇంకెవరివి! పిల్లలవి, పిడుగులవి. ఇట్టి వెన్ని వందలు పుట్టినవో, ఇంకెన్ని వందలు పుట్టనున్నవో!" నువ్వు కట్టెను జాడిస్తే కూర్లకొలది పిల్లలు" అనే పొడుపు కథ జానపద బాలబాలికల సంస్కృష్టే ఏ పిల్లవాడిని కదలించినా కొల్లలుగా దూకే పొడుపు కథల్ని పిడికిట బట్టవచ్చు, గంపల కెత్తవచ్చు.

# మార్గ - దేశి - జానపద సంస్కృష్టి

విషయ స్వరూపంద్వారా వర్గీకరింపబడ్డ పై విభాగాల్లో మార్గ, దేశి, జానపద సంస్కృష్టికి చెందిన పొడుపు కథలన్నీ చోటుచేసుకుంటాయి. తెలుగు పొడుపు కథ మార్గ-దేశిల్లో ఏ ఒక్క విభాగానికో చెందిందని భావిస్తుంటారు. కాని పొడుపు కథ మార్గకు చెందింది, దేశిలోనే ఒక ప్రత్యేక విభాగమైన జానపద సంస్కృష్టికి కూడా చెందింది,

సంస్కృత వృత్తాన్ని అనుసరించినవి, తెలుగు వృత్త పద్యాన్ని అనుసరించి పుట్టినవైన తెలుగు పొడుపు వృత్త పద్యాలన్నీ మార్గలోకి వస్తాయ. తెలుగు సాహిత్యం పుట్టినప్పటినుండి వస్తోన్న కావ్యాది గ్రంథాల్లో-చాటువుల్లో ఈ ఛాయలున్న పద్యాలు కనిపిస్తున్నాయి.

"మనసిజు మామ మామ యభిమానమడంచిన వాని మామ నం
దనుని విరోధి నందనుని నందను సుందరి మేనమామ జం
ఫిన జగజెట్టి పట్టి పొడి చేసిన శూరుని తండ్రి గన్నుగన్
గొనిన సురాధినాధుని తనూభవు నాయువు మీకు నయ్యెడున్.

మనసిజుడు మన్మధుడు. మన్మధుని మామ చంద్రుడు. చంద్రుని మామ దక్షుడు. దక్షుని అభిమానమును అణచినవాడు ఈశ్వరుడు. ఈశ్వరుని మామ హిమ

వంతుడు. హిమవంతుని కొడుకు మైనాకుడు. మైనాకుని విరోధి ఇంద్రుడు. ఇంద్రుని కొడుకు అర్జునుడు. అర్జునుని కొడుకు అభిమన్యుడు. అభిమన్యుని భార్య ఉత్తర. ఉత్తర మేనమామ కీచకుడు. కీచకుని చంపినవాడు భీముడు. భీముని కొడుకు ఘటోత్కచుడు. ఘటోత్కచుని చంపినవాడు కర్ణుడు, కర్ణుని తండ్రి సూర్యుడు. సూర్యుని కన్నుగా గొనినవాడు విష్ణువు. విష్ణువు కొడుకు బ్రహ్మ. ఆ బ్రహ్మ ఆయుస్సు మీకును కలుగవలెనని ఆశీర్వాదము.

తెలుగులోని జాత్యుపజాతి పద్యాలైన కందం, ద్విపద, తరువోజ, అక్కర ఉత్సాహ, తేటగీతి, ఆటవెలది, సీసము మొదలైనవన్నీ, గేయరచనల్లోని త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర సంకీర్ణాది భేదాలన్నీ దేశిక్రిందికే వస్తాయి. ఆకారణాన్నే పొడుపు కథ దేశి యనుట. ఒక పద్యం మాత్రం ఉదాహరిస్తాను.

ముక్కున పైనము నడచును
ప్రక్కన నోరుండు గాలి పారణ సేయున్
గ్రక్కున వేసిన కూయును
మక్కువతో దీని దెలియు మనుజులు గలరే (బొంగరం).

ప్రస్తుతం లభిస్తున్న పొడుపు పద్యాల సంఖ్య కొన్నివందలలోపే ఉంది. ఇక గేయాలు, వచనాలు, గేయవచనాలు, త్ర్యస్యాది భేదాలనేకాలు దేశిక్రిందికే వచ్చినా వానిని ప్రత్యేకంగా జానపద సంసృష్టి అనాల్సి వస్తోంది. వృత్తాలు. జాత్యుపజాతి పద్యాలుకూడా జానపదుల నోట ఆడుతున్నా అవి కవి పండితుల సృష్టే, జానపదుల సృష్టికాదు. జానపద సంసృష్టియైన పొడుపు కథలకు కూడా నాగరక వాసనలు తలగక పోలేదు. పలికినవి పలికినట్లుగా గ్రంథస్థం చేయనందు వల్ల అవి కృతక సౌందర్యాన్ని సంతరించుకున్నాయి. ఈ క్రిందిది జానపదులదే.

అమ్మా! అమ్మా! పెంచావూ
అల్లీ బిల్లిగ నుంచావూ
పెద్దదాన్ని చేశావూ
పెనిమిటి పూసూ మరిచావూ
ఇంతీ! నేనూ ఈడేరా
ఈ రాత్రెవరే కూడేరూ!

ఈడేరె నా ఇల్లాల్ని
ఎత్తి పెట్టుకో యిల్లాలా !
కల్లా గాదు కాపొచ్చు
కాంతా ! నిన్ను మది మెచ్చు
తల్లీ ! తల్లీ ! తలపట్టూ
తెల్లారితే తీసెట్టూ (మల్లెమొగ్గ

సాంసారిక జీవనంలో మధుర మనోహరమైన ఒకానొక నగ్న దృశ్యం. అపురూపమైన వ్యంగ్యరామణీయకత్వం సంతరించుకొన్న ఇలాంటి పొడుపు కథ లెన్నో ఆనందవర్ధనాలు, ఆనంద వర్ధనుని ధ్వనిలక్షణ లక్షితాలు, విపులవ్యాఖ్యాన సాపేక్షితాలు. కథాత్మక, రసాత్మక, ధ్వన్యాత్మక లోకోక్తి రామణీయక తాత్మకములైన పొడుపుకథలు మచ్చుకొక్కటి పరిశీలిద్దాం.

## కథాత్మకాలు

ప్రజా జీవనాన్ని తలస్పర్శిగ తాకిన పొడుపుకథ కథారహితమైందే అని కొందరు అభిప్రాయపడ్డారు. అధిక సంఖ్యలో కథారహితమైనవే లభిస్తున్నందువల్ల వారలా అనుకున్నారు గాని నిజానికి కథాత్మకములైనవి, పెక్కులు లేకపోలేదు. ఒక సన్నని రంధ్రంనుండి వెలువడే కిరణం దూర మెక్కువైన కొద్దీ పరిధినెట్లా పెంచుకుంటూ పోతుందో కథాత్మకమైన పొడుపు కథకూడా అదే విధంగా బిందు భూతమై యుండి విప్పి చెప్పినప్పుడు సింధువుగా మారిపోతుంది. కథాత్మకమైన ఇట్టి పొడుపు కథల్ని పౌరాణికాలుగా, చారిత్రకాలుగా, సాంఘికాలుగా, కాల్పని కాలుగా విశ్లేషించుకోవచ్చు. వినే శ్రోత పరిజ్ఞానాన్నిబట్టి కథనాన్ని పెంచవచ్చు లేదా కుదింపవచ్చు.

మూడింట ముగిసెనే కథ ! (కట్టె - కొట్టె - తెచ్చె) అనేది పౌరాణికమైన పొడుపు కథే. ఒక పెద్ద కథ, ఆదికావ్య నిర్మాత వాల్మీకి అపురూపసృష్టి. పొడుపు కథాకారుని పిడికిట మూడు పదాలతో మురిసిపోయింది. ఈ పొడుపుకథ సామెతగా ఈనాడు వ్యవహరింపబడుతున్నది. కాని కథాత్మకాలైన పౌరాణిక ప్రహేళికల్లో అన్నిటి కన్న ముందు చెప్పుకోదగ్గ పొడుపుకథ యిది. కొన్నిటిలో కథ లేకున్నా ఘటనా వైశిష్ట్యం గమనించదగింది.

ఇంతి ఇంటాయన అనుకొని
తడబడి గుండె రాయి చేసుకుంది (అహల్య)
కోడి దొంగ పొద్దు పొడిచి
నేనే ఇంటాయన నన్నాడు (ఇంద్రుడు)
చక్రవర్తులలో అర్ధ వజ్ర శరీరం
కలిగి స్త్రీ కాళ్ళు పట్టిన వాడెవరు (దుర్యోధనుడు)

కథాత్మకాలైన చారిత్రక ప్రహేళికలు చాలావరకు సామెతలుగా మారి పోయాయి. "తాతాచార్యుల ముద్ర భుజాలు దప్పినా వీపు దప్పదు" అన్న సామెత ఒకనాటి పొడుపుకథే. దాని వెనుక తాతాచార్యుల వైష్ణవ మత దురభిమానం ఉండనే ఉంది.

తెల్ల వాళ్ళను తరిమాడు
నల్ల వాళ్ళకు రాజ్యాం
అంట గట్టాడో తాత (గాంధీ)
గుండు కంటె గుండె
గొప్పదన్న తెలుగు వెలుగు (ఆంధ్ర కేసరి)

ఇలాంటి వెన్నో చారిత్రాత్మకమైన ఒకానొక సంఘటననో, కొన్ని సన్ని వేశాల కలయికనో ఆధారంగా తీసుకుని నిర్మాణ మైనట్టివే, సాంఘిక జీవితాన్ని ప్రతిబింబించే కథాత్మకాలైన ప్రహేళికలు అధికంగానే కనిపిస్తున్నాయి.

కథలన్నీ వెతలాయె
కాపురం మెండాయె
నిన్న చచ్చిన కుందేలే
నేటికి కూరాయె.

కొందరు దీనికి కొయ్యతోటకూర అనే విడుపు చెప్పారు, పాపం తోట కూరకు కష్టాలు వచ్చాయి. నిన్న త్రుంచబడింది: నేటికి వంట కక్కురకు వచ్చింది. ఇంతే అర్థం. కానీ దీనికి పాఠాంతరంగా కనిపించే మరో పొడుపు కథలో రమణీయమైన కథనం ఉంది.

కతలన్నీ వెతలాయె
కాపురాలు రెండాయె

అతడు సచ్చి ఆర్నెల్లాయె
అతడేసిన కుందేలు ఇయాల్ల
మాపటి కూరకాయె
సచ్చిన మగడు సండ్లమీద
మనున్న మగడు మంచంమీద.

ఇరుగు పొరుగున ఉన్న ఓ అబ్బాయి అమ్మాయి ప్రేమించుకున్నారు. పెళ్ళి చేసుకుందామనుకున్నారు. కాని ప్రేమకథ బెడిసికొట్టింది. వారి ప్రేమకాపురం చెడిపోయింది. వారిరువురి తల్లిదండ్రులకి ప్రేమ-పిచ్చి ఇష్టంలేదు. సరసాలు విరసాలయ్యాయి. వియ్యాలు పొందాల్సిన వారు కయ్యాలకు కాలు దువ్వుకున్నారు. అమ్మాయి మెడలు విరిచి పొరుగూరు కుర్రాడికంట కట్టేశారు. ఇంకేం ఆమె ప్రియుడు ఈ ఎడబాటు కోర్వలేక ఊరిప్రక్క గుట్టక్రింద చెట్టుకురి పెట్టుకున్నాడు. ఆ యువతి అతనిమీద ప్రేమ చంపుకోలేక ఎవరికీ తెలియకుండా తమ ప్రేమ సంకేతమైన ఆగుట్ట క్రింద చెట్టుదగ్గరకువెళ్ళి రోజూ నీళ్ళుపోసి వచ్చేది. అలా ఆర్నెల్లు గడిచిపోయాయి, శవం అస్థి పంజరమైంది. ఉరితాడు చివికిపోయింది, తెగింది, అస్థిపంజరం కుప్పకూలిపోయింది. ఆ అస్థిపంజరం క్రింద అన్నాళ్ళగా నీళ్ళు పోస్తుండడం వల్ల పచ్చగడ్డి దుబ్బులుగా ఎదిగింది. అందులో ఒక కుందేలు కాపురం పెట్టింది. ఆ అస్థిపంజరం మీద పడడంతో కుందేలు చచ్చింది. ఆరోజు అక్కడికి పచ్చిన ఆ యువతి చూసింది. కుందేటి నింటికితెచ్చి కూరచేసింది. రాత్రి కడుపునిండాతిని మంచమెక్కిన భర్త, కూర సంగతి అడిగితే ఈ పొడుపు కథ ఆయువతి పొడిచింది, కుందేలు విందు భోజనం "ఖుషీ" లో ఆ భర్తకి అంతరార్థం అందిందో అందలేదో గాని ఆంధ్రదేశం నలుమూలలా ఇది తెలిసిపోయింది. "సచ్చిన మగడు".... అనే పదప్రయోగం వల్ల చచ్చిపోయిన వాడే తన హృదయాధినాథుడనీ, "మనున్న మగడు" అనే మాటవల్ల అతడు తన దేహానికి, మరీ మాటాడితే ఆ మంచానికి మాత్రమే అధికారి అనీ ఆ అతివ వ్యంగ్య సుందరంగా చెప్పినట్లయింది.

ఇట మరణించిన ప్రియుడే ఆలంబనం. వండుకొనితిన్న కుందేటికూరే ఉద్దీపనం. ఆవేదన-దుఃఖం అనుభావాలు, దైన్యాదులు సంచారి భావాలు, శోకం స్థాయిని పొంది కరుణ రసాభివ్యక్తికి దోహదకారి అవుతుంది.

పొడుపు కథల్లో పాఠాంతరాలున్నట్లే ఈ విడుపు కథనానికి ఓ కథాంతరం.

ఉంది. అది ఇది, అమెను వివాహం చేసుకున్నవాడు చండశాసనుడు. ఆమె వివాహ పూర్వ ప్రణయాన్ని పసికట్టాడు. ఆ ప్రియుణ్ణి చంపి ఊరి పక్కగుట్ట క్రింద చెట్టుకు వ్రేలాడదీయించాడు. అది ఆ ప్రేయసీ ప్రియుల సంకేతస్థలమే. తన ప్రియుడు చంపబడ్డ సంగతి ఆమెకు తెలిసిపోయింది. నాటిరాత్రే అక్కడకు వెళ్ళి అతని శరీరంమీది తోలువలిచి రపికగా తయారుచేసుకొని రోజూతొడుగు కుంటుంది. చచ్చిన మగడు అనే పాదానికి ఈ విధంగా జానపదులు అర్థం చెబు తున్నారు. ఇది కల్పనయే ఈ కల్పనను తీసివేస్తే ఈ కథాత్మక ప్రహేళిక కరుణరస నిర్భరమై ధ్వనికి నిలయమై కథాత్మకాలైన పొడుపుకథల్లో తలమాని కమై అలరారుతోందని చెప్పడానికి ఆస్కారముంది.

"పడితే పిడికెడు-విడిస్తే ఇల్లెడు" అనే పొడుపుకథ దీపాన్ని తెలియ జేస్తున్నా అది ప్రతీ కథాత్మక ప్రహేళిక విషయంలో సత్యాతి సత్యమనే చెప్పాలి. ఇక కథాత్మక కాల్పనిక ప్రహేళికలు కూడా రసరాజులై, ధ్వనుల గనులై అల రారు తున్నాయి. అట్టివాని నన్నింటిని ప్రత్యేకంగా వివరణలతో ప్రకటించాల్సిన అవసరం ఆవశ్యకత ఎంతైనా ఉంది.

## రసాత్మకాలు

పొడుపుకథల్ని రస పరిపంథులనే ప్రాచీనాలంకారికుల అభిప్రాయాన్ని తెలుగు పొడుపుకథలు వమ్ముచేసాయనే చెప్పాలి. చిటికలో పొడువబడి త్రుటిలో విడువబడే కథారహితాలైన పొడుపుకథల్లో రత్యాదిస్థాయీభావాలు రసంగా రూపు దిద్దుకోకపోవచ్చును, గాని కథాత్మకాలైన పొడుపుకథల్లో పెక్కులు రసనిలయాలై నందువల్ల కథాశ్రవణంలో శ్రోతకూడ రసానందాన్ని పొందే ఆస్కారముంది. రత్యాది స్థాయిభావాలు రసావిష్కృతికి తీసుకునే కాలమెంత అనే విషయంలో చర్చలేం జరుగకున్నా సంస్కారవంతుడైన సామాజికునికి అనగా శ్రోతకులిప్త కాలం చాలు అంటే సరిపోవచ్చునేమో! అయినా రత్యాదులు స్థాయికెక్కాలంటే కొంత కథనం జరగాలి మరి.

ముట్టకు ముట్టకు ఓ సెల్లె
ముట్టిన సేతులు ముచ్చాలు
పట్టిన సేతుల పగుడాలు
పాపకారి మా యత్త
పామొండి పెట్టె

గయ్యాళి అత్త కోడల్ని హింసించేది. అదితేలేదు, ఇదితేలేదు, అని సాధిం చేది. అమాయకురాలైన కోడలివన్నీ సహించేది. ఆయత్త కోడల్ని చంపాలను కుంది. పాముని పట్టి చంపి వండి కోడలుకు పెట్టింది.

కోడలు చనిపోయింది, అత్త ఆమెను బొందపెట్టించింది. ఈ విషయాలేవీ తెలియని ఆమె తల్లిదండ్రులు, అక్కచెల్లెండ్రు, అన్నదమ్ములు, వదినలు పండ్లు ఫలాహారాలు తీసుకొని ఆ ఊరికి వచ్చారు, ఊరిబయట బాట ప్రక్కన బొంద బొంపె మీద మల్లె. మల్లెపువ్వు, ఆమె చెల్లెలు పరుగెత్తివచ్చి మల్లె ముట్టుకో బోయింది. అంతె పై పాట వినిపించింది. తల్లీదండ్రి, అన్నా తమ్ములు అందరూ వచ్చారు. ముట్టుకోబోయారు. పేరుపేరునా అందరికీ అదే వినిపించింది. వీరంతా వస్తారని తెలసి మీకూతురు లేచిపోయిందని చెప్పాలని అక్కడికి అత్త వచ్చింది. ఆమె కూడా ముట్టుకోపోయింది. అత్తను తిడుతూ అదేపాట విని పించింది.

ఇదే కథ. ఆ పొడుపు పాట వెనుక ఇంత కథ ఉంది. ఈ కథలో మర ణించిన కోడలే ఆలంబనం. మంచిమల్లె ఉద్దీపనం. దుఃఖం ఆవేదన అనుభావాలు దైన్యాదులు సంచారీ భావాలు. శోకస్థాయియే కరుణరసంయొక్క అభివ్యక్తి.

పొడుపు కథలు సర్వరసాల కాకరాలనలేం గాని ఆరసాల స్పర్శలు పూర్తిగా లేకపోలేదు, నవరసాల్లో శృంగార హాస్యాద్భుతాలు పొడుపు కథల్లో కనిపిస్తాయి, భక్తి రసావిష్కృతాలైన పొడుపు పద్యాలు కూడా ఉన్నాయి. చమత్కార వినోదాలకు అత్యధిక ప్రాధాన్యాన్నిచ్చే వైనందువల్ల కథారహితా లైన పొడుపు కథలు రస నిలయాలు కాలేకపోయాయి.

## ధ్వన్యాత్మకాలు

కావ్యాత్మధ్వనియనే ఆనందవర్ధనుల సిద్ధాంతం సర్వజనాంగీకారాన్ని పొందంది, కథారహితాలైన, కథాత్మకాలైన పొడుపు కథల్లో వస్తుధ్వని, రస ధ్వని అలంకారధ్వనులు బహుళాతి బహుళంగా ఉన్నాయి, గుణీభూత వ్యంగ్యానికి కూడా ఉదాహరణలు కోకొల్లలుగా లభిస్తున్నాయి, ఒకటి మాత్రం పరిశీలిద్దాం.

యువకుని ప్రశ్న : అమ్మా! నీ వొళ్ళదేంది?

యువతి సమాధానం : నీకు గుర్తు లేదు.
నాకు గుర్తు లేదు
తోటమాలికి గుర్తు
అంగడి సాగిన్నాడు అందరికీ గుర్తు

ఓచేత ఒడిపట్టుకొని మెల్లగా ఓ యువతి దాటి వెంబడి నడుస్తోంది, ఆ దారిలోనే ఆమె పోకడలన్నీ తెలిసిన ఓ యువకుడు నిలబడ్డాడు, అమ్మా నీ ఒడి లోని దేంది అన్నాడతను. నిజానికామె ఒడిలో బచ్చలి కూరకూడ ఉంది. ఆమె గర్భవతికూడా, అమ్మ అనడంలోనే నీవు తల్లివి కాబోతున్నావు? నీ గర్భం స్పష్టంగా తెలిసిపోతుంది, ఇలా తిరగడం సమంజసం కాదుగా అనే అర్థం ధ్వని స్తోంది, ఆ యువతికింకా పెళ్ళికాలేదు, అందువల్లనే ఆ యువకుడలా హెచ్చరిం చాల్సివచ్చింది, ఆ యువతి గుర్తులేదు అన్నమాటలలో తన గర్భంలోని శిశువు ఆడో, మగో, తెలిసేదెవ్వరికి అనేభావం ధ్వనిస్తోంది. తోటమాలికి గుర్తు అనే మాటలో అ భగవంతునికే తెలవాలి తన పరిస్థితి అనేభావం ద్యోతకమవుతుంది, తన మంచి చెడ్డలు తన ప్రియునికే గుర్తు అనే అర్థంకూడా వస్తుంది. తాను తోటకు వెళ్ళి కూర తెస్తుంది. ఆ తోటమాలి (బహుశా ఆమె ప్రియుడే) ఒడి నింపాడు. అదేం కూరో తాను చూసుకోలేదు. ఆ విషయం కూడా అతనికే తెలుసు అని ఆమె అభిప్రాయం.

ఇక అంగడి సాగిన్నాడు అనేమాటకు ఇంట్లోకి వెళ్ళి అందరి ముందు ఒడి వలకబోస్తే ఆ కూర ఏంటో తెలుస్తుంది అని పైపైకి అర్థం వస్తుంది. కాని, యిందులో హృదయాన్ని కదిలించేసే ధ్వన్యర్థం ఉంది. అంగడి సాగడం అంటే అందరికి తెలిసేట్టు ఊరేగడమే తనకు పెళ్ళి జరగకుండానే శిశువుకు జన్మనివ్వ డం గాని జరిగితే తనపేరు వాడవాడలా మారుమ్రోగిపోతుంది. అందరూ తనన్నూ తన సంతానాన్ని చూడటానికి వస్తారు. అప్పుడు ఇక అంగడే సాగుతుంది అయితే ఆ అంగడి సాగడం తాను చూడదు. ఎందుకంటె తాను అప్పటికి సజీవంగా ఉండదు. కాబట్టి అదియిక తన చివరి ఊరేగింపే. ఇంత అమంగళం అందులో ధ్వనిస్తున్నా, ఆ ప్రియుడు వెంటనే పెళ్ళి ఊరేగింపు ఎందుకేర్పాటు చేయ కూడదు అని మంగళాన్ని కూడా ఆశించడానికీ వీలుంది

శబ్దారాలు, శబ్దంలో దాగిన ధ్వన్యర్థాలు పొడుపు కథల్లో దాగి ఉన్నా య్యంటే కళ్ళు ఇంత లింతలు చేసి వినే వారుంటారు. సహృదయంతో శిరః కంపనం చేసే వారుంటారు. ఇలాంటి ధ్వన్యర్థాలన్నీ అక్షరాకృతిని దాల్చాల్సిన అవసరం ఉంది

## సామెతలు –

ఇక పొడుపు కథల్లోని లోకోక్తి రామణీయకతను పరిశీలిద్దాం. జానపద గీతాల్లో లోకోక్తులు, జాతీయాలు, పలుకుబడులు, పదబంధాలున్నట్లే పొడుపు కథల్లోనూ ఉన్నాయి. వాటి నన్నింటిని కలిపి స్థూలంగా సామెతలు అని చెప్పుకో వచ్చు. పరిశీలనవల్ల సామెతలకూ పొడుపుకథలకూ అతి సాన్నిహిత్యం ఉన్నట్లు తెలుస్తోంది. కొన్ని పొడుపుకథలు జన వ్యవహారంలో బాగా నాని నాని సామెతల రూపును సంతరించుకున్నాయి. అలా మారడానికి పొడుపుకథ సంస్కారవంతమై కళాత్మకమైన విలువల్ని కలిగి ఉండడమే ప్రధాన కారణమని చెప్పాలి.

అన్నేసి చూడు నన్నేసి చూడు (ఉప్పు)

ఇది నేడు సామెతగా వినిపిస్తున్నా ఒకనాటి పొడుపుకథే.

సంపాదన ఒకరిది
అనుభవం ఇంకొకరిది (చేతులు - కడుపు)

ఇద్దరు పెండ్లాల మగడు
ఇరుకున పడి చచ్చెనట, (పోక)

అత్తకాలం కొన్నాళ్ళు
కోడలి కాలం కొన్నాళ్ళు (గొంగడి - రుమాలు)

ఇవన్నీ నేడు సామెతలుగానే పరిగణింప బడుతున్నాయి. వాటి విడుపులు చెప్పాల్సిందని ఎవరూ అడగడం లేదు. ఆయితే ఒక కాలంలో పొడుపు కథలుగా వీటిని పొడిచారనేది సత్యం. ఇలాంటి సామెతలను పొడుపు సామెతలుగా వ్యవహరించవచ్చు. పొడుపు కథకున్న గుణాలు లక్షణాలు ధర్మాలు పొడుపు సామెతకూ ఉన్నాయి. స్థూలంగా పొడుపు సామెతనిలా విభజించవచ్చు.

పొడుపు సామెతలు



పొడుపుకథను సామెతను కథారహితాల క్రిందనే చేర్చడం సమంజసం కాదు అవి కథానహితాలు కూడా. పొడుపుకథ విషయంలో కథాత్మకాలెలా ఉంటాయో ఇదివరకే తెలిపాను.

చేసిన చేష్టలు ఎవరు చూడరు కాని
కోసిన ముక్కు అందరూ చూచినారట.

ఈ సామెత వెనుక జగమెరిగిన కథ ఉంది. శూర్పణఖ రామలక్ష్మణుల్ని కామించింది. తన కోరిక తీరాలంటే సీత అడ్డు తొలగాలని భావించింది. సీతను మ్రింగేయాలని తలంచింది. అలాంటి రక్కసి ముక్కు కోయాల్సిన పరిస్థితి ఏర్పడింది. లక్ష్మణుడా పని చేశాడు. ఆమె చేసిన చేష్టల సంగతి చూడని జనం కోసినముక్కును చూచి లక్ష్మణున్ని ఆడిపోసుకున్నారు. కథ యెంతైనా చెప్పవచ్చు. నాటి కథ నేటి జీవితాలకు సమన్వయించవచ్చు. ఇట్లే చారిత్రకాల్ని, సాంఘికాల్ని, కాల్పనికాల్ని, కథారహితాల్లోని వివిధ భేదాల్ని వ్యాఖ్యానించవచ్చు. ఈ సామెతలన్నింటిని పరిశీలిస్తే పొడుపుకథకూ సామెతకున్న సాదృశ్య సాన్నిహిత్యాలు బహిర్గతమవుతాయి.

రెండింటనూ సంక్షిప్తత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది, ఉక్తివైచిత్రి రామణీయకతలో పొడుపుకథకన్న పొడుపు సామెతేం తీసిపోదు. కథానహితత్వం రెండింటనూ సమానమే. కథారహితాలైనవి రెండింటను బహుళ సంఖ్యలో ఉన్నాయి. కేవలం ఒకానొక ఘటనా వైశిష్ట్యం వల్ల పొడుపుకథ సామెత రూపుదిద్దుకోవడం కనిపిస్తుంది. అపార్థద్యోతకత పొడుపుకథల్లో ఉన్నట్లే కొన్ని సామెతల్లోనూ ఉంది. రెండింటిలో లయాత్మకత, శబ్దతీక్షణత భాసిస్తోంది. ఆలంకారికత, అర్థనిగూఢత, సమస్యాత్మకత, ప్రతీకాత్మకత మొదలైన లక్షణాలు పొడుపుకథల్లోనూ సామెతల్లోనూ ఉన్నాయి.

అరటాకు మీద ముల్లుపడ్డా
ముల్లు మీద అరటాకు పడ్డా
అరటాకుకే ప్రమాదం (కన్య-పురుషుడు)

ఈ సామెతలో కన్యకు ప్రతీకగా అరటాకును, పురుషునికి ప్రతీకగా ముల్లును గ్రైకోడం జరిగింది. పొడుపుకథల్లో ఈగుణం సర్వే సర్వత్ర కనిపిస్తోంది.

నడచిపోయే నల్ల రాతికి
నాలుగే లింగాలు (గేదె)

ఇందులో నేరేడును నల్లరాతిగా, గేదె చన్నుల్ని లింగాలుగా సంకేతించడం జరిగింది. ప్రతీకాత్మకమైన గుణాలు పొడుపుకథల్లోనూ సామెతల్లోనూ ఇదే విధంగా దర్శనమిస్తాయి. ఇలా రెండింటికి ఉన్న సాదృశ్య సారూప్య సాధర్మ్యాల వల్ల కొన్ని సామెతలు పూర్వాశ్రమంలో పొడుపుకథలే అని తెలుస్తోంది. ఆ కారణాన్నే వాటిని పొడుపు సామెతలుగా పిలవాలనడం. ఆచార్యుడు పూర్వరూపం అంతేవాసి ఉత్తరరూపం అనే ఉపనిషదుక్తిని పొడుపుకథ పొడుపు సామెత సార్థకం చేశాయి.

## పలుకుబళ్లు

సామెతలవల్ల పొడుపుకథ ఏ విధంగా సౌందర్యాన్ని సంతరించుకుందో పలుకుబళ్లూ-పదబంధాల వల్లకూడా ఎన్నెన్నో వన్నె చిన్నెల్ని కూర్చుకొంది. కొన్ని పలుకుబళ్ళనూ, పదబంధాల్ని, విలక్షణ ప్రయోగాల్ని పరిశీలిద్దాం.

"అంగడిలో పెట్టి అమ్ముట, తక్కెట్లో పెట్టి తూచుట, అడుగున్నర కాయ, అంతులేని ఆకు, కొమ్మ కొమ్మకు కోటి పువ్వులు, తోకతో నీరు త్రాగుట. అందరాని వస్త్రం, అంబుల్లి జంబుల్లి పుట్టుట, అయ్యవారి మఠం వేయుట, అగ్గి మీద అయ్యవారి మఠం. తేనెతేటలు గట్టు; అక్కాచెల్లెళ్ళ అనుబంధం, అడవిలో ఆబోతు రంకె, అడవి మ్రాను నరకుట. చెంబులో నీళ్ళన్ని చెడ తాగుట, నాడు పాములు వచ్చి పైన పడుట, నోరు గుప్పు మనుట, నోరు చప్పు నుండుట, తాడేసి కట్టింది తైతెక్కలాడింది, పెరుగులో మునుగుట, అడ్డుగోడమీద బుడ్డ చెంబు, అత్తగాని అత్త, ఆద్దంకి చెరువులో ముద్దంకె పిట్ట, అంతకుం తగులు ఇంతకి తగులు, అన్ని కాయలకంటె పెద్దకాయ, అన్నంతిని గోడకు చేరబడుట, నిప్పుల గుండం దొక్కు, నీరై మాకిపోవు, సోలి యింట్లోపడు, అమ్మను నాయన ఊడ్చుకొనిపోవు, అమ్మపెట్టె అట్లు, ఊదేరేను-ఇంట్లో ఉన్నాను. అమ్మకడుపున పడుట, అరచేతి క్రింద అరసి అప్పచ్చి, అరచేతిలో కుంకుమ, బంటు బంటుకు బందూకు, అరవై బారల చీర-ఇరవై మూరల రవిక, అల్లో నేరేడుకాయ ఆడుట, దూలాలు స్తంభాలు కదులుట, అమ్మాత్త మొగుని ఆభరణం, గోరంత కొప్పుపెట్టు"....ఈవిధంగా వేలకొలది వెలికి వసాయి. క్రియల్ని, విశేషణాల్ని, ధ్వనుల మార్పుల్ని, మాండలికాల్ని, అన్య దేశాల్ని, ప్రత్యేక ప్రత్యేకంగా పరిశీలించడానికి అవకాశం ఉంది. అవని భాషా శాస్త్రవేత్తలకు వదలి వేద్దాం. కొన్ని విలక్షణ ప్రయోగాల్ని చూద్దాం.

"కొయ్యలమారి, గిచ్చులమారి, ఆమారాదేశం. తుమారాపండ్లు, ఆకాశ గిరిగిరి, నేలబడితే తక్కినన్న, నేలకిడాం, ఇకఇకతాయ, పకపకకాయ, కాయ కీలు, ఇగములు జగములు, సీక్‌పొద, కట్టిపడేస్తేనకి, కటక్, కటక్, కటక్, కసికపువ్వు, ఈడ ధమధను ఆడ ధమధమ, ఉర్లొస్తుంది-పొర్లొస్తుంది.ఉటంగి-రటంగి-పెటంగి, ఉటంగి జాణలు, ఉసుల్లగుజ, ఎక్కినకా ఎక్కినకా-లాలుకాడు, ఏబ్రాసి, పోబ్రాసి, కైకరచెట్టు, కతకతకంగు- మాతాతపింగు, కరకరకంగాని, గుంగుంలాడుట, చార్లచార్ల చెంబు, సురి(డి)బొమ్మలు, చింతా కాయి, దొంతాకాయ, చిటుకు పొటుకులాడి, చిత్తే(త్రా)రాకులు, చిలపచిలపనీళ్ళు జిగటాకోల, జటాకోరు, జమ్మాకోరు, జనజనక, పులిపిల్లవాడు. జిలుగు జిలుగు నీళ్ళు, జయ్యిమని, సయ్యిమని. తోకాయ, పోతారాయుడు, మాతారాయుడు, జలజలగాడు, దిబదిబలాదేవి, వంకసిరి గలవాడు, బండంగి, గున్నావులు...."

ఆయా పొడుపుకథా సందర్భాల్ని దృష్టిలో పెట్టుకొని ఇలాంటివిలక్షణ ప్రయోగాల కన్నింటికి భాషాశాస్త్రదృష్ట్యా అర్థ వివరణ చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. విపుల ప్రహేళికా ప్రపంచాన్ని పరిశీలించి పరిశోధిస్తే ఇలాంటివే ఇంకా అనేకం బయల్పడతాయి.

## లయలు

పొడుపుకథను భాషా శాస్త్ర దృష్ట్యా పరిశీలిస్తే బయల్పడే అపూర్వ వైభవం గమనార్హం. అట్లే ఛందస్సులోని దేశీరీతుల్ని రాగలయ తాళాల్ని పరిశీలించడడానికి పొడుపుకథ ఉపయోగపడుతుంది. పొడుపుకథలోని త్ర్యస్రాదిభేదాలన్నీ దేశీరీతుల్నే ప్రకటిస్తున్నాయి.

త్ర్యస్రము : మూడు మాత్రలు గల గణాలన్నీ త్ర్యస్రా లనబడతాయి. నగణము (III), గలము (UI), లగము (IU), మొదలైనవి, పాదంలో పద పదానికి త్ర్యస్రమున్నా, లేదా మొత్తం పాదానికి ఆరో, తొమ్మిదో, పన్నెండో మాత్రలుండి త్ర్యసగతి నడచినా అది త్ర్యస్రంగానే పిలువబడుతుంది.

చుట్టు చుట్టు పొట్లకాయ
జూద మూడె పొట్లకాయ (జాబు)

ఇందు పాద పాదానికి 12 మాత్రలున్నాయి. త్ర్యస్రగతిని పొడుపు కథ నడిచింది.

2. చతురస్రము : నాలుగుమాత్రల గణాలు చతురస్రాలు, నలము (IIII) భగణము (UII), సగణము (IIU), జగణము (IUI) గగము (UU) మొదలైనవి చతురస్రాలు. పాదాల్లో పదానికి చతురస్రమే ప్రయోగింపబడ్డా లేదా పాదానికి ఎనిమిది, పండ్రెండు, పదహారు, ఇరువది మాత్రలుండి; చతురస్రగతిని నడచినా అది చతురస్రమే అవుతుంది.

సురసుర కత్తులు
సురారి కత్తులు
రాజులు తెత్తురు
రాణుల కిత్తురు (మొగలి పూవు).

ఈ పై పొడుపుకథలో పద పదానికి 4 మాత్రలు రావడమే కాక పాదపాదానికి ఎనిమిది మాత్రలు వచ్చాయి.

3. ఖండము : అయిదు మాత్రలు గలవి ఖండగతి గణాలు. నలలము (IIIII) భలము (UIII), తగణము (UUI), రగణము (UIU), నగము (IIIU), సలము (IIUI), జలము (IUII), యగణము (IUU), మొదలైనవి ఖండగతి గణాల క్రిందికి వస్తాయి. పొడుపుల్లో పదపదానికైదు మాత్రలున్నా లేదా పాద పాదానికి 5,10,15 20 మాత్రలున్నా ఖండమే అవుతుంది.

ఇంతంత గుడికాయ
ఈ చుట్టు గుడికాయ
చింతల్ల తోపులో
బొంత మామిడికాయ
ఏమిచ్చి కొనగలరు
వెలమ దొరలు (చందమామ).

ఇందు చివరి పాదం తప్ప ప్రతిపాదంలోను పదిమాత్రలుండడమే గాక గతి తప్పని లయ గమనింపదగింది. ఖండ గతిని నడిచే దీర్ఘగేయ ప్రహేళికలు కొన్ని జానపదులు కోలాట భజనల్లో ఉపయోగిస్తున్నారు. ఈ క్రింది పొడుపు కథలో అన్ని పాదాలు 10 మాత్రలున్నాయి.

గుంటలో జన్మించి
గుడిసెలో జీవించి
సంతలో నిల్చుండి
పంక్తిలో వాలింది

4 మిశ్రమము : ఏడు మాత్రలు గలవి మిశ్రగతి గణాల క్రిందికి వస్తాయి. పదము లేదా పదబంధం 3+4 గాను, 2+5 గాను విభక్తమైతే శ్రుతికింపుగా ఉంటుంది. 4+3 గా 5+2 గా విభక్తమైతే శ్రుతిసుభగత్వం తక్కువే. "గుమ్మడేడె గోపిదేవి-గుమ్మడేడే కన్నతల్లీ' మొదలైన జానపద గేయాలన్నీ మిశ్రగతిలోనే నడిచాయి.

నల్లని పండు
పుల్లగ నుండు (చింతపండు)

చెయ్యని కుండ
పొయ్యని నీళ్ళు
వెయ్యని సున్నం
తియ్యగ నుండు (టెంకాయ)

పైరెండవ పొడుపుకథలో మూడవపాదంలో ఒక మాత్ర ఎక్కువగా ఉంది. ఇవన్నీ దీర్ఘాంతాలుగా ఉచ్చరిస్తే చతురస్రాలుగామారే అవకాశంఉంది ఉన్నట్లుగానే ఉచ్చరిస్తే 4+3 మాత్రలు ప్రతి పాదంలో ఉంటాయి. ప్రాచీనాంధ్రకవులు హరిణగతి, వృషభగతి, రగడల్ని మిశ్రగతిలోనే నడిపించారు.

5 సంకీర్ణము : 9 మాత్రలు గలవి సంకీర్ణము లనబడతాయి. అయితే ఇందులో 3+3+3 గా విభక్తమైనవి మాత్రం త్ర్యస్రాలుగానే పరిగణింపబడతాయి. 2+7, 4+5, 5+4 మాత్రలుగా విభక్తమైనవి మాత్రమే సంకీర్ణాల కోవలోకి వస్తాయి.

ఎండిన బావిలో
పిల్లల గంతులూ (పేలాలు)
ఓరోరి లక్ష్మణ
ఒళ్ళంత గిచ్చులు
కారాకు పచ్చన
కండంత తియ్యన (సీతాఫలం)

పై మొదటి పొడుపుకథలో 4 5మాత్ర లున్నాయి. రెండవ దానిలో 5+4 మాత్రలున్నాయి. రెండూ సంకీర్ణాలే. అయితే సంకీర్ణాల్లో ఒక మాత్ర తగ్గితే చతురస్రంగనూ, ఒక మాత్ర హెచ్చితే ఖండంగాను రూపొందుతాయి.

లయలు హొయలు తెలుగు పొడుపుకథలో ఉండడానికి అవి అధికంగా త్ర్యస్రాది మాత్రాగణ బద్ధాలే అయి ఉండడం ప్రధాన కారణమనాలి. వృత్తాలు జాతులు ఉపజాతులు, రాగలయ తాళానుగుణంగా ఉండడానికి కూడా కారణం అవి గణబద్ధాలు అయి ఉండడమే. పద్యాల్లో మాదిరిగానే తెలుగు పొడుపుకథల్లో యతులు ప్రాసలు కనిపిస్తున్నాయి. అవన్నీ పరిశీలిస్తే తెలుగు పొడుపుకథ దేశిఛందస్సు కందించిన అమూల్యాలంకారాలు బహిర్గత మవుతాయి.

## అలంకారాలు

పొడుపు కథకున్న ప్రధాన లక్షణాల్లో ఆలంకారికత ఒకటి. పొడుపు కథ రూపకాలమాల అనే అభిప్రాయం ఎంతో ఆలోచించి చెప్పిందే. శబ్దాన్నాశ్రయించిన శబ్దాలంకారాలు, అర్థాన్నాశ్రయించిన అర్థాలంకారాలు ఆయా లక్షణాల్లో పరిధి మేరకు పొడుపుకథను సమాశ్రయించాయి. ఒకటి రెండు మాత్రం పరిశీలిద్దాం.

చుట్టూ కంప
కంపల పెంకు
పెంకుల శంఖు
శంఖుల తీర్థం (టెంకాయ)

ఇలాంటి ముక్త పదగ్రస్తాలు తెలుగు పొడుపుకథల్లో అధికంగానే కనిపిస్తున్నాయి. పొడుపు కథలోనే ముక్తపదగ్రస్తం గాక విడుపును ముక్తపదంగా తీసుకొని తయారు చేసిన గొలుసుకట్టు పొడుపుకథలు కూడా ఉన్నాయి. అంత్యప్రాసానుప్రాసలు కూడా బహుళంగానే కనిపిస్తున్నాయి.

చింపిరి చింపిరి గుడ్డలు
ముత్యాలవంటి బిడ్డలు (మొక్కజొన్నకంకి)

శబ్దాలంకారాల్లో ఎడనెడ వృత్త్యనుప్రాస, లాటానుప్రాస, ఛేకానుప్రాస, యమకాదులు కూడా తెలుగు పొడుపు కథల్లో పొడుపు పద్యాల్లో ఉన్నాయి. ఒకటి రెండు అర్థాలంకారాల్ని పరికిద్దాం.

గడంత సానికి
ముంతంత కొప్పు (జొన్నకంకి)

ఇంపుగడ, ముంత ఉపమేయాలు, సాని కొప్పు ఉపమానాలు, అంత అనేది ఉపమావాచకం, సాదృశ్యధర్మం లేదు. లుప్తోపమ. పొడుపు కథల్లో కొన్ని వినూత్నమైన ఉపమావాచకాలు కూడా కనిపిస్తాయి. ఉపమానము వాచ్యమై ఉపమేయం మరుగులో ఉండే రూపకాతిశయోక్తుల సంఖ్యయే పొడుపు కథల్లో అధికాధికంగా అనాలి.

నల్లటి బండ క్రింద
నలుగురు దొంగలు (గేదె చన్నులు)

మరుగున ఉన్న ఉపమేయాన్ని కనుగోవడమే పొడుపు. నల్లటిబండ, నలుగురు దొంగలు ఉపమానాలు. గేదెచన్నులు ఉపమేయాలు. ఉపమేయాలు చెప్పకున్నా ఉపమానాల్ని బట్టి తెలుసుకోవాలి. ఉపమేయాలకు ఉపమానాల్యాద్రూప్యం చెప్పబడింది. కాబట్టి రూపకాతిశయోక్తి అలంకారమయ్యింది. అర్థాలంకారాల్లో అతిశయోక్తి ప్రతీప, శ్లేష, చిత్రోత్తర (ఉత్తర), సూక్ష్మ, సమాసోక్తి, గూఢోక్తి, లోకోక్తి, వక్రోక్తి, వ్యాజోక్తి, విరోధాభాస, ముద్ర మొదలైన అనేకాలంకారాలు పొడుపు కథల్లో ఉన్నాయి. కొన్ని అపూర్వాలంకారాలుకూడా ప్రాదుర్భవించే అవకాశం ఉంది.

పొడుపుకథా సాహిత్యానికే మూలస్తంభాలైన ప్రతీకల చిత్రవిచిత్రగతి విన్యాసాలే అనేకాలంకారాలు ఆవిర్భవించడానికి హేతుభూతాలయ్యాయి. ఆ విషయం ప్రత్యేక ప్రత్యేకంగా ప్రస్తావించుకోవాల్సిన అవసరం ఉంది.

## ప్రయోజనాలు

క్రీడాప్రాయాలైన వినోద గోష్ఠుల్లోనూ, గుప్తంగా సంభాషించడంలోనూ, తెలుపాల్సిన వ్యక్తికే అర్థమయ్యే విధంగా చెప్పడంలోనూ పొడుపుకథ ఉపయోగపడుతుందని ప్రాచీనాలంకారికులు అభిప్రాయపడ్డారు.

మార్గాయాసం తీరాలన్న, వర్షాలు రావాలన్నా, రాజకుమార్తెల ప్రజ్ఞా ప్రాభవాలకు తగిన భర్తలు లభించాలన్నా ప్రాచీన కాలంలో ప్రహేళికల్ని ప్రయోగించినట్లు తెలుస్తోంది. పెళ్ళిళ్ళలో వినోదం కోసం కూడా పొడుపు కథల్ని ఉపయోగించేవారు. రాజులు పండిత సభలు నిర్వహించి పొడుపుకథల

పోటీలు పెట్టి గెలిచినవారికి సన్మానం చేసేవారు. ఓడిపోయినవారు ద్రవ్యమివ్వడమో, దాస్యం చేయడమో, దూరదేశం వెళ్ళిపోవడమో జరిగేది. పూర్వకాలంలో వేశ్యలు తమ దగ్గరికి వచ్చేవారి సంఖ్యను పరిమితం చేయడం కోసమో లేదా విద్వాంసుల పొందులను అభిలషించో, తమ ప్రహేళికా ప్రశ్నలకు సమాధానం చెప్పిన వారినే లోనికి రానిచ్చేవారు. ఇలాంటి సందర్భాలలో వేసే ఒక పొడుపు కథ ఇలా ఉంటుంది. "నాకత యిప్పిన వానికి పసుపు పాన్పు, పక్కలో చుక్క, చెప్ప లేని వానికి, కొంపలకు చెప్పులుగట్టి ఎదపై ఎర్రగడ్డివేసి గాడిదపై ఊరేగిస్తా" అని వేశ్య చమత్కరిస్తుంది. కథలు వేయడం, విప్పడం ఒకనాటి సరదా. అంతేగాక ప్రాచీనకాలంలో రాజులు యుద్ధాల్ని నిరోధించి ప్రజల మానప్రాణాల్ని రక్షించే నిమిత్తం తమ తమ ఆస్థానాల్లోని పండితుల మధ్యన పొడుపు కథల పోటీలు పెట్టేవారు. ఏ పండితుడు ఓడితే ఆ పండితుని రాజు ఓటమిని అంగీకరించేవారు. ఇవన్నీ కర్ణాకర్ణిగ వినిపిస్తున్న విషయాలైనా వాస్తవాలే.

పొడుపు కథలవల్ల అనేక ప్రయోజనాలున్నాయి. సామాజిక విషయం సంబంధమైన పొడుపు కథలన్నీ మననం చేయడం వల్ల లోకజ్ఞానం అబ్బుతుంది. కవుల సృష్టితమైన పొడుపు పద్యాలవల్ల భూత వర్తమానాలకు చెందిన అనేక విషయాలు తెలుస్తాయి. తర్క, వైద్య, గణిత, జ్యోతిశ్శాస్త్ర విషయ నిష్ఠాలైన పొడుపు కథాధ్యయనంవల్ల శాస్త్ర విషయ పరిజ్ఞానం కలుగుతుంది. హాస్యరసాల్లో ముంచివేసే గుణాలు పొడుపు కథలకున్నందువల్ల పఠితలో, శ్రోతలో క్రీడాసక్తి పెరుగుతుంది. జటిల ప్రశ్నమైన పొడుపుకథకు సమాధానం చెప్పడానికి కొద్దో గొప్పో ఆలోచించాల్సిన అవసరం ఉంటుంది. అందువల్ల ఆలోచనాశక్తి పెరుగుతుంది. ఒకరినొకరు పొడుపుకథ అడగాలంటే అడిగేవాడికి తెలుసుండాలి. అ తెలిసి ఉండడానికి ధారణ కావాలి ధారణవల్ల జ్ఞాపకశక్తి పెరుగుతుంది ముక్తపదగ్రస్తాలైన పొడుపుకథల్లో తోకపద్యాల గుణం ఉంది. ఒకోసారి కొత్తవి కూడా తయారు చేయాల్సివస్తుంది. ఆ కారణాన వాచకశక్తి కూడా పెరుగుతుంది. అస్పష్టాలు, అసందర్భాలు, అనుచితాలుగా అనిపించే పొడుపు కథలకు విడుపులు సాధింపబడాలంటే సమన్వయ జ్ఞానం అవసరం. అందువల్ల సమన్వయశక్తి కూడా అధికాధికమవుతుంది. పొడుపుకథలు వ్యక్తిలో జ్ఞానాన్ని పెంచుతాయి. అనైకాగ్రతను తొలగించి ఏకాగ్రతను సమకూరుస్తాయి. మురిపించే ముచ్చటగొల్పు ముచ్చటలు అదే పనిగా వింటూ పోతుంటే చమ

-త్కార సంధాయకమైన మాటలగారడి అబ్బుతుంది. అన్నిటికి మించి మానసిక వికాసం పెరుగుతుంది.

చమత్కార రూపంలో వివిధ విషయ పరిజ్ఞానాన్ని కలగించడానికి ప్రాదుర్భవించిన పొడుపుకథ ఏ ఒక్క ప్రయోజనాన్నో సాధిస్తుందనే కన్నా అది సాధించని దేది లేదు అంటేనే న్యాయంగా పలికినట్లవుతుందేమో. పొడుపుకథా హృదయంకూడా ఆనందంతో పొంగిపోతుందేమో!

## భాషల బంధుత్వం

తెలుగులో పొడుపు కథలున్నట్లే ప్రపంచంలోని సర్వ భాషల్లోనూ పొడుపు కథలున్నాయి. గ్రీకు, లాటిన్, హిబ్రూ, పారసీ మొదలైన ప్రాచీన భాషల్లోనూ, వర్ధమాన భాషల్లోనూ ఇవి కనిపిస్తున్నాయి. సంస్కృతంలో లక్షలకొలది ప్రహేళికలుండేవని ఇప్పుడు కొన్నివేలే లభిస్తున్నాయని పరిశోధకులంటున్నారు. భాషలు వేరైనా పొడుపు కథలకున్న భావ బంధుత్వం గమనించదగింది. కొన్ని భాషల్లోని పొడుపు కథలతో తెలుగు పొడుపుకథల్ని పోల్చి చూద్దాం.

చెట్టుపై నివసిస్తాను గాని పక్షిని గాను,
చర్మం ధరిస్తాను కాని సోమయాజిని కాను
మూడు కళ్ళను కలిగి ఉందును గాని
శూల పాణిని గాను
నీరు కలిగి ఉంటాను గాని కుండను గాను
అంతకంటే మేఘాన్నికాను
మరి నే నెవరిని (టెంకాయ

దీనికి మూలం ఇప్పుడు లభిస్తున్న అయిదారు తెలుగు పద్యాలైనా అయి ఉండాలి. లేదా సంస్కృతశ్లోకమైనా అయిఉండాలి.

వృక్షాగ్రవాసీ న చ పక్షిరాజః
చర్మాంగధారీ న చ సోమయాజీ
త్రినేత్ర ధారీ న చ శూలపాణిః
జలంచ బిభ్రన్న ఘటో నమేఘః

చెట్టు చివర ఉంటుంది కాని పక్షిరాజు కాదు. చర్మాంబరధారికాని సిద్ధ యోగి కాదు. మూడు కళ్ళుంటాయి గాని శివుడు కాదు. నీటిని ధరిస్తుందికాని కుంభకాదు, మేఘమూ కాదు.

ఈ విధంగా తెలుగు పొడుపు కథలకు సంస్కృత ప్రహేళికలకు పోలిక లెన్నో కనిపిస్తున్నాయి. "జనని సమస్త భాషలకు సంస్కృతభాష ధరా తలమ్మున్" అనేమాట తెలుగు పొడుపు కథల విషయంలో సార్థకమయ్యింది. ఈ క్రింది కన్నడ ఒగటు గళకు (పొడుపు కథకు) సమానమైన తెలుగు పొడుపు కథ లెన్నో ఉన్నాయి.

కంబ-కంబద మేలె
గుంబ-గుంబద మేలె
హుల్లు-హుల్లినలి హుళు. (పేలు)
కంబం, కంబం మీద కుంభం, కుంభం మీద గడ్డి, గడ్డిలో పురుగు.

అంబాల మీద కుంభాలు - కాళ్ళు - పిరుదులు
కుంభాల మీద కుడిత్తొట్టి - కడుపు
కుడిత్తొట్టి మీద గుండ్రాయి - తల
గుండ్రాయి మీద కోరింతా - కండ్లు
కోరింత మీద ఆరిక అవురూ - వెండ్రుకలు
అవురు గడ్డిలో ఆవులు వేలూ - పేలు

తెలుగు దేశంలోని వివిధ మండలాల్లో ఈ పొడుపు కథ అనేక విధాలుగా వినిపిస్తోంది. ఈ క్రింది తెలుగు పొడుపు కథలకు సరిపోలిన తమిళ భాషలోని పొడుపు కథను (విడుకతైని) గమనిద్దాం.

చూడ కళ్ళు లేవు
నడవ కాళ్ళు లేవు
తుంటమెక్కి చేతులు
పట్టుకొంటాడు .... - (చొక్కా)
తలలేదు మొలలేదు
చేతులున్నాయి కాళ్ళులేవు .... - (చొక్కా)
కడుతు వుండు తల యిల్లై
కయ్యుండు విరవిల్లై
ఉడల్ వుండు ఊయర్ యిల్లై - (చొక్కా)

పడవుంది తలలేదు. చేతులున్నాయి వేళ్ళు లేవు. ఒడలుంది ఊపిరిలేదు.
త కన్నడ తమిళాల్లో తెలుగు పొడుపుకథకు భావ సామ్యమున్నట్లే
ళాంధ్రాలకూ సారూప్యం కనిపిస్తోంది.
ెండు మిద్దెలకు
ఒకటే దూలం (ముక్కు) అనేది తెలుగు పొడుపు కథ కాగా....
రెండు కిణరిన్ ఒరుపాలెం (ముక్కు) రెండు బావుల కొకటే మోట దూలం
ులయాళ పొడుపు కథ (విడికద) అయ్యింది. రాష్ట్రీయభాషయైన హిందీ
ోకు తెలుగు పొడుపుకథలకూ భావ సామ్యం కనిపిస్తూనే ఉంది.

ఇధర్ గయీ-ఉధర్ గయీ

పీసే ఖర్ జగహ్మే బేఠ్ గయీ (చేతికట్టె) ఇక్కడకు వెళుతుంది.

కు వెళుతుంది. పైనంత ప్రదేశంలో కూర్చుంటుంది.

ఊరంత తిరిగొచ్చి-మూలకు నిలబడ్డది. (చేతికట్టె)

ఆంగ్ల ప్రభావం అన్ని భాషలపై ఉంది. తెలుగులోకూడా ఆంగ్లాన్ని కొలది
ేదా సంపూర్ణంగానో అనుసరించిన పొడుపు కథలు కొన్ని కనిపిస్తున్నాయి.

ఉదయం నాలుగు కాళ్ళతో నడిచేది
మధ్యాహ్నం రెండు కాళ్ళతో నడిచేది
సాయంత్రం మూడు కాళ్ళతో నడిచేది
(మనిషి - పసితనంలో నాలుగుకాళ్ళ
పెరిగాక రెండుకాళ్ళు
వృద్ధాప్యంలో మూడుకాళ్ళు)

దీనికి మూలం ఆంగ్లంలో ఇదేవిధంగా What animal is that which on four feet in the morning on two at midday, and on in the evening ? The answer is MAN.

గ్రీకు పురాణాల్లో ఈ విషయం ఉంది. ఫిసియం పర్వతం దగ్గర స్ఫింక్స్
, వింత మృగం ఉండి ఆదారిన పోయేవారిని ఈ పొడుపుకథ అడిగేది.
వారిని తినేది. మనభారతంలోని సర్పయుధిష్ఠిర సంవాదం, యక్షప్రశ్నలు
టివే. ఈ విధంగా ప్రపంచంలోని సర్వభాషల్లో వినిపిస్తున్న పొడుపుకథల్లో

భావసామ్యం ఉంది. ఇవి ఒకదానిని అనుసరించవచ్చు లేదా స్వతంత్ర కల్పనలు కావచ్చు. ఏదియేమైనా భావ వ్యక్తీకరణలో మానవులంతా ఒక్కటే అనే సిద్ధాంతాన్ని పొడుపు కథ గట్టిగా బలపరుస్తుందని నిశ్చయంగా చెప్పవచ్చు.

## ప్రభావం

తెలుగు పొడుపుకథ చుంబించిని సాహిత్యప్రక్రియ లేదన్నా అతిశయోక్తి కాదేమో. నన్నయ్యకాలం నుండి నేటివరకూ వచ్చిన అనేక సాహిత్యగ్రంథాల్లో, చాటువుల్లో, పొడుపుకథలు లేదా ఆ లక్షణాలున్న పదమో, వాక్యమో, పద్యమో, కనిపిస్తూనే ఉంది. శాలివాహన గాథా సప్తశతి. పావులూరి మల్లన గణితశాస్త్రం, ఎఱ్ఱన భారతం, పోతన భాగవతం, శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యం-చాటువులు, పెద్దన మను చరిత్ర, సూరన కళాపూర్ణోదయం, మోహనాంగి మారీచీ పరిణయం, జక్కన విక్రమార్క చరిత్ర. పాలవేకరి కదరీపతి శుకసప్తతి, అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి, కోఅవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, అనంతామాత్యుని భోజరాజీయం, మంచన కేయూర బాహుచరిత్ర, వేమన పద్యాలు, కవి పండితుల చాటువులు మొదలైన వాటిల్లో పొడుపు పద్యాలు, పొడుపు కథల ఛాయలున్న పద్యాలు కనిపిస్తున్నాయి. ఈ శతాబ్దంలోనివే అయిన కాశీమజిలీ కథలు, భట్టివిక్రమార్క చరిత్ర, అపూర్వచింతామణి మొదలైన బృహద్గ్రంథాలలో పొడుపుకథలు, తచ్ఛాయలు కావలసినన్ని ఉన్నాయి.

ఇక ఆధునిక కాలంలోని అష్టావధానాల్లో, తిరుపతి కవుల పద్యాల్లో, ఆధునిక పక్షలగేయ వచన కవితల్లో, పత్రికలు ప్రచురించే చమత్కార సంభాషణల్లో పొడుపు కథల ఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ముఖ్యంగా కొన్ని పత్రికలు పొడుపుకథలకు ప్రత్యేక శీర్షికలు పెట్టి ప్రచురించాయి. వాటికృషి ప్రశంసనీయమైంది. ఒకప్పుడు "బాల" మాస పత్రిక చేసిన కృషి గణనీయమైంది. నీలిమ (ఈ మధ్యనే ఆగింది.) ఆంధ్రభూమి (వారపత్రిక) బాలజ్యోతి మాసపత్రికలు చేసిన కృషి బహుజనాదరణీయమైంది.

మంచం క్రింద మామయ్య
సంతకి వెళదాం రావయ్య

(చెప్పు)

ఇది చాలా సంవత్సరాలక్రితం [జనవరి 1951-బాల పత్రిక] ప్రకటించిందే.

ఐదు అక్షరముల మహారాజుకి
మూడు అక్షరముల ముద్దుల యువరాజు
మూడు అక్షరముల ముద్దుల యువరాజుకి
రెండక్షరముల మురిపాల రాణి

[దశరధుడు-రాముడు-సీత]

నీలిమ మాసపత్రిక 1977 అక్టోబరు మాసంలో ప్రకటించిన పది పొడుపు కథల్లో ఇది ఒకటి. ఆంధ్రభూమి వారపత్రిక ప్రతివారం ఏదో ఒకటి పొడుపుకథో చిక్కులెక్కో తమాషాలెక్కో ప్రకటిస్తూనే ఉంది. ఈ క్రిందిది 11-9-80 నాటి పత్రికలోనిది.

ఋతువులో వుంది
లతలో వుంది
కన్నెపిల్ల సిగ్గులో వుంది
దేవుని దయలో వుంది
స్నేహ పరిమళంలో వుంది ఏమిటిది ? (తులసీ దళం)

ఆకాశవాణి, బాలానందం బాలవినోదాల్లో ఈనాటికి పొడుపుకథల్ని వినిపిస్తూనే ఉంది. జానపదగేయాల్లోనూ, తాత్త్విక సంబంధి ప్రహేళికలు వినిపిస్తున్నాయి. ఈ క్రిందిది ఆ గేయంలోని ఒకముక్క.

ముక్కూ మొగమూ లేని పక్షి
ముప్పయ్యారు గుడ్లు పెట్టి
డెబ్బైయ్యారు సుట్లు తిరిగి
ఇరవయ్యారు పిల్లల్నేపె
తెలిసినోనికి తెలియునన్నా
తెలియనోనికి మదన చిక్కన్నా
దీని భావం బట్టబయలు
దాని పేరె కుమ్మరి సారెన్నా

బాలానంద-బాలవినోద కార్యక్రమాల్లో వినిపించే వాటిని పిల్లల పొడుపు కథల్లోనే చేర్చాలి.

ఇంటిరంగు ఎరుపు
దానిలోపల తెలుపు
నల్ల మనుషులుంటారు- (అపిల్)

ఇక పొడుపుకథ చలనచిత్రాల్ని కూడా వదలిపెట్టలేదు. సినిమా పాటలు వ్రాసిన వ్రాస్తున్న రచయితలు చాలామంది చేయి తిరిగిన వారే. వారు తమ తమ బాణీల్లో చిత్రకథ కతికేట్లుగా పొడుపు కథాగేయాల్ని కూర్చారు. పొడుపుకథకు కొత్త రంగులు హంగులు కూర్చారు. మల్లాది రామకృష్ణశాస్త్రి, కొనరాజు. డా.సి. నారాయణరెడ్డి, ఆరుద్ర, ఆత్రేయ, అప్పలాచార్య ఒకటో, రెండో ఇంకా ఎక్కువో పొడుపుకథల్ని కూర్చో, కల్పించో, పాటలు వ్రాసినవారే. జయభేరి. ఎత్తుకు పైయెత్తు, చిన్ననాటి స్నేహితులు, జమీందార్, బడిపంతులు, ఇల్లు ఇల్లాలు, బంగారక్క, అండమాన్ అమ్మాయి, మూగ మనసులు, గాలిపటాలు, ఇల్లరికం, ముగ్గురుమూర్ఖులు, బాలరాజుకథ, పూజాఫలం, నీతి నిజాయితి, మంగమ్మశపథం (పాతది), సీతారామకళ్యాణం, పాతాళభైరవి మొదలైన అనేక చలన చిత్రాల్లో పొడుపుకథల సినిమాపాట లున్నాయి. తూర్పుపడమరలో ఒక పొడుపుకథ అనేక పర్యాయాలావృతమవుతుంది. జమీందార్ సినిమా పాటలోని మూడు పొడుపుకథల్లో ఒకటి మాత్రం ఉదాహరిస్తాను.

చుక్కలు పొడిచే వేళ
అహా! మక్కువ తీరేవేళ
ఆడపిల్లే పొడుపుకథ పొడవాలి
అందగాడే తెలుసుకొని విప్పాలి
కిటకిట తలుపులు కిటారి తలుపులు
ఎప్పుడు తీసిన చప్పుడు కావు
ఏమిటి? ఏమిటి?
కిటకిట తలుపులా
కిటారి తలుపులా .... ఓహో
కిటకిట తలుపులు, కిటారి
తలుపులు గడసరి చూపుల
కన్నుల రెప్పలు - కన్నుల రెప్పలు

ఈ విధంగా తెలుగు పొడుపుకథ వివిధ సాహిత్య ప్రక్రియల్ని స్పృశించడంతో ఊరుకోక, ప్రచార ప్రసార సాధనాల్లోకి కూడా చొచ్చుకొని పోయి

వాటికే వినూత్న సౌందర్యాల్ని సంతరించి పెట్టింది. పొడుపుకథకున్న బహుళ ప్రచారం - ప్రాచుర్యం, ప్రభావం మూలాన్నే అది అన్ని రంగాల్ని స్పృశించ గల్గింది.

## పరిశీలన — ఫలశ్రుతి

కవిప్రౌఢోక్తుల అర్థాల్ని దర్శిస్తే మహదానందం కలుగుతుంది. ఆ ఆనందానికి కవే ప్రధానకారకుడని చెబుతున్నా దర్శించే వాని సంస్కారాన్ని కూడా పరిగణనలోకి తీసుకోక తప్పదు. అట్లే జానపదుల ప్రౌఢోక్తులుగా కనబడే పొడుపుకథల్లో అమూల్యార్థాల్ని దర్శించ గల్గుతాం. పొడుపుకథ పోడిమికి మహదానందాన్ని పొందగల్గుతాం.

కటకట రాముల కడుపుల పుడితి
ఏమైపుడితి - ఏం సుఖ పడితి
ఆడదానితో దెబ్బలు దింటి
ఆగకుంట పోయి అగ్గిల బడితి (పిడక)

పిడక పేడ నుండి తయారవుతుంది. పేడను పశువులిస్తాయి. పశువుల్లో గోవు శ్రేష్ఠమైంది. హిందువులకు గోవు దైవమే. రాముడు పురుషోత్తముడై ధర్మమూర్తి అయ్యాడు. అందువల్ల జానపద గృహిణులిక్కడ గోవుకూ రామచంద్రునికీ అభేదాన్ని పాటించారు. ఆ కారణాన్నే పిడకతో రాముల కడుపున పుట్టాననిపించారు. ఆ భగవంతునికి పుట్టినా నేనేం సుఖపడ్డానని పిడక అంటోంది. చివరకు స్త్రీతో కూడా దెబ్బలు తిన్నానంటోంది. పేడను పిడకగా చేసేప్పుడు బాగాపిసుకుతారు. ముద్దగా చేస్తారు. రెండు మూడు దెబ్బలు కొట్టి అరచేయి వెడల్పు చేసి గోడకేసి కొడతారు. అది యెండిన పిదప వంటచెరుకుగ ఉపయోగిస్తారు. అందుకే ఆగలేక పోయి అగ్గిలో పడ్డానని పిడకతో జానపదు లనిపించారు.

ఇక్కడ ఒక సంప్రదాయం తెలుసుకోవలసి ఉంది. గ్రామీణులు పూర్వం నుండి పిడకలు చేస్తున్నారు. వంటచెరుకుగా ఉపయోగిస్తున్నారు, కుంపట్లు కప్పు తున్నారు, పాలదాలిలో వేస్తున్నారు. పిడకకు అగ్గి ముట్టించి బూడిద తొట్టిలో పెట్టి బూడిదను కప్పుతారు. ఆపిడకకున్న నిప్పు మరునటి రోజు వరకు అలాగే ఉంటుంది. దీన్నే కుంపటి అంటారు. అగ్గి పెట్టెలు లేనికాలంలో పుట్టిన ఈ ఆచారం ఇప్పటికీ ఉంది. ఇదంతా గమనిస్తే మరి జానపదుణ్ని నిత్యాగ్నిహోత్రి అనాలనిపిస్తుంది.

ఇక పాలదాలిలో పిడకలు వేయడం కూడా ఒక ప్రయోజనాన్ని ఆశించే జరుగుతుంది." దాలి అంటే పాలకడవ పట్టేంతటి గుంత. అందులో పిడకలు వేసి నిప్పుపెట్టి పాలకుండ నుంచుతారు. పాలు మెలమెల్లగా వేడెక్కుతాయి. కట్టెల పొయ్యి మీద పాలకడవ నుంచడంవల్ల తొందరగా వేడెక్కి పొంగిపోయే అవకాశం ఉంది. అలా కట్టెపొయ్యిపై పాలకుండ పెడితే అతి జాగ్రత్తగా చూస్తూకూర్చోవాల్సి ఉంటుంది, దాలిగుంతలో పిడకలు వేయడం వల్ల హఠాత్తుగా పొంగే ఈ ప్రమాదం నుండి తప్పించే అవకాశం ఉంది. ఈ పొడుపుకథలో పిడక ఆగలేక అగ్గిలో పడ్డానని ఎంత ఆవేదనను వ్యక్తీకరించినా, అందువల్ల మానవ జాతికి మాత్రం మహత్తరమైన ప్రయోజనం సమకూరింది.

ఈ పొడుపుకథ విడుపు పిడకకు సంబంధించిందే అయినా బహిర్గతార్థం వల్ల ఎవరిదో వేదన-రోదన సుస్పష్టమవుతోంది. నాయికా నాయకులు లేకున్నా వారి వెనుక ఉన్న బాధామయ జగత్తుపరిశీలిస్తే గంపెడర్థం అందుతుంది. "జేనెడు పిట్ట మూరెడుతోక" నిజమవుతుంది.

"ఈదేసన కోల

ఇంజమూరు వాయె" అంటే బాట, ఇంజమూరేం కర్మ, ఇంద్రప్రస్థంవరకూ పోతుంది. పొడుపుకథ కూడా అంతే. వ్యక్తి, కుటుంబం, గ్రామం, రాష్ట్రం విశ్వం, ధర్మం సమస్తాన్ని సమ్మానించింది పొడుపుకథ. వాటిలో తానుంది అవన్నీ తనలో దాచేసుకుంది. అందుకే అది విశ్వజనీనమయింది.

"ఊరంతకి ఒక్కటే దుప్పటి" అంటే ఆకాశం. "మీయమ్మ మాయమ్మ ఒక్కరే" అంటే తులసమ్మ. ఈ విధంగా భావించడం సాధారణ విషయం కాదు. నిండా ధర్మదృష్టి కలిగిన పొడుపుకథా కర్త ఏనాటివాడో ఆనాటి నుండి ఈనాటి వరకు అదృష్టితోనే పొడిచాడు - పొడుస్తున్నాడు - పొడుస్తాడు. ఆ దృష్టి అందరికీ అబ్బేవరకు తప్పదు మరి.



# పొడుపు సామెతలు

"సామెతలేని మాట ఆమెతలేని ఇల్లు" అనేది తెలుగు భాష ప్రాశస్త్యాన్ని తెలుగువారి గృహధర్మాన్ని వెల్లడిస్తోంది. ఆ మాట ఆ ఇల్లు నిరర్థకాలనే అభిప్రాయం ఊరక పుట్టిందికాదు. ఆమెత అంటే విందు. విందు భౌతిక సుఖాన్ని ఇస్తుంది. సామెత మానసికానందాన్ని కలిగిస్తుంది. శరీరానికి పుష్టి మనస్సుకు తుష్టి ఉన్నప్పుడు మనిషి చేసే కార్యాలన్నీ ఫలిస్తాయి. అందువల్ల ఆప్తె పలుకులో అనుభవసారమున్నదని తెలుస్తోంది.

అనుభవానికి వ్యాప్తి ఉంది. గంధానికీ - గాలికీ - నీటికీ వ్యాప్తి ఉంది. వాటిని ఒకదగ్గర చేర్చాలి, అది తత్సారమవాలి, కూర్చడానికి నేర్పు కావాలి. అప్పుడది సామెత అని పిలువబడుతుంది. ఇంతకూ సామెత అంటే తేలిన సారాంశం అనుభవసారమని.

అనుభవసారాలైన సామెతలెప్పుడు పుట్టాయో నిర్ధారణ చేయడం కష్టం. భాష ఎప్పుడు పుట్టిందో, భావమెప్పుడు ప్రసరించిందో, మనిషిలోని కళా కౌశల్యం ఎప్పుడావిష్కృతమైందో - సామెత అప్పుడు పుట్టింది.

పొడుపుకథ ఒక సంకేతం. ఆ సంకేతం కళాత్మకమైన విలువల్ని సంతరించుకున్నప్పుడు సామెత సాక్షాత్కరిస్తుంది. అన్ని పొడుపుకథలు అట్లే సాక్షాత్కరిస్తాయనడానికి అవకాశం లేదు. కొన్నిటికే ఆ అవకాశం ఉంది. అలా రూపు దిద్దుకున్నవానినే పొడుపు సామెతలంటాను. కాని వాటికి పూర్వమున్న పేరే ఉంటుంది,

పుట్టు పూర్వోత్తరాలు :

ప్రాచీన భారతీయ సూత్ర వాఙ్మయమంతా సామెతల మయం. వేదము సూత్రబద్ధం, సూత్రమనుభవసారం, అనుభవసారమే సామెత. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, కావ్యాలు సామెతల ద్వారా అందచందాల్ని సంతరించుకొన్నాయి. ప్రపంచంలోని సర్వవాఙ్మయాల ప్రారంభదశలో ఉద్భవించిన సారస్వతమంతటా ఈ సామెతలు కనిపిస్తున్నాయి, ఆ తర్వాతా కనిపిస్తున్నాయి. అందులో సామెతలుగా పరిగణింపబడ్డ పలుకులు జనవ్యవహారం నుండి గ్రంథస్థమైనట్లుగానూ, లేదా గ్రంథకర్త కూర్చిన కమ్మని మాటలు జనసమ్మాన్యాన్ని పొంది సామెతలనబడినట్లుగానూ ఊహించడానికి వీలుంది.

ప్రకృతి తన ధర్మాన్ని ఆచరిస్తుంది. ఆ అనుభవాలు మానవునికీ ఉన్నాయి. విజ్ఞాన ప్రసారానికో, వినోదానికో ఆ అనుభవసారం మూట గట్టబడింది. ఆమూటే పొడుపుకథ. అదీ సామెత రూపుదాల్చింది.

సాంప్రదాయిక విజ్ఞాన మొకటి ఉంది. అది తరతరాలనుండి అంత స్రోతస్విని అయిన సరస్వతివలె ప్రవహిస్తోంది. ఆ విషయం కూడా ముడుపు కట్టబడి పొడుపుకథ అయ్యింది. దానిని జనత సమ్మానించి సామెతగా తీర్చి దిద్దుకొంది.

1. సంపాదన ఒకరిది
అనుభవం ఇంకొకరిది [చేతులు-కడుపు]

ఇది ఒకనాటి పొడుపుకథ. ఇప్పుడిది సామెతల సరసన కూచుంది. దీని అర్థమేంటని ఇప్పుడెవ్వరూ అడగడంలేదు. పనిచేసి సంపాదించే వాడొకడై, అనుభవించే వాడింకొకడైన సర్వకాలాల్లోనూ ఇది ప్రయోగింపబడుతుంది. కాని ఇటువంటి గుణాలు తనలో ఉన్నాయని మానవుడల్లుకొన్న పొడుపుకథ ఇది. రానురాను తాననేది పక్కకు జరిగింది. పొడుపును విప్పడంలోని క్లేశాన్ని దూరం చేసుకొని అర్థం కూడా మరచిపోయి ప్రజలు దానిని జాతీయం చేశారు. ఇప్పుడు దానికి సామెతగా ప్రాచుర్యముందిగాని పొడుపుకథగాలేదు. సామెతకున్న సారళ్యాన్ని బట్టి ఈనాడు దానినెవరూ పొడుపుకథగా భావించడం లేదు. ఒకడి పాటు పదిమంది సాపాటు అనేదిట్టిదే.

2. ఇద్దరు పెండ్లాల మగడు
ఇరుకున పడి చచ్చెనట [పోక]

ఇద్దరు భార్యలున్న భర్త కష్టాలపాలే అని లోక వ్యవహారముంది. వ్యవహారమనేది ఊరకనే పుట్టదు. ఇక్కడ సమాజమే సంస్కరణాన్ని అభిలషిస్తోంది. కాని ఈ అర్థంలో ప్రయోగింపబడక పూర్వం ఇది ఒక పొడుపుకథ. భోజనానంతరం తాంబూలం వేసుకోడం లేదా బాగాలు వేసుకోడం కొందరి కలవాటు. అప్పుడు పోకల్ని అడకొత్తి మధ్యకు చేర్చి కత్తిరిస్తారు. పోక రూపం చెడిపోవడమే చావడం.

3. చక్కనమ్మ చిక్కినా చక్కనే [సబ్బు]

సౌందర్యవతి కృశించినా చక్కగానే ఉంటుంది. జన వ్యవహారంలో ఈ పొడుపుకథ ఇలా ఉన్నా ఇది మాటి మాటికి ఆవృతమైన ద్విత్వకకారం యొక్క శబ్దాలంకారం వల్ల కళాత్మకమైన విలువల్ని సంతరించుకొని చక్కని సామెత అయింది.

సామెతల్లో సాజాలుకుపైగా కథావిరహితాలైనవి ఉన్నా కథా సహితాలెన్నో లేకపోలేదు. కథాసహితాలైన సామెతలన్నీ పొడుపుకథలే.

4. చేసిన చేష్టలు ఎవరూ చూడరు కాని
 కోసిన ముక్కు అందరూ చూచినారట.

భార్య పొరపాటు చేస్తుంది. భర్త తీవ్రంగా దండిస్తాడు. ఆదండనం వల్ల ఆమె శరీరంపై కొన్ని గుర్తులేర్పడతాయి. అవి కొట్టవచ్చినట్లు పదిమందికి కనిపిస్తాయి. కొందరమ్మలక్కలు బుగ్గలు నొక్కుకొని భర్తను తిట్టిపోస్తారు. కొందరికి ఆమె చేసిన తప్పేంటో తెలుసు, వారప్పుడు పైవిధంగా అంటారు. ఇక్కడ భర్త ముక్కు కోయాల్సిన అవసరం లేదు. చెంపపగలగొట్టినా, వీపు చితుక గొట్టినా పై సామెతనే అంటారు. ఈ సామెత వెనుక జగమెరిగిన కథ ఉంది. శూర్పణఖ రామలక్ష్మణుల్ని కామించి వచ్చింది, వారు ఆమెను ఆట పట్టించారు. తనకోరిక తీరడానికి సీత ఆటంకమని శూర్పణఖ సీతను మింగడానికి యత్నించింది. అప్పుడు లక్ష్మణుడామె ముక్కు చెవుల్ని కోశాడు. ఆ కథ ప్రజల్లో ప్రచలితమై పై పొడుపుకథగా సంకేతింపబడింది. లక్ష్మణుడు శూర్పణఖ ముక్కుకోయడమని దీనిని సమాధానించాలి. కాని ఇది సంకేతింపబడ్డ ఒకానొక పొడుపుకథ అన్న సంగతి జనం మరిచిపోయింది. దానిని సామెతగా చెప్పు కొంటుంది. సుదీర్ఘమైన శ్రీరామ చరిత్రంలో ఇది ఒక సంఘటనమే. అందువల్ల సంఘటన పొడుపుకథ రూపు సంతరించుకొని సామెతగా పరిణామం చెందిందన డానికి ఇది ఉదాహరణ మవాలి. సంఘటనకు ఈ క్రిందిది కూడా చెప్పుకోవచ్చు.

5. అంకె లేని కోతి
 లంకంతా చెరచిందట

పిల్లవాడు చెప్పిన మాటవినక ఇంట్లోని వస్తువుల్ని నాశనం చేస్తున్నప్పుడు, పొరుగింటివారో బంధువులో ఇలా అనడం సర్వసాధారణం. కాని దీని వెనుక సీతా సందర్శనానంతరం హనుమంతుడు అశోకవనాన్ని పాడుచేయడం, లంకను గాల్చడం మొదలైన సంఘటనలున్నాయి. అల్లే ప్రకృతి ధర్మాన్ని భావించిన మానవుడు పొడుపుకథగా కూర్చగా అదీ సామెత అయ్యింది.

6. శివరాత్రికి చంకలెత్తనీయదు. [చలి]

మాఘ మాసంలో మహాశివరాత్రి వస్తుంది. అది చలికాలం. చలికి "ఉహుహూ" అనిలోకాలు వణకుతాయి. ప్రజలెక్కడ కూర్చొన్నా ముడుచు కొంటారు. ఆచలి చంకలెత్తనీయదు. ప్రకృతి ధర్మాన్ని కూడా అల్లే పొడుపు కథలో చొప్పించడం జరిగింది.

ఒక జాతి జీవనాడులూ నాగరికతా సంస్కృతులూ ఆజాతి యేర్పరచు కొన్న సాంప్రదాయిక విజ్ఞానంలో ఉంటాయి. ఆవిజ్ఞానం మీద ఆజాతి అస్తిత్వం నిలబడి ఉంటుంది.

7. ఆలి పంచాయితీ (రామాయణం)
పాలి పంచాయితీ (భారతం)

ఈ సామెత భారతీయ నాగరికతా సంస్కృతుల పరమోత్కృష్ట గ్రంథా లయిన రామాయణ భారతాల్ని సూచిస్తోంది. ఇది సామెత రూపు సంతరించు కొనక పూర్వం ఆలి పంచాయితీ అంటే రామాయణమనీ, పాలిపంచాయితీ అంటే భారతమని విడుపు చెప్పేవారు. కాని రానురాను విడుపుకథలు పొడుపుకథల్లో ఐక్యమై పోయాయి.

ఈ విధంగా ఈనాడు సామెతలుగా పిలువ బడుతున్న వెన్నో పూర్వం పొడుపుకథలే అని నిరూపించడానికి వీలుంది. ఒకప్పుడు అవి పొడుపు కథలు, ఇప్పుడుసామెతలు, పరిశీలిస్తే అవి పొడుపు కథలనిపించాయి. పొడుపుకథల గుణాలు కొన్నిట్లో దూరమైనట్లనిపించినా ఆవాసనల్ని ఆలంబనంగా చేసుకొడం వల్ల ఛాయామాత్ర ప్రహేళికల వలె అవి భాసిస్తున్నాయి.

మొత్తం మీద ప్రహేళికా గుణ సంపూర్ణాలై, గుణార్ధాలై, గుణాంశాలై వెలసే వీటిని స్థూలంగా విభజించే అవకాశముంది. సూక్ష్మపరిశీలన చేస్తే ఒక్కొక్క దానిలో ఇంకా అనేక విభాగాలు ఉద్భవిస్తాయి. కేవలం సామెతల్ని మాత్రమే గ్రహించి ఆటువంటి సూక్ష్మ విభజన చేయడంలో సారకత ఉంది. ఇవి పొడుపు సామెతలు. అందువల్ల స్థూల విభజనమే తగినదనిపిస్తూంది.

వాక్యాల్లోనే సంకేతింపబడ్డాయి. మొదట అవి వివరణను ఆకాంక్షించే ప్రశ్నా రూప ప్రహేళికలే. రానురాను పొడుపు సామెతలయ్యాయి.

9. వంకమూతి రామసిల్ల
పట్నమంత పాడుసేసె

ఇది నేడు సామెతగా పరిగణింపబడుతుంది. కాని ఒకనాటి పొడుపుకథే. జనవ్యవహారంలో నానీ నానీ సామెత రూపు సంతరించుకుంది. పాండవాభిమాని యైన బలరాముడు, వారికష్టాలకు కారకుడు దుర్యోధనుడని భావించాడు. ఆ దుర్యోధనుని మీద కలిగిన కోపంతో హస్తినా నగరాన్ని నట్టేట ముంచ సంకల్పించాడు. ఆయన ఆయుధం నాగలి. హలధారియై బయలుదేరి హస్తి నను చాల వరకు నట్టేటముంచాడనే పురాగాథాకథనం. పై పొడుపుసామెతకు నాగలి అనే విడుపు చెప్పినా పూర్వాపరాలతో ఈ గాథ వివరిస్తేగాని అర్థం సమగ్రంగాభాసించదు.

10. మూడింట ముగిసె కథ :

శ్రీమద్రామాయణ మహాకావ్యార్థాన్ని పొడుపుకథ తనలో పొదుగుకొంది. "కట్టె-కొట్టె- తెచ్చె" అని విడుపు చెప్పినా, రామకథ అంతో ఇంతో అన్నా చెప్పక తప్పదు. దశరథుడు అయోధ్యను రాజధానిగా చేసుకొని కోసలదేశాన్ని పరిపాలిస్తున్నాడు. ఆయన పుత్రులైన రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు మిథిల రాజపుత్రికలతో వివాహం జరిగింది. దశరథుడు కైకకిచ్చిన వరాలవల్ల సీతా రామలక్ష్మణులు అరణ్యానికి వెళ్లాల్సి వచ్చింది. లంకాధిపతి రావణుడు సీతనప హరించి సముద్రందాటి ఆమెనులంకలోని అశోకవనంలో ఉంచాడు. అప్పుడు రాముడు వానర సైన్య సహకారంతో వారధి కట్టాడు, రావణున్ని కొట్టాడు, సీతనుతెచ్చాడు. మూడింటితో ముగిసి పోయింది కథ అంటే ఇదేమరి.

రామాయణాంశాలు, భారతాంశాలు, భాగవతాంశాలు, శైవవైష్ణవ మత సన్ని వేశాల్ని సంయోజించుకొన్న పొడుపుసామెతలుకొన్ని లభిస్తున్నాయి. ఒకనాడు ఆయాకథార్థాల్ని, కథాంతర్గత సన్నివేశాల్ని నెమరువేసుకొనే ఉద్దేశంతోనే ఏర్పడ్డ పొడుపుకథ పొడుపు సామెత అయ్యింది.

శల్యసారథ్యం, కర్ణుడిమీదే కథంతానిల్చింది, నవ్వునాలుగందాల చెరుపు, రామాయణంతో పిడకలవేట, అందరూ ఒక ఎత్తు అగస్త్యుడు ఒకఎత్తు. పాండ వుల సంపాదన దుర్యోధనుల వారి పిండాకూళ్లకు సరి, కోతలకు ఉత్తరకుమా రుడు, కైకపుట్టి రాముపట్టం చెరచింది, యాదవకులంలో ముసలంపుట్టినట్లు,

రాముని పాదాలు తగిలితే రాళ్లరమణులౌతవి, రావణాసురుడి కాష్ఠంవలె. ఇలాంటి సామెతలన్నీ పురాగాథల అర్థాల్ని సూక్ష్మంగా అందించిన ఒకనాటి పొడుపుకథలే. గొంగళిపురుగు సీతాకోక చిలుకగా పరివర్తన చెందిన విధంగా ఇవన్నీ సామెతల సరసన కూచున్నాయి. ఇక చారిత్రకాల్ని పరిశీలిద్దాం.

చారిత్రకాలు :

పౌరాణికాలకు ఆధారాలు పురాణ గ్రంథాలు. చారిత్రకాలకు ఆధారాలు చారిత్రక గ్రంథాలు. చరిత్ర కాధారాలు శాసనాలు. కేవలం శాసనాల ద్వారానే సంపూర్ణచరిత్ర నిర్మాణం గాదు. నాటి కావ్యనాటకాది గ్రంథాలు, వస్తుశిల్పాలు, ప్రజాజీవన సంస్కృతులు, జనవ్యవహారాలు, క్రైఫియ్యత్తులు, మొదలైనవెన్నో చరిత్రకాధారాలవుతాయి. ఆదృష్టితో మాత్రమే చరిత్ర సంబంధులైన పొడుపు సామెతలు పరిశీలించాల్సి ఉంది.

11. తాతా చార్యుల ముద్ర భుజముదప్పినా వీపుదప్పదు.

భారతదేశంలోని ఒకేవైదికధర్మమునందు కాలచక్ర పరిభ్రమణంలో మతాలు మతాంతరాలనేకాలు అనేక కారణాలవల్ల ఆవిర్భవించాయి. ఈ మతాలు తమభక్తుల గుర్తింపునిమిత్తం వివరీత విధానాలవలంబించాయి. అలా వచ్చిందే ఈ ముద్రల పద్ధతి.

శ్రీకృష్ణదేవరాయల గురువుగా ప్రసిద్ధికెక్కారు తాతాచార్యులు. వారు వైష్ణవమత దురభిమానులు. వైష్ణవ దీక్షాస్వీకార సందర్భంలో వచ్చిన వారికి వారు కాల్చిన కడ్డీలతో వైష్ణవ శ్రీచక్రాల్ని ముద్రలుగా వేసేవారు. ఆ ముద్రల్ని భుజాల పైననే గుర్తించే ఆచారముంది. అక్కడికి వచ్చినవారు ఒకవేళ ముద్రలు వేయించుకోడానికి భయపడి పరుగెత్తితే ఆచార్యులవారు వారివెంబడి పడి ముద్ర లొత్తేవారు. ఇక ఆముద్రలు భుజాలుదప్పినా వీపుపై తప్పక పడుతుండేవి.

కథాత్మకాలైన ఇటువంటి చారిత్రక ప్రహేళికలే కాలక్రమంగా సామెతలుగా మారిపోయాయి. ప్రహేళికాంశ అందులో భాసిస్తున్నందువల్లనే పొడుపు సామెతలనబడుతున్నాయి.

12. ఉద్ధతుల మధ్య పేదల కుండతరమ

శ్రీ కృష్ణదేవరాయలు అతనికూతురు మోహనాంగి చదరంగమాడుతున్నారు. రాయల రాజూమంత్రి మధ్యన మోహనాంగి భటుడు చిక్కాడు.

అప్పుడు మోహనాంగి బలవంతులమధ్యన పేద ఉండలేదుకదా అనే అర్థంవచ్చే పైపద్యపాదం అనేసింది. కృష్ణరాయలు ఆ పద్యాన్ని వ్రాసినకవిని బహుధా ప్రశంసించాడు

"కటికుచాలు ఒత్తుకొని వచ్చాయి, వాని ఉద్వృత్తి గమనించిన తరుణి తనుమధ్యం తొలగిపోయింది. 1 అది ఉంటే కనబడదామరి! ఉద్ధతుల నడుమ పేదల కుండతరం కాదుగదా!" అనే కావ్యార్థం లౌకికార్థ సంపన్నమై చరిత్ర పుటలకెక్కింది. ఆ సామెత వెనుక ఇంతకథ ఉంది. అందుకే చారిత్రక సంబంధులైన పొడుపుసామెతల సరసన చేరింది.

చారిత్రక మహాయుగాల్లో ప్రభువులు, ప్రజలు, మేధావులు, సాధువులు, సంస్కర్తలు మొదలైన వారి జీవనాల్ని స్పృశించే కథాత్మకాలైన పొడుపు సామెతలెన్నో ఉన్నాయి.

"గజమూమిథ్య పలాయనమూ మిథ్య అన్నట్లు, మర్యాదరామన్న మాట దప్పినా నావేటు దప్పదు, అక్కన్నమాదన్న గార్లందల మెక్కితే సాటికి సరప్ప చెరువుకట్ట ఎక్కినాడట, ఏమీ అప్పాజీ అంటే కాలంకొద్ది రాయాజీ అన్నాడట, దాసునితప్పుదండంతోసరి, గోలుకొండ ఉద్యోగం గొర్రెతోక. నానాటికి తీసికట్టు నాగం భొట్లూ, యాచమ నాయని త్యాగము గోచులకేగాక పట్టుకోకల కగునా" - ఇలాంటి సామెతలన్నీ చారిత్ర కాంశాల్ని అందించిన ఒకనాటి పొడుపుకథలే, అవే పొడుపుసామెత లయ్యాయి. ఇక కథాత్మక సాంఘిక లోకోక్తి ప్రహేళికల్ని పరిశీలిద్దాం.

సాంఘికాలు :

జనజీవనమనేక సంక్లిష్ట సమస్యాప్రవాహ సంభరితం. భావ సంఘర్షణలనే ఆటూపోటులతో జీవనోదధి ఎల్లప్పుడూ ఎగసెగసి పడుతుంది. ఎగసిపడిన, కూలియెగసిన ప్రతితరంగం వెనుకకన్నీటి గాథ ఉంది- కమ్మనికథా ఉంది. ఆ గాథలూ ఆకథలూ సామాజిక జీవనానికి ఉజ్జ్వల దీప్తినిచ్చే ఆదర్శవంతమైన

---

1. ఒత్తుకొని వచ్చు కటి కుచోద్వృత్తిఁజూచి
తరుణితనుమధ్యమేడకో తలగిపోయె
ఉండెనేనియు కనబడ కున్నె యహహ
ఉద్ధతుల మధ్య పేదలకుండ తరమ

[కవికర్ణరసాయనము, ఆ- III, ప:26]

స్ఫూర్తినీ ఇస్తున్నాయి. ఆ భావవాహినే సాంద్రమై సాకారమై సాంఘిక జీవన-పరిమళాల్ని వెదజల్లే పొడుపుసామెతగా సాక్షాత్కరించింది. సాంఘికలోకోక్తి ప్రమాణికాధారం సంఘం. అందువల్ల ఇది ఆధారరహిత మయింది గాదు. వర్తమాన జీవన ప్రతిబింబమే పొడుపుకథ.

13. రెడ్డి వచ్చాడు మొదలెత్తుకో

"రెడ్డొచ్చె మొదలాడు" అనే పదబంధమే పైసామెత. కొద్దికాలం క్రితం, కొన్ని గ్రామాల్లో నిన్నమొన్నటివరకూ ఈ కథ జరిగింది. పండగదినాల్లోనూ, పర్వదినాల్లోనూ యక్షగానాలాడేవారు. బహురూపుల వేషాలు వేసేవారు. రాత్రి కొంత పొద్దుపోయింతర్వాత ఆట ప్రారంభిస్తారు. వారి ఆటలో కళాప్రదర్శనా ప్రావీణ్యత సంగతి యెట్లున్నా వారి దృష్టి అంతా మరునటిరోజు ఆ గ్రామపు రెడ్లిచ్చే ధనధాన్యాలపై కట్నకానుకలపై తప్పక ఉంటుంది, అందువల్ల ఆట ప్రారంభంలో వచ్చిన ప్రతిరెడ్డిని పొగడుతారు. ఆట మొదలవుతుంది, అప్పుడే మరో రెడ్డివచ్చినట్లు వర్తమానం వస్తుంది. అతణ్ని పొగడడం మొదలెత్తుకోడం జరుగుతుంది. ఈ విధంగా తెల్లవారే వరకు జరుగుతూనే ఉంటుంది. కథకు కాళ్లున్నా కదలదు, కదలినా నత్తనడకలాగే ఉంటుంది. ఇప్పుడీ కట్టుడి ఇంచుమించుగా సాగడం లేదు. అయినా గ్రామాధికారులైన రెడ్ల దర్పానికి సాక్షీభూతంగా ఈ పొడుపుసామెత నిలిచిపోయింది.

14. "పులిచారలు వేసినవి అత్తయ్యా" అంటే
"పురిసెడు వెనక్కితియ్యవే కోడలా" అన్నదట అత్తగారు.

పడమటి దిక్కు ఆకాశంలో మబ్బులు కమ్మాయి. ఆ మబ్బులు పులిచారల వలె ఉన్నాయి. మబ్బులు అలా ఉంటే వర్షాలు సరిగా కురువవనీ, పంటలు పండవనీ, కరువుకాటకాలు వస్తాయనీ ప్రజలవిశ్వాసం. ఈ లౌకిక విశ్వాసాలతో బ్రతికే వ్యవసాయదారుని కోడలు పరిస్థితిని గమనించింది. అత్తగారితో సంగతి చెప్పింది, రాబోయే కాలంలో కటకటలు పడకూడదనీ, ఉన్ననాడు ఉగాదిగానూ లేనినాడు కామునిపండుగగానూ జరుగకూడదనే కోడలి భావాన్ని అత్తగుర్తించింది. పొదుపు చేసుకొని తినాలని కోడలిని ఆజ్ఞాపించింది. కడుపు కట్టుకొని కాలం వెళ్లబుచ్చాల్సి వచ్చినప్పుడు పౌరాణిక యుగంలో నలదమయంతులకు, చారిత్రక యుగంలో మహారాణా ప్రతాప్ కుటుంబానికి ఆధునిక యుగంలో ఆ రైతు కుటుంబానికి కలిగిన అనుభవాలు పొడుపు కథలుగా పొడుపు సామెతలుగా రూపు దిద్దుకోడం అంటే శిలాక్షరమవడం, సత్యశివ సుందరమై సాక్షాత్కరించడం.

సాంఘిక సంబంధులైన కథాత్మక ప్రహేళికల ఛాయలున్న సామెతలు ఆంధ్రంలో ఎన్నో ఉన్నాయి. కొత్తవి పుడుతున్నాయి. పుడతాయి. సజీవమైన సమాజం నిత్యనూతనత్వానికి ఆలవాలం, చేదుగొన్న వారికి చేదుకొన్నన్ని భావాలు ఆ సమాజంలోని సామెతలందిస్తాయి.

"అరుంధతీ గిరుంధతీ కనపడటం లేదుగాని, ఆరువందలు అప్పుమాత్రం కనబడుతున్నది, కాసుకుగతి లేదు కోటికి కొడి వేశాడు, చెడిందిరా పిల్ల అంటే చేరిందిరా తెనాలి, కొండమంగలి కొరిగినట్లు, అగ్రహారం పోతే పోయిందిగాని- ఆస్థ అంతా బాగాతెలిసింది, అడ్డబొట్టువాడు నిలువుబొట్టువాడు తగవులాడి సత్రం తగలబెట్టినట్లు ,అంగట్ల బెల్లానికి గుడిల లింగానికి సమర్పయామి"-ఓసన్ని వేశాన్ని, ఓకథాంశాన్ని సమలంకృతంగా సంధించే సాంఘిక సంబంధులైన పొడుపు సామెతలెన్నో ఉన్నాయి. నిరంతర గతిశీలక మైన వీటి ప్రాదుర్భావం ఆగకుండా సాగుతూనేఉంది.

కాల్పనికాలు :

ఆధార రహితాలైన విషయాలు కాల్పనికాలు. ఇది మానవునిసృజనశక్తి అయినా ఊహకూ ఆదర్శానికి ఉన్నపాలు ఇతర విషయాలకుండదు. ఎక్కడో ఓకథ పుట్టింది. పుట్టిన ఆకథ వ్యాపించింది, చూసిన వారెవరో తెలియదు. మొదట చెప్పిన వారెవ్వరో తెలియదు. కాని ఆకథ ప్రజ చెప్పుకొంటున్నది. కొన్ని పలుకుల్లోనే కథార్థం భాసింప చేసుకొంటున్నది. కాల్పనికాలైన పొడుపు సామెతలు సరిగా ఇలా ఉంటాయి.

15. అందని ద్రాక్షపళ్లు పుల్లన.

లోకంలో ఒకడొకటి ఆశిస్తాడు. తాను ఆశించింది ఉత్తమమయింది, శ్రేష్ఠమయింది అనిభావిస్తాడు. దాన్ని పొందడానికి యత్నిస్తాడు. ప్రయత్నం ఫలించనప్పుడు చింతిస్తాడు. విసిగివేసారి తాను ఆశించినదాన్నే దూషిస్తాడు. ఇది మానవ స్వభావం-అంటేలోక స్వభావం. దీనికో నీతికథ ఉంది.

ఓ నక్క ద్రాక్షపండ్ల నాశించింది. ద్రాక్షపందిరి కిందికి చేరింది. వాటి తీపిని గూర్చి రసశ్రేష్ఠత్వాన్ని గూర్చి, రంగు రుచిని గూర్చి ప్రశంసించింది. ఒక్కసారికాదు వంద పర్యాయాలు కీర్తించింది. కీర్తనతో కడుపు నిండదు కదా! అందుకే పందిరి కింది పండ్లను అందుకోవాలని ఎగిరింది. అవి అందలేదు. "అందని ద్రాక్షపళ్లు పుల్లన" అనిపించింది. అని పనికిమాలినవని దూషించింది." ఈ కథ యేనాడు జరిగిందో కాని ఆ భావాలున్న మనుజులీనాడూ ఉన్నారు.

ఏనాడైనా ఉంటారు. ఈ కథ కాధారముంటే యేంటి? లేకుంటే యేంటి? మనుష్యులు న్నంత కాలమీకథ ఉంటుంది. కథ కాలంబన సూత్రమైన పొడుపు సామెతా ఉంటుంది. చిరంతన కాల్పనికత - అనుక్షణ వాస్తవికత ఈ కథలో ఉంది.

16. మంచి చేసిన ముంగికి మరణం వచ్చినట్లు

ఒకరు ఒకరికి సహాయం చేస్తారు. అలా ఉపకారం చేయడం వారు తమ ధర్మంగా భావిస్తారు. కాని ఆ ఉపకారం వల్ల లాభం పొందిన వాళ్లు దానిని గుర్తించరు, పైగా ఆ చేసింది అపకారమని భావిస్తారు. ఆ భావనవల్ల పెరిగిన ఆగ్రహంతో ఆధర్మపరునికి కీడు చేస్తారు. కాని ఆ ధర్మపరుడు ఉపకారం ఆశించి చేయలేదు, తనకు అపకారం కలుగుతుందని కూడా తలచలేదు. కాని జరిగిందది. ఆ సమయంలో లోకంపై పొడుపు సామెతను ఉపయోగిస్తుంది. ఆ సామెత వెనుక ఉన్న నీతికథలో విచారం ఆవేదన నిండిఉన్నాయి.

"ఒక ఇల్లాలు ప్రేమతో ముంగీసను పెంచుకొంది. ఆముంగి ఆ ఇల్లాలి కనుసన్నల్లో మెలగుతూ బహుకాలంగా ఆ ఇంట్లోనే ఉంది. ఒకనాడామె ఊయల్లో తన పసిబిడ్డను పడుకోబెట్టి బిందెతీసుకొని మంచినీళ్లకు వెళ్లింది. సరిగ్గా అదే సమయంలో ఒకత్రాచుపాము తొట్టెలను సమీపించింది. ముంగిస ఇది చూసింది, పాముమీదికురికింది, దానితో పోరాడింది, ముక్కలు ముక్కలు చేసి చంపింది. ఇంకేం, ఆ ముంగిసకు ఆనందం మిన్నుముట్టింది. అది తన యజమానురాలికి ఎదురుగా వెళ్లింది.ద్వారంలోనే ఆ ఇల్లాలు ముంగిసను చూచింది. దాని మూతికి రక్తముంది. తన పసిబిడ్డను ఆముంగి చంపిందని ఆ తల్లి భావించింది. వెంటనే నిండు నీటిబిందెను ఆ ముంగీస నెత్తిపైన యెత్తివేసింది. ముంగిస గిలగిలగొట్టు కుంటూ ప్రాణం విడిచింది. ఇల్లాలు, ఊయల్లో కేరింతలు కొడుతున్న బిడ్డను ఊయలపక్కనే ముక్కలై పడిఉన్న త్రాచుపామును చూసింది, తన అనాలోచిత కార్యానికి చింతించింది".

ఈ కథ యెప్పుడు జరిగిందో చెప్పేదెవరు? ఆధారమేంటి? కాని ఇలా అనాలోచిత కార్యాలు చేయరాదనే సందేశం అనాదిగా ఇస్తూనే ఉంది. కథంతా చెప్పాల్సిన అవసరం లేదు. సంకేతిస్తే చాలు, ఆ సంకేతమే కాల్పనిక సంబంధి అయిన ఈ పొడుపు సామెత.

ప్రపంచంలోని సర్వకథా వాఙ్మయంలోను కాల్పనికాలైన ఈ కథలున్నాయి. అవి పొడుపుకథలుగా సామెతలుగా ప్రచలితాలయ్యాయి. ఆంధ్ర సాహిత్యంలోనూ, ఆంధ్ర జనవ్యవహారంలోనూ ఇలాంటివి కోకొల్లలుగా ఉన్నాయి.

"కొంగజపం చేసినట్లు, పిల్లిమెడలో గంటకట్టేదెవరు, ఒకరికలిమికి యేడుస్తే

ఒకకన్ను పోయింది- తనలేమికేడుస్తే రెండు కళ్లు పోయాయి. నక్కజిత్తులన్నీ నా వద్ద ఉండగ తప్పించుకపోయెనే తాబేటి బుర్ర, పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చింది, తోటకూర నాడైనా చెప్పవైతివి, అకటావికటపు రాజుకు అవివేకి ప్రధాని చాదస్తపు పరివారము, తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డబేరం, ఉభయ భ్రష్టత్వం ఉప్పర సన్యాసం, ఒక్క దెబ్బకు రెండు పిట్టలు"— నీతి దాయకాలైన సన్నివేశాల్ని పరమరమణీయంగా చిత్రీకరించే ఇలాంటి కాల్పనిక ప్రహేళికాసూక్తులు వాఙ్మయానికే అలంకారాలు. మనిషి జీవితాన్ని మలుపు తిప్పే సందేశాత్మకాలు.

మొత్తం మీద కథాత్మకాలైన పొడుపుకథల లాగానె పొడుపు సామెతలు కూడా పరమరమణీయాలు. పొడుపుకథ ఒక ముడిసరుకు, పొడుపు సామెత ఆ ముడిపదార్థాన్ని తీర్చిదిద్దగా ఏర్పడ్డ పరమోత్కృష్ట శిల్పం. ఆ శిల్పంలోని పౌరాణికాదిభేదాలు పరిశోధకుని దృష్టి గోచరాలు మాత్రమే. ప్రజలీభేదాన్ని పాటించరు, వారాసామెతను దర్శిస్తారు, స్పృశిస్తారు. ఈ సృష్టి ఉన్నంత కాలం ఆ సృష్టి జరుగుతూనే ఉంటుంది. అందుకే కథాత్మకాలైన పొడుపు సామెతలు చిరంతన కాల్పనికాలనీ అనుక్షణ యథార్థాలని చెప్పడం.

## కథారహితాలు

కథాసహితాలైన పొడుపు సామెతలకు కథారహితాలైన పొడుపు సామెతలకు జానపదుల దృష్టిలోగాని, నాగరుల దృష్టిలోగాని అంతరమేమీలేదు. విస్తృతమైన కథా కాంతిపుంజానికి కేంద్ర బిందువు కథాత్మకమైన పొడుపు సామెత. వ్యాకోచమై ఉన్న కథాశరీరం సంకోచమై ముద్దగట్టుకొన్న స్వరూపమే పొడుపు సామెత. కేంద్ర బిందువై ఉన్న కథారహితమైన పొడుపు సామెతలోని సూక్ష్మాణువు విడుపు సామెత. సంకోచపు ముద్దలో పొదగబడి ఉన్న మణి, కథారహితమైన పొడుపు సామెత యొక్క విడుపు.

జానపద సాహిత్యంలో పొడుపుకథ ఎన్నిసొగసులు పోయిందో పొడుపు సామెత కూడా ఇంచుమించుగ అన్ని వన్నెచిన్నెలు పోయింది. కాని స్థూలంగా ఇది అయిదారు విభాగాలలో ఇమిడి పోతోంది. కథారహితాలైన పొడుపు సామెతల్ని స్వభావాన్ని బట్టి ఈ క్రింది విధంగా విభజించుకునే వీలుంది.

1. వ్యవసాయాత్మకాలు
2. వస్తుగుణాత్మకాలు
3. పశుపక్ష్యాదులు
4. ప్రాకృతికాలు
5. గృహ సంబంధులు
6. ఇతరాలు.

ఈ విభాగాల్లో ఉదాహరించేవాటిని పొడుపుకథలుగా సాహిత్యవేత్తలుగాని ప్రజలుగాని వ్యవహరించడంలేదు. వాటిని సామెతలనే అంటున్నారు. కాని ఆ సామెతకున్న పూర్వవాసనలు పోలేదు. అలాంటివి మాత్రమే ఇక్కడ ఉదాహరించ బడుతున్నాయి: కనుకనే వాటిని కథారహితాలైన పొడుపుసామెతలని పిలవడం జరిగింది.

1. వ్యవసాయాత్మకాలు :

మనది వ్యావసాయికదేశం. ఈదేశంలో పుట్టిన ఏ సాహిత్య ప్రక్రియ అయినా, ఏ సామాజిక సమస్యఅయినా కొద్దిగనో గొప్పగనో, ప్రత్యక్షంగానో- పరోక్షంగానో వ్యవసాయ సంబంధి అయి ఉంటుంది. వ్యవసాయ దారుల్లో నూటికి తొంభైమందిజానపదులు. పొడుపుకథల్లో నూటికి తొంబది జానపదుల ముఖనిర్గతాలు- పొడుపు సామెతలు కూడా ఆదేవిధంగా జానపదుల సొత్తనే చెప్పాలి. అందువల్ల పొడుపుకథలు పొడుపుసామెతలు అధికంగా వ్యావసాయిక జీవన ప్రతిబింబాలై ఉన్నాయి.

17. ముక్కు మూరెడు సిగబారెడు [తోకవరిగింజ]

కోపంవస్తే పరస్పరం నిందించుకోడం, మరొక అమ్మతో చెప్పుకోడం, ఆ చెప్పుకొన్నప్పుడు "దాని సొమ్మేమి పోయిందని ముక్కు మూరెడు చేసింది" అనేవాక్యం ప్రయోగించడం సాధారణ లోకవ్యవహారం. కాని ముక్కు మూరెడు కాదు సిగబారెడు కాదు- కోపం వల్ల ముక్కు ఎరుపెక్కుతుంది, తలను అటూ ఇటూ కదిలించడం వల్ల సిగ ఊడి బారెడవుతుంది. సామెతనిలాంటి సందర్భాల్లో ప్రయోగిస్తున్నా దీని విడుపు మాత్రం తోకవరిగింజ. వరిధాన్యాల్లో తోకబుడమ లనేవి ఒకరకం. ఈ వడ్లకు పొడుగు తోకలుంటాయి, పొట్టి ముక్కులుంటాయి. కూలివేసేప్పుడు పాత్రతో కొలచివేయక జొన్నకంకుల్లాగా చేతబట్టివేసేవారట. ఇప్పుడీ ధాన్యమెక్కణ్నో చవిటి నేలల్లో పండుతుంది కాబట్టి తోకబుడమలు కనిపించడంలేదు వీటిని తోకవడ్లని కూడా అంటారు. ఈధాన్యాన్ని దృష్టిలో ఉంచుకొనే పొడుపుకథ సృష్టించబడింది.

18. శివరాత్రికి జీడికాయ ఉగాదికి ఊరుగాయ [మామిడి పిందె]

ఒక వ్యక్తి తమబంధువుల బాలికను కొంతకాలమైన పిదప చూస్తాడు. అప్పటికీ ఇప్పటికీ ఆ అమ్మాయి కంపచాటు మొక్కలాగా ఎదిగిపోయింది. అప్పుడతడు పైసామెతతో పరిహసించాడు. శివరాత్రికి ఉగాదికి మధ్యకాలం ఒక్కమాసం మాత్రమే. ఒక్కనెలలోనే అది పచ్చడికి సిద్ధమవుతుంది. పచ్చడినే

కొన్ని ప్రదేశాల్లో ఊరగాయ అంటారు. జీడికాయ చిన్నదిగా ఉంటుంది, ఊరుగాయ టెంకపట్టి పెద్దదిగా ఉంటుంది. మామిడిపిందెలేదా కాయ అర్థాన్ని రాబట్టడానికై ప్రయోగింపబడ్డ ప్రహేళికాలోకోక్తి ఇది. వ్యవసాయాత్మకాలైన ఈ క్రింది ప్రహేళికాలోకోక్తులు పరిశీలనార్హాలు.

19. వస్తూ ఇల్లు నింపుతుంది పోతూ ఇల్లు నింపుతుంది [ఆరికె]

20. కార్తీక మాసంలో కదురంత ఉంటినా
మాఘమాసంలో నామహిమ చూపుతా [చిక్కుడుతీగ]

21. కార్తీక మాసమున కాకులు తొక్కుతాయి. [జొన్నకంకులు]

22. గొర్రెతొక్కినాచాలును [మడి-పొలము.]

23. చిత్త చిత్తగించి, స్వాతిచల్లజేసి, విశాఖవిసరకుంటే
అనూరాధలో అడిగినంత పండుతాను అన్నదట [జొన్నచేను]

24. మఖకు మానికంత మొక్కయితే కార్తీకానికి కడవంత కాయ [గుమ్మడి]

25. భరణి కార్తెలో చల్లిన కాయకు చిప్పెడుపంట [నూవు]

26. స్వాతి కురిస్తే చల్లపిడతలోకి రావు [జొన్నలు]

## 2. వస్తుగుణాత్మకాలు :

సాధారణంగా జీవరహితాలై, ఒకస్పష్టమైన నిర్దిష్టమైన స్వరూపమున్న వాటిని వస్తువులనడం సహజం. స్వరూపమున్న దానికి స్వభావముంటుంది. స్వభావం రంగుకూ రుచికీ వాసనకూ రూపానికి సంబంధించిందై ఉంటుంది. ఈ స్వభావమనేది సహజసిద్ధమైందిగావచ్చు, లేదా నడుమంత్రపు మార్పుగావచ్చు. కాకపోతే పరిస్థితుల ప్రభావం వల్ల పరిసరాల సాహచర్యం వల్ల, ప్రకృతి సాన్నిహిత్యం వల్ల ఇటువంటి గుణాత్మక పరిణామాలు కలుగవచ్చు.

27. గడ్డతిన్నాకంపే పాయతిన్నాకంపే [ఉల్లి]

ఉల్లిగడ్డది అదొకరకమైనవాసన, అటువంటి వాసన మరో దానికి ఉండదు. ఇదిసామెతగా ఈనాడు వ్యవహరింపబడుతోంది. కాని ఇది పొడుపు సామెతగా పిసినారి గుణంగల వారివిషయంలో ప్రయోగింపబడుతోంది.

28. మూరెడు పుల్ల ముక్కెడు [వేపపుల్ల-పలుదోముపుల్ల]

గ్రామీణులు పళ్లుతోమడానికెక్కువగా ఉపయోగిస్తారు. అది కూడా చిన్న పుల్లకాదు, మూరెడుపుల్ల. మూరెడుపుల్ల ముక్కంత అయ్యేంతవరకు తోముతారు. అలాతోమాలట. ఇది పదబంధలక్షణాలున్న సామెత. అర్థవివరాణాన్ని ఆశించేదైనా విడుపు చెప్పినప్పుడవగతమవుతుంది. వస్తుగుణ సంబంధులైన కథారహిత ప్రహేళికాలోకోక్తులు కొన్ని గమనిద్దాం.

29. మూడుపావలాల గుడ్డ
ముప్పయి రూపాయల కుట్టు (విస్తరి)

30. చెట్టుమీద వాడు
జుట్టుమీది కెక్కె (కల్లు)

31. తొక్కినా కరవక పోతే
బురదతొస్సురా అన్నట్లు (పాము)

32. పున్నమికి పూత
అమావాస్యకు ఆరగింపు (తేనెపట్టు)

33. పొట్టివానికి పుట్టెడు బుద్ధులు (ఉల్లి)

34. ఏమిలేనివారికి ఏతులు లావు
స్వాములవారికి జడలు లావు (విస్తరి-మర్రి)

3. పశు పక్ష్యాదులు :

ప్రపంచంలో ఏ ప్రాణి యెందుకు పుట్టినా, వాటివల్ల సృష్టికర్త ఏయే ప్రయోజనాల్ని ఆశించినా అవి పరస్పరం సంఘర్షిస్తున్నాయి, సాన్నిహిత్యంతోనూ మెలగుతున్నాయి. అలా సంఘర్షణా సాన్నిహిత్యాలతో పశుపక్ష్యాదులు సహజీవనం గడుపుతున్నాయి.

తిర్యక్ సంబంధులైన పొడుపుకథలెన్నో ఉన్నాయి. పొడుపుకథల ఛాయలున్న పొడుపు సామెతలు కొన్నేలభిస్తున్నాయి. మానవుడు కూడా ద్విపాద పశువే. అందువల్ల మానవ సంబంధులైన పొడుపు సామెతలు కూడా ఈ శీర్షిక క్రింద పరిశీలనార్హాలే.

35. చూపుల పసేగాని
చేపుల పసేలేదు (పాడిగొడ్డు)

ఎక్కడ రూపం సౌందర్యవంతమై ఉంటుందో, అక్కడ భావం కూడా సౌశీల్యవంతమై సద్గుణాలకాలవాలమై ఉంటుందనే మాట సర్వజన సమ్మతమూ కాదు, సార్వకాలీన సత్యమూకాదు. ఈ సమాజంలో పయోముఖ విషకుంభాలు,

తేనెపూసిన కత్తులు, గోముఖ వ్యాఘ్రాలు ఉన్నాయి. అందుకే మానవుడు భ్రష్టా పతితుడవుతున్నాడు.

ఒక రైతు పాడిగొడ్డు తెచ్చాడు. అది చూడ్డానికి అందంగా ఉంది, కాని చేపదు, పాలివ్వదు. పాలివ్వనిది పాడిగొడ్డు ఎలా అవుతుంది అనే అనుమానం కలుగక తప్పదు. అది పాడిగొడ్డని అమ్మబడింది, ఇతడు అవుననుకొని కొన్నాడు అది నిజానికి పాడి ఉన్న గొడ్డే కాని దానికి పాలిచ్చే ఇష్టంలేదు! ఆ ఇష్టం దానికి కలిగేట్టు సంస్కారమివ్వాలి. ఈ పొడుపు సామెత సమాజంలో అనేక సందర్భాల్లో ప్రయోగింపబడుతుంది.

36. వెంట రావద్దంటే
ఎత్తుకొమ్మని ఏడ్చాడట (బిడ్డ)

ఒకడొక పనిమీద వెడుతున్నాడు. మరొకడేదో పని చెప్పాడు. మొదటివాడు తాను చేయనన్నాడు. రెండవవాడు తనను వెంటతీసుకొని పొమ్మన్నాడు. అప్పుడు మొదటి వాడుపైసామెతను ప్రయోగించాడు. నిజానికది పసిబిడ్డ విషయంలో మొదట మొదట ప్రయుక్తమై, పొడుపుకథయై సామెత రూపు ధరించింది. ఈ క్రింది పొడుపు సామెతలు ఈ శీర్షిక క్రింద చెప్పుకోదగ్గవే.

37. ఎలుకకు ఏడుగురు భార్యలు (కోతల రోజుల్లో)

మనిషికి సంపదలు కలిగినప్పుడు సుప్తమై ఉన్న కోరికలు కొన్ని విజృంభిస్తాయి. ఆ కోరికలు సుఖభోగాల అనుభవాల కొరకు అర్రులు చాస్తాయి. అలాంటి సందర్భాల్లోనే ఎలుకకు ఏడుగురు భార్యలని ప్రజలనుకుంటారు. కోతల కాలంలో ఎలుక ధాన్యంలో పొరలాడినట్లే గడుపుతుంది. అది కావలసినంత ధాన్యం సమకూర్చుకొని నిగనిగలాడుతూ మహానందంతో తిరుగుతుంది. అప్పుడు దానికిక సమకూరనిదేంటి? ఈ పొడుపు సామెతపై ప్రహేళిక ఛాయమాత్రమే పడింది.

38. వాడు ఒకణ్ని తిడతాడు. తాను తిట్టినట్లు అతనికి తెలువగూడదు. మదతన పెట్టి మాట అంటాడు. అనకుండా ఊరుకోడానికి మనస్కొప్పుకోదు. అంటేగాని తృప్తి ఉండదు. తెలుగు సంవత్సరాల్లో ఇరవయి ఆయిదవ సంవత్సరం ఖర, ఇరవై ఆరవ సంవత్సరం నందన. ఇంతకతడు ఖరనందనుడు. పశుపక్ష్యాదుల పొడుపు సామెతల్ని ఇంకా తెలుగు సామెతలగని నుండి యేరవలసిన పని ఉంది.

4. ప్రాకృతికాలు :

మనిషికే యేంటి, భూమిమీద పడ్డ సర్వజీవులకూ మొదటి గురువు ప్రకృతి. భూమి, ఆకాశం, మబ్బులు, వర్షం, వెన్నెల, చలి మొదలైన వెన్నో

ప్రకృతిలో అంతర్భాగాలుగా ఉన్నాయి. ప్రకృతికి సంబంధించినవి గాబట్టి ఈ పొడుపు సామెతలు ప్రాకృతికాలని పిలువబడుతున్నాయి.

39. చుట్టమై చూడవస్తే
    దయ్యమై పట్టుకున్నాడు (రేగుచెట్టు)

ఒకరి ఇంటికొకడు చుట్టమై చూడవస్తాడు. అతనికి ఆ గృహస్థు అతిథి మర్యాదలు చేస్తాడు. ఆ మర్యాదలతో బాటు అతణ్ని చిక్కుల్లో ముంచేస్తాడు. వచ్చిన అతిథి ఆ చిక్కుల్లో నుండి బయట పడడానికి బహువిధాలా ప్రయత్నిస్తాడు. ఒకవైపు ప్రయత్నాలు సాగతూనే ఉంటాయి, ఆ సమయంలో అతని మిత్రులు కలుస్తారు. అప్పుడతడు పై సామెత నుపయోగిస్తాడు. ఇది తన అనుభవం, కాని ప్రకృతికీ మానవునికీ విడదీయరాని బంధముంది. ఆ బంధమేదయ్యం (దైవం). రేగుచెట్టు పండ్లు తెంపుకోడానికి ఒకడు వెడతాడు. పండుచేత చిక్కింది కాని కట్టుబట్టలను ముళ్లు పట్టుకున్నాయి. పండ్లకై వెళ్లిన అతడు చుట్టం. రేగుచెట్టు ఆతిథ్యమిచ్చింది గాని దయ్యమై పట్టుకుంది. ఈ సామెతలో జీవదేవ సంబంధం, కష్టసుఖాల సమ్మిశ్రమమైన జీవనసత్యం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. నేడిది సామెతగా ప్రయుక్తమవుతున్నా ఒక నాటి పొడుపు కథే.

40. ఏటి ఒడ్డున చేను
    ఏటికి మాటికి భయం (ప్రవాహం)

ఆనాడు శ్రీనాథమహాకవి ఏటి ఒడ్డున సేద్యంచేసి చేనుపెట్టాడు. కృష్ణవేణమ్మ ఫలమంతా కొంపోయింది. ఏటి ఒడ్డున చేను పెట్టినప్పుడు ప్రవాహభయం తప్పదు. ఇదీ సామెత రూపు సంతరించుకొన్న పొడుపుకథే. ప్రకృతి సంబంధులైన కొన్ని పొడుపు సామెతల్ని గమనిద్దాం.

41. ఆకారపుష్టి నైవేద్య నష్టి (పుచ్చకాయ)
42. ఉడిగి ఉత్తరం చేరుతుంది (మబ్బు)
43. శివరాత్రికి శివ శివా అని పోతుంది (చలి)
44. హస్త ఆరుపాళ్లు - చిత్త మూడు పాళ్లు (వర్షం)
45. దూరం గుడికడితే దగ్గరలో వాన
    దగ్గర గుడికడితే దూరాన వాన (చంద్రపరివేషం)

5. గృహ సంబంధులు :

ఆటవిక మానవుడు మారడానికి గృహమెంతో తోడ్పడింది. పశుప్రాయమైన జీవనాన్ని దివ్యంగా తీర్చిదిద్దింది గృహమే. ఆ కారణాన్నే గృహ సంబంధమైన

సాహిత్యమెంతో ఆవిర్భవించింది. పొడుపుకథలూ సామెతలూ ఆ సాహిత్యాం తర్భాగాలే. గృహ సంబంధులైన పొడుపు సామెతలెన్నో ఉన్నాయి. మచ్చు కొకటి రెండు పరిశీలిద్దాం.

46. అత్త కాలం కొన్నాళ్లు
కోడలి కాలం కొన్నాళ్లు (గొంగడి-రుమాలు)

పాలనా యంత్రాంగంలో అధికారులు మారినప్పుడు, సామాజికరంగంలో పూర్వ పూర్వీకులకన్నా ఉత్తరోత్తరులు ముందడుగు వేసినప్పుడు, రాజకీయ రంగంలో వృద్ధులతరం తెరవెనక్కు పోయి యువతరం తెరపైకి వచ్చినప్పుడు, గృహజీవన రంగంలో అత్తగారు మూలనపడి కోడలు తాళాలగుత్తి చేతపట్టి నప్పుడు ఈ పొడుపు సామెత ప్రయుక్తమవుతోంది. కాని వ్యవసాయదారుడు చలికాలంలో గొంగడి కప్పుకోడాన్ని, వెంటనే వచ్చే వేసవి కాలంలో రుమాలునే ఎక్కువగా చుట్టు కోడాన్ని ఈ పొడుపు సామెత సూచిస్తోంది. పొడుపు కథార్థం సంపూర్ణంగా గోప్యంకాగా ఇది సామెత అవతారాన్నెత్తింది.

47. జానెడు పిట్టకు మూరెడు తోక (తెడ్డు)

అంగాలు వారి వారి ఒడ్డు పొడుగుల్ని బట్టి సమవిభక్తాలుగా ఉన్నప్పుడు దేహం సౌందర్యవంతమై శోభిస్తుంది. ఏ ఒక్కటి ఎక్కువ తక్కువగా ఉన్నా వికారంగా ఉంటుంది. ఆ దేహం అల్పబుద్ధుల పరిహాసాలకు గురి అవుతుంది. పిట్ట చిన్నదిగాను తోక పొడుగ్గాను ఉన్నప్పుడు పై సామెత పుట్టవచ్చు. పొడుపు కథ ఎక్కువగా సంకేతాత్మకమై ఉంటుంది. కాబట్టి అట్లే అది పుట్టక పోవచ్చు కూడా. విడుపేమో "తెడ్డు". "పిట్ట కొంచెం కూత ఘనం" దాదాపుగ ఇటువంటి సామెతే. గృహసంబంధులైన పొడుపు సామెతలు జాతిజీవన సంస్కృతులకు నిదర్శనాలు. అలాంటివి కొన్ని గమనిద్దాం.

48. చూస్తే చుక్క - లేస్తే కుక్క (గయ్యాళి)

49. మసిపాతలో మాణిక్య మట్లు (అన్నం)

50. అరటాకు మీద ముల్లు పడ్డా
ముల్లు మీద అరటాకు పడ్డా
అరటాకుకే ప్రమాదం (కన్య - పురుషుడు)

51. అత్త ఆరో నెలలో పట్టిన దయ్యం (బిడ్డకు వచ్చే మొదటి మాట)

6. ఇతరాలు :

ఇంతవరకు వ్యవసాయాత్మకాది భేదాలు వింగడించి చూపబడ్డాయి. కాని ఇంకా అనేక భేదాలు పొడగట్టుతున్నాయి. అట్టివాటినీ ప్రత్యేకంగా విశ్లేషించి చూపించడం వల్ల వ్యాసం పెరిగి పోతుంది. రూపమొక్కటే అయినా స్వభావాలెన్నో ఉన్నాయి. కొన్ని వింగడించి చూపించడం వల్ల మరికొన్ని విజ్ఞులూహించగలరని ఆశించి ఈవిభజనంలో చివర ఇతరాలనే శీర్షికక్రింద ఒకటిరెండు వివరింపబడుతున్నాయి.

52. అప్పుచేసి కొప్పు తీర్చిందట. [వ్యభిచారం]

ఈ పొడుపుసామెత "అప్పుచేసి కుప్పతీర్చింది" అనే విధంగా ఉంటే "కుమ్మరివామం" విడుపనేవారం. కాని కొద్దిభేదంతో మరొక అర్థం సంపన్నమయింది. "అప్పు కొప్పు చేసి తీర్చింది. అంటే ఆమె వ్యభిచరించింది అని లోకవ్యవహారం. తీర్చడానికి అలంకరించడమనే మరొక అర్థముంది. ఆ అర్థం కూడా ఇక్కడ రావచ్చు. అలంకరించడం అనే అర్థం మాత్రమే తీసుకున్నప్పుడు ఇది కేవలం సామెత అవుతుంది. వ్యభిచారాన్ని విడుపుగా స్వీకరిస్తే అది పొడుపు సామెత అవుతుంది.

53. దండులోనికి పోతే రెంటిలో ఒకటి

[విజయమో-వీరస్వర్గమో, చావో-బ్రతుకో]

దండులోనికి పోవడం అంటే దండయాత్రకు పోవడం. అక్కడ ఈ రెండిట్లో ఏదోఒకటి అవుతుంది. కేవలం ఆ సందర్భాన్ని దృష్టిలో పెట్టుకొనే ఇది అప్పుడు ప్రయోగింపబడకపోవచ్చు. ఒక కార్యానికి పూనుకొన్న పిదప "మంచో లేదా చెడో" జరుగుతుందనే అర్థంలో ప్రస్తుతం వ్యవహృతమవుతోంది. ఈ కోవలోకి చేరే ఈ పొడుపు సామెతలు సులభగ్రాహ్యాలు.

54. లాకు ఏత్వము దాకు కొమ్ము అననివాడు [లేదు]

55. వినకు అనకు కనకు [చెడు]

56. వినను కనను రెండేసి ఇచ్చి
అనను ఒకటే ఇచ్చినాడు దేవుడు [చెవులు-కన్నులు-నాలుక]

57. వినేవాటికి కనేవాటికిజెత్తెడే దూరం [చెవులు-కండ్లు]

58. నూరయే వరకు కాపాడు
తరువాత నేనే నిన్ను కాపాడుత [రూపాయి]

59. ఉప్పు పులుసూ కారము తినేశరీరానికి ఊపిరి ఉన్నంత వరకు

ఉండనే ఉంటూంది. [కదలిక, కామము, లేదా ఉప్పు, పులుసు, కారము] పొడుపు సామెతలనే మాట ఈ వ్యాసంలో వినూత్న ప్రయోగమే. పొడుపు కథ సామెతగా పరివర్తనం చెందడం క్రమపరిణామమే. భౌతికంగానో-భావనాత్మకంగానో ఈవిశ్వం అనవరతం పరిణామం చెందుతూనే ఉంది. అటువంటి విశ్వంలో పొడుపుకథ అనేది స్వల్పాంశం మాత్రమే.

కథా సహితాలైన పౌరాణికాది భేదాలవల్ల, కథారహితాలైన వ్యవసాయాత్మకాది భేదాలవల్ల పొడుపు సామెత స్వరూప స్వభావాలు తెలిశాయి. ఇక పొడుపుకథ-పొడుపు సామెతల సాదృశ్య సాన్నిహిత్యాన్ని సంగ్రహంగా సమీక్షించాల్సిఉంది.

## పొడుపుకథ పొడుపు సామెతల తులనాత్మక పరిశీలనం :

సామెతలు సారస్వతనిధులు. సాహిత్యానికి జిగినీ బిగినీ కూర్చే శక్తి వాటికుంది. అదిపదుగురాడిన పలుకు కాబట్టి దానికపారమైన శక్తి ఉంది-ప్రయోజనముంది. సారస్వతవృక్షంపై అది చిగురుకొమ్మే కాదు, చేవగలకొమ్మ కూడా.

వ్యవసాయదారుని మోటమోకుకు గర్భపు తాడుంటుంది. అది పురులన్నింటినీ కలిపి గట్టిపరుస్తుంది. సామెత వాఙ్మయ సారస్వతాలకు ఆ విధంగా ఉపయోగపడుతుంది. ఆ కారణాన్నే దాన్ని సూత్ర వాఙ్మయం కోవకు చెందిందని అంటారు. వాఙ్మయమంతా మాటల మూటల చేత నిండి ఉంటుంది. పదుగురాడే మాట పాటియై ధరజెల్లి సామెత అవుతుంది. మనిషి తనమాటకు బలం చేకూర్చుకోడానికి సామెత ఉపకరిస్తుంది. జ్ఞాపకం లేని విషయాలు సామెత విన్నవెంటనే జ్ఞప్తికి వస్తాయి. పలువురి జ్ఞానాన్ని మూటగట్టుకొని యేర్పడ్డ సామెత ఒక్కని నోట వెల్వడుతుంది. మొత్తం మీద విజ్ఞాన వినోద ప్రసారవాహకం సామెత.

అటువంటి సామెతకు పొడుపుకథకు అనేకవిధాల సామ్యముంది. "అఙ్గాదఙ్గాత్సమ్భవసి" అనే వేదవాక్యార్థం పొడుపు కథకూ సామెతకు సరిగ్గా వర్తిస్తుంది. అయితే అన్ని సామెతలకిదే వర్తిస్తుందనరాదు. పొడుపుకథా లక్షణాల్ని పొదుగుకొన్న కొన్ని సామెతలకే ఈమాట చెల్లుతుంది. పొడుపుకథ అంగాంగం నుండి అటువంటి పొడుపు సామెతలుద్భవిస్తాయి. సాధర్మ్యమున్న పొడుపు కథల్ని సామెతల్ని ఇంచుక పరిశీలిద్దాం.

౧. సంక్షిప్తత : పొడుపుకథ లక్షణాల్లో సంక్షిప్తత ఒకటి. మఱ్ఱి విత్తనమంత శబ్దంలో మఱ్ఱిచెట్టంత మహత్తరార్థాన్ని నిక్షేపించుకొన్నశక్తి పొడుపుకథకుంది. ఆ మఱ్ఱి విత్తనమే సంక్షిప్తత.

60. కొడుకా, కొడుకా-మొగనికి తమ్ముడా
సక్కన్న పండయ్య - చన్నిన్న లేవయ్య

ఇది కథాత్మక కాల్పనిక ప్రహేళిక. రాజకుమార్తె మొదటిరోజు శోభనం గదిలో ఈ పొడుపుకథతో భర్తను పొడిచింది, ఆమె అదివరకే అశ్వశాలాధ్యక్షుడితో రహస్యప్రణయకేళీ విలాసాల్లో తేలాడి కొడుకను కని విడిచిపెట్టింది. ఆ కుర్రాడదే ఊళ్లో పేదరాశి పెద్దమ్మ ఇంట్లో పెరిగి పెద్దవాడయ్యాడు. రాజూ రాణి కూతురుకు పెళ్లి చేయక ముందే చనిపోయారు. మంత్రులాలోచించి ఏనుగుకు మాలఇచ్చి పంపించారు. ఆ ఏనుగు దండ ఆ కుర్రాడి మెడలో వేసింది. ఆ అబ్బాయికి రాజపుత్రికకు పెళ్లిచేశారు. లోకానికి జడిసిన రాజపుత్రిక కిమ్మన లేదు. కాని మొదటి రాత్రే పొడుపుకథ పొడిచింది. ఇది పెద్దకథ, పొడుపుకథలో ఒదిగిపోయింది. అందుకే సంక్షిప్తతకు నిదర్శన మయింది.

61. కొంగజపం చేసినట్లుంది.

ఇది కథాత్మకమైన పొడుపు సామెత. విష్ణుశర్మకృత పంచతంత్రం భారతీయ భాషల్లో చొచ్చుకొని పోయింది. తెలుగు సాహిత్యంలో ప్రవేశించి ఆంధ్రజనజీవనంలో హత్తుకొంది. "కొంగ చేపల్ని తినాలనుకుంది, అహింసా వ్రతం ధరించి నట్లు నమ్మించడానికి ఒంటి కాలిపై జపం ప్రారంభించింది. ఆ కొంగ ఉత్తమమయిందని చేపలు భావించాయి. అది దినదినం కృశించడం పూర్వపావ ప్రాయశ్చిత్త నిమిత్తమని తలంచాయి. అందువల్లనే తటాకం ఎండి పోనుందని జాలరులు వచ్చేస్తారనీ అది చెప్పిన మాటల్ని నమ్మి దానికి ఆహారమై పోయాయి." పొడుపుకథ కన్నమిన్నగా ఈసామెత సంక్షిప్తతా లక్షణాన్ని రంగరించుకొందని తెలుస్తోంది.

౨. ఉక్తి వైచిత్రీ రామణీయకత : పలికిన పలుకులో వైచిత్రి రమణీయంగా భాసించడం రెండింటా సమానమే అని చెప్పాలి. పలికిన పలుకువల్ల ఆశ్చర్యం కలగడం అర్థస్ఫురణానంతరం ఆనందం కలగడం గమనార్హం.

62. వంగతోట నుండు వరిమళ్లలో నుండు
జొన్నచేల నుండు చోద్యముగను
తలుపు మూల నుండు తలమీద నుండును
దీనిభావ మేమి తిరుమలేశ!

వంగతోటలో, వరిమళ్లలో, జొన్నచేలలో, తలుపుమూలలో, తలమీద ఏమో ఉంటుందని భావిస్తాం. కాని తోటలో వంగ ఉంటుందనీ, మళ్లలో వరి

ఉంటుందనీ, చేనులో జొన్న ఉంటుందనీ, మూలలో తలుపు ఉంటుందనీ, శరీరం మీద తల ఉంటుందనీ, పొడుపుపద్యం పరిశీలన వల్ల తెలుతుంది. ఉక్తిలో వైచిత్రి ఉన్నా అర్థస్ఫురణానంతరమే అందులో రామణీయకత అవగతమవుతుంది. పొడుపు సామెతల్లో ఇటువంటివి తక్కువగా కనిపిస్తాయి, ఇదివరకే ఈవ్యాసంలో ఉదాహరించబడ్డ "లాకు ఏత్వముదాకు కొమ్ము అననివాడు" అనే సామెత ఈ కోవకు చెందిందే.

౩. కథాత్మకత : కథా సహితాలైన పొడుపు సామెతల్ని గూర్చి ఇంతకు పూర్వమే వివరించడం జరిగింది. కొన్ని పొడుపుకథల్లో కొన్ని సామెతల్లో కథను గుప్తపరచుకొన్న తత్వం కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

౪. కథా రహితాలైన పొడుపు సామెతల్ని వ్యవసాయాత్మకాది విభేదాలతో ఈ వ్యాసంలోనే వివరించడం జరిగింది. రెండింటిలోనూ కథారహితత్వం ఉన్న పొడుపుకథలూ సామెతలూ కోకొల్లలుగా ఉన్నాయి, విషయవైవిధ్యం కూడా ఇంచుమించు సరిసమానమే అనాలి.

౫. ఘటనా విశిష్టత : పొడుపుకథల్లోనూ పొడుపు సామెతలోనూ ఘటనా విశిష్టత గమనింపదగింది. ఇందులో ఒక జీవితానికి సంబంధించిన సంపూర్ణకథా-గాథా ఉండదు. కొన్ని సన్నివేశాల చిత్రణగాని, కొన్ని సమస్యల పరిష్కారం గాని ఉండదు. ఒకే ఒక సంఘటన ద్వారా కథాత్మక ప్రహేళిక రూపాన్ని ధరించడం లేదా సామెతగా మారడం జరుగుతుంది. ఈ క్రింది పొడుపు కథలోని ఘటనా విశిష్టత గమనింపదగింది.

63. ఆలేటి సెర్ల
కూరేరే పిల్ల
నీవొల్ల కూరేమి!
సదూశాస్త్రం నేర్సిన సాకలివాడా !
రెక్కలు మడవని పక్షిపేరేమి !

ఎండిపోయిన ఓ చెరువులో బచ్చలికూర మొలిచింది, గర్భవతియైన ఓ యువతి ఆ కూర ఏరుతోంది. ఓ కొంటెకోణంగి ఒడిలోని కూరేంటని అడిగాడు. అతడడిగింది కూర సంగతికాదు, కడుపులోని పాపసంగతి. రూపుపొడగట్టని ఆ రూపం ఆడబిడ్డో మగబిడ్డో చెప్పేదెవ్వరు! ప్రశ్నలోని గడుసుతనాన్ని మించిపోయే మారుతట్టుతో మంత్రించింది ఆ యువతి, ఆ పడుచు ప్రశ్నకు సమాధానం జున్నకోల. తెలంగాణాలోని కొన్ని గ్రామాల్లో ఈ రెక్కలుమడవని పురుగును "పుల్లంగొయ్య" పేరుతో పిలుస్తుంటారు.

ఓ చిన్న సంఘటన వల్ల ప్రాదుర్భవించిన పొడుపుకథ ఇదికాగా "రాముని పాదాలు తగిలితే రాళ్లు రమణులౌతవి" అనే పొడుపు సామెత కూడా ఒక సన్నివేశానికి ప్రతిరూపంగా నిల్చి పోయిందనే చెప్పాల్సి వస్తుంది. కొన్ని పొడువు కథలు, కొన్ని పొడుపు సామెతలు ఏదో ఒక ఘటనా వైశిష్ట్యం వల్లనే ఆవిర్భవించాయి. ఆకారణాన్నే రెండింటిలో సాదృశ్య ముంది - సారూప్య ముంది.

౬. అపార్థద్యోతకత : పొడుపుకథల్లోనూ పొడుపు సామెతల్లోనూ అపార్థ ద్యోతకత ఉంది. విన్నంతనే ఒకటి అనుకోడం, ఒక్కొసారి అర్థం కాక మొగం మొటకరించుకోడం, పరిశీలనానంతరం మరిఒకటి అని నిశ్చయించు కోడం రెండింటా సమానమే.

64. గుడిసుట్టు తిరిగి
గుళ్లచ్చవోసె [కొబ్బరికాయ]

అవ్వ! ఎంతపని అని నోరు మూసుకోవాలి. హరిహరీ అని చెవులు మూసుకోవాలి. కాని ఇది కొబ్బరికాయ. గుడికివస్తుంది, గుడిచుట్టు తిరుగుతుంది, గుడిలోన పగలుతుంది. పొడుపనే అపార్థ మేఘం విడుపనే గాలివల్ల విచ్చి పోతుంది.

65. **అత్త** ఆరో నెలలో పట్టిన దయ్యం- అనే పొడుపు సామెత ఇట్లాంటిదే. శిశువు ఇంచుమించుగా ఆరోనెలలోనే ఆత్తత్త అనడం ప్రారంభిస్తుందని అర్థం. ఆరోనెలలోనే దయ్యంలాగా అత్త పట్టుకొంటుంది, అప్పటి నుండే తన కొడుక్కో కూతురుకో అంటగట్టేంత వరకు వదలిపెట్టదు అనే అపార్థద్యోతకత, అసలైన అర్థం స్ఫురించాక అంతమవుతుంది.

౭. లయాత్మకత : పొడుపు కథల్లోనూ పొడుపు సామెతల్లోనూ లయాత్మ కత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. గణబద్ధత వల్ల మాత్రాబద్ధత వల్ల ఈ లయా త్మకత ఏర్పడుతుంది.

66. గూట్లో పిల్లా
గుంజితె వొల్లా [నాలుక]

ఈ పొడుపుకథ రెండు పాదాల్లో ఎనిమిదేసి మాత్రలున్నాయి. అట్లనే ఈ ఈ క్రింది పొడుపు సామెతలోని రెండుపాదాల్లోనూ పదకొండేసి మాత్రలున్నాయి. మాత్రాగణబద్ధతకారణాన రెండింటిలోనూ లయాత్మకత సిద్ధించింది.

67. గడ్డతిన్నా కంపే
పాయతిన్నా కంపే [ఉల్లి]

౭. **ఆలంకారికత :** లయాత్మకత కూడా అలంకారానికి లక్షణమే అయినా శబ్దాలమేళవింపువల్ల, అర్థచారుత్వం వల్ల ఆలంకారికత సిద్ధిస్తుంది. ఈ క్రింది పొడుపుకథలోనూ పొడుపు సామెతలోనూ శబ్దాలమేళవింపువల్లనే ఆలంకారికత సిద్ధించింది.

68. సుర సుర కత్తులు
సురారి కత్తులు
రాజలు దెత్తురు
రంభల కిత్తురు [మొగలి పువ్వు]

ఇది పొడుపు కథ కుదాహరణం కాగా, ఈ క్రిందిది పొడుపు సామెత కుదాహరణం.

69. చూస్తే చుక్క
లేస్తే కుక్క [గయ్యాళి]

౮. **అర్థనిగూఢత :** పొడుపు కథకు శబ్దాల మాటునో భావం చాటునో అర్థాన్ని మరుగు పుచ్చుకునే శక్తి ఉంది. దీన్ని అర్థనిగూఢత అనవచ్చు. అన్ని పొడుపు సామెతల్లో అర్థనిగూఢత కనిపించక పోవచ్చు. కాని పొడుపు కథకిది సాధారణమైన విషయం.

70. ఇంటి వెనుక కుప్పవేసి
కుప్పకు నిప్పును వెట్టి
కుప్ప గాలి పోతేను
అప్పు లెల్ల దీరిపాయె [కుమ్మరి ఆవం]

పచ్చికుండల్ని కుప్పగా అమర్చడం, కాల్చడం, అమ్ముకొని అప్పులు తీర్చుకోడం అనే నిగూఢార్థం ఇందులో ఉంది. అల్లే ఈ క్రింది పొడుపు సామెతలో చంద్రుని చుట్టు వర్తులాకారంగా ఉండేకాంతి పుంజం నిగూఢంగా చెప్పబడింది. చంద్రపరివేషంగా పిలవబడేదానిని పల్లెప్రజలు వరదగూడు అంటారు.

71. దూరం గుడికడితే దగ్గరలో వాన
దగ్గర గుడికడితే దూరాన వాన [వరదగూడు]

౧౨. సమస్యాత్మకత : ప్రశ్నాపూర్వకమైన సమస్యాత్మకత కథల్లోనూ సామెతల్లోనూ ఉంది. కాకపోతే ఇవి పొడుపుకథల్లో ఎక్కువగా కనిపిస్తాయి, సామెతల్లో అక్కడక్కడ అగుపిస్తాయి.

72. "కల్లులో ఏకల్లెక్కువ : "అనేది ప్రశ్నాత్మక ప్రహేళిక, ఉప్పుగల్లు అని విడుపు. "ఏరాయివద్దాన్నా ఆరాయి కావాలి? అదేమిరాయి" అనే పొడుపుకథ కూడ ఇటువంటిదే ఉప్పురాయి అని సమాధానం.

73. పొడుపు సామెతల్లో "మూడింటితో ముగిసెకథ" అనగానే ఓనమస్య ఇచ్చినట్టే అనిపిస్తుంది. "కట్టె-కొట్టె-తెచ్చె" అని విడుపు చెప్పగానే ఆ సమస్యను పూరించి నట్టే అవుతుంది. ఈ కారణంగానే పొడుపుకథల్లోనూ పొడుపు సామెత ల్లోనూ సాదృశ్యం ఉందని చెప్పడం.

౧౩. శబ్దతీక్ష్ణత : సూటిగానూ ఘాటుగానూ ఉండే శబ్దతీక్ష్ణత ప్రహేళిక ల్లోనూ ప్రహేళికాలోకోక్తుల్లోనూ సహజసిద్ధంగా ఉంటుంది. విధినిషేధాత్మకత అనే గుణం అక్కడక్కడ ప్రధానంగా కనిపించడంవల్ల ఈ వింగడింపు చేసు కోవడం జరిగింది.

74. చాపను చుట్టలేము
చంకను పెట్టలేము [ఆకాశం]

75. వినకు అనకు కనకు [చెడు]

౧౪. ప్రతీకాత్మకత : పొడుపుకథలు - పొడుపు సామెతలు రెండింటి లోనూ అడుగడుగునా ప్రతీకాత్మకత గోచరిస్తుంది. ఒకవస్తువుకున్న రూప గుణ రస ధర్మాల్ని బట్టి మరొక వస్తువును సంకేతించడం జరుగుతుంది. ఆ సంకే తమే ప్రతీక అనబడుతుంది. ప్రతీకాత్మకత గుణాలున్న సర్వసాహిత్య ప్రక్రి యల్లో పొడుపు కథలు - పొడుపు సామెతలు అగ్రగణ్యాలనడం యథార్థ దూరం గాదు.

76. నడచిపోయే నల్ల రాతికి
నాలుగే లింగాలు [గేదె]

ఈ పొడుపుకథలో గేదెను నల్లరాతితో గేదె చన్నుల్ని లింగాలతో సంకే తించడం జరిగింది. అట్లే ఈ క్రింది పొడుపు సామెతలో కన్యను అరటాకుతో ముల్లును పురుషునితో సంకేతించడం జరిగింది.

77. అరటాకు మీద ముల్లు పడ్డా
ముల్లు మీద అరటాకు పడ్డా
అరటాకుకే ప్రమాదం [కన్య-పురుషుడు]

పొడుపు కథలకూ పొడుపు సామెతలకూ ఇన్ని విధాల సాదృశ్యధర్మా లున్నాయి. ఆచార్యుడు పూర్వరూపం అంతేవాసి ఉత్తరరూపం అనే ఉపనిష దుక్తిని పొడుపుకథ - పొడుపు సామెత సార్థకం చేశాయి. అందువల్లనే ఈడూ-జోడూ, తోడూ - నీడ అక్కడక్కడ అభేదం కొట్టవచ్చినట్లు అగుపిస్తుంది.

ఇంతేగాక ఈరెండింటిలోనూ క్రీడావినోదాత్మకాలైన గుణాలు, కళాత్మకాలైనవిలువలు, వస్తుగుణరస వ్యంగ్యధ్వన్యాదులు, దృశ్యాత్మక లక్షణం, సాంప్రదాయిక బలం ఆదిగా గల అనేక విశేషాల్లో సారూప్యం సాధర్మ్యం సహగమనం సమ్మిళితమై కనబడుతున్నాయి.

కొసమెరుపు :

"ఆరిపోయే దీపానికి వెలుతురెక్కువ". ఇది పెద్దలమాట పెరుగన్నం మూట.

"సామెత సాహిత్యానికే ఆమెత".

పూర్వపూర్వంకన్నా ఉత్తరోత్తరం బలీయం అన్నట్లు పొడుపుకథకన్నా పొడుపు సామెత చింతాకంత ఎదిగినట్లనిపిస్తుంది. ఆయితే రాశిలో పొడుపుకథది, వాసిలో పొడుపు సామెతది అగ్రస్థానం.



# పొడుపు గాథలు

ప్రకృతి పురుషుల ప్రతి కదలికలో ఆవేదనానంద సమ్మిశ్రితాలైన అనేకానేక గాథలు సముద్భవిస్తుంటాయి. ఆ గాథలు కథాసాహితీ ప్రపంచంలో అజరామరాలై నిలిచి ఉంటాయి. మానవలోకానికి విజ్ఞానాన్ని వినోదాన్నీ కలిగిస్తుంటాయి, కాబట్టే అక్షరమైన ప్రతికథ అక్షయ సందేశాన్ని ప్రసారం చేస్తూనే ఉంటుంది.

ఎక్కడో సూర్యోదయం జరుగుతుంది. ఆ వెలుతురు సర్వప్రపంచాన్ని స్పృశిస్తుంది ఎక్కడో ఒక సంఘటన జరిగింది, అది ఒక కథ అయ్యింది, ఆ కథ ప్రసరించింది, దిక్కుల్ని చుంబించింది, ప్రకృతిని స్పృశించింది, మేధస్సుల్ని కదలించింది, తాను సంకేతమై కూర్చుంది, ఆ సంకేతమే ముడి, ఆ ముడి విప్పాలి, అప్పుడే ఆ కథ భాసిస్తుంది.

ఆ ముడే పొడుపు, ఆ పొడుపుకు విడుపు కావాలి. ఆ విడుపే విజ్ఞానం, ఆ విడుపే వినోదం, ఆ విడుపే కారు చీకటిని చీల్చుకొని వచ్చే కాంతి కిరణం.

కథాత్మకాలైన పొడుపుల్లో పొడుపొక ప్రశ్న. కథ ఒక సమాధానం. పొడుపొక సంకేతం, విడుపొక సంఘటన. ఈ సంకేత సంఘటనల్లో మొదట పుట్టింది సంఘటనే. సంఘటనలేనిది సంకేతం లేదు. సంకేతం లేకున్నా సంఘటన ఉంటుంది. ఆ సంకేతం తెలిసిన వాడు పొడుస్తాడు.ఆ సంఘటన తెలిసిన వాడు విప్పుతాడు. అయితే కథాత్మక ప్రహేళికల్లో పొడిచినంత సులభంగా విప్పడం సాధ్యం గాదు. పొడవడానికి అరనిమిషం చాలు, విప్పడానికి అరగంట కావాలి.

వికాసం :

పరిశోధకులు పొడుపుకథ కేవలం కథారహితమైందే అని భావిస్తున్నారు. పొడుపుకథలోనే కథా శబ్దం ఉన్నా ఈ భావన రూఢి పడింది. కాని జానపదుల పొడుపు కథలెన్నో విస్తృతార్థాన్ని అపేక్షిస్తున్నాయి. పొడుపు కథ కథారహితంగా రూఢిపడ్డందు వల్ల వీటిని పొడుపు గాథలుగా పిలవాలనిపించింది. పొడుపు కథలు-కథాత్మకాలు అనే పదబంధం కంటే పొడుపు గాథలు అనడంలోనే

స్వారస్యముంది. పొడుపుగాథా శబ్దంలోనే ప్రశ్న ఉంది, సమాధానరూపంలో పెద్ద కథ ఉంది. అయితే ఆ పొడుపును విప్పే నేర్పూ ఓర్పూ ఉంటేనే ఆ గాథ బొమ్మ కడుతుంది.

ఈ గాథలకు జానపదుని కల్పనాత్మక చమత్కార శబ్దజాలమే మూలం అయినా సంస్కృతంలోని పురాణాలు పంచతంత్ర హితోపదేశాలు; భేతాళ వింశతి; కథాసరిత్సాగర; దశకుమార చరిత్రాదులు, తెలుగులోని మంచన కేయూర బాహుచరిత్ర; జక్కన విక్రమార్కచరిత్ర; గోపరాజు సింహాసన ద్వాత్రింశిక; పాలవేకరి కదిరీపతి శుకసప్తతి కథలు; అయ్యలరాజు నారాయణా మాత్యుని హంసవింశతి; మొదలైన కథాకావ్యాలు ప్రత్యక్షంగానో పరోక్షం గానో వినడం కూడా ఈగాథల ఆవిర్భావానికి ఆధారమే అనాలి. అంతే గాక తెలుగు సాహిత్యంలోని కొన్ని పద్యాలు, పద్యాంశాలు, చాటువులు, సామెతలు, పలుకుబళ్లు, పదబంధాలు, సమస్యలు పొడుపుగాథాలక్షణాంశాల్ని పుణికి పుచ్చుకున్నాయి. వీటి ఆవిర్భావానికి యేదో ఒక సంఘటనను గుది గుచ్చుకొన్నట్లుగా ఇవి కనిపిస్తున్నాయి. అలాకనిపించడమే పొడుపు గాథగా భాసించడం. ఇవేగాక చిక్కుముళ్లతో నిండిపోయిన కాశీమజిలీ కథలు భట్టివిక్రమార్కకథలు, అపూర్వ చింతామణి మొదలైన గ్రంథాల్లోని అనేకాంశాలు పొడుపు గాథా ఛాయల్ని విరజిమ్ముతున్నాయి.

జానపదులు పొడుపు గాథల్ని పరిశీలించినప్పుడు ఇవన్నీ స్ఫురణ లోకి వస్తాయి. మౌఖిక సాహిత్యం ఇంకా పూర్తిగా అక్షర రూపాన్ని పొందకపోవడం వల్ల ఏది మాతృకో, ఏది పుత్రికో తెలుసుకోలేని పరిస్థితి యేర్పడుతుంది. వస్తువర్ణనం, కథాకథనం జీవలక్షణం అని భావించినప్పుడు ఇక ఏపేచి ఉండదు. దేనికేది అనుసరణ అయినా కాకున్నా పొడుపు గాథల్లో వస్తువైవిధ్యానికేం కొరతలేదు. ఆదృష్ట్యాజానపద కథా ప్రహేళికల్ని పౌరాణిక, చారిత్రక, సాంఘిక కాల్పనికాది భేదాలుగా వర్గీకరించే అవకాశ ముంది. కాని జానపదుల హృదయం సాంఘిక కథా ప్రహేళికల్లో, కాల్పా నిక కథా ప్రహేళికల్లో అధికంగా దృశ్యమానమవుతుంది.

ఈ గ్రంథంలోని మొదటి వ్యాసంలో పొడుపు కథల్ని వింగడిస్తూ కథాత్మకాలు అనే అంశంక్రింద (పుట : 18) ఈవిషయం స్థూలంగా

చర్చించడం జరిగింది, అదే విధంగా రెండో వ్యాసం పొడుపు సామెతల్లో కథానహితాలు అనే అంశంక్రింద కొన్ని విషయాలు ప్రస్తావించడం జరిగింది తెలుగునాట అక్కడక్కడ ప్రచారంలో ఉన్న కొన్ని పొడుపు గాథల్ని పరిశీలించడమే ఈవ్యాసం ఉద్దేశం.

సాంఘికాలు :

సమకాలీన జీవన స్థితిగతిప్రగతుల్ని, మనోవికారాల్ని, సర్వజీవ ప్రకతుల్ని పొడుపు గాథల్లో దర్శించే అవకాశముంది. పొడుపు విప్పినప్పుడు ఆకథలో ఇవన్నీ కనిపిస్తాయి. మానవాంతరంగశోధన సృష్టిరహస్యసాధన తనదిగా చేసుకొందా అనేంతవరకు నడిచింది పొడుపుగాథ. అంతేగాక సామాజిక శాస్త్రాన్ని పొడుపు గాథ అపోశనం పట్టిందా అనేంతవరకు వెళ్ళింది.

అప్పులోడొచ్చి అయ్యసంగతడిగితే
ముల్లుకు ముల్లు నాటవోయిండు
ఒకటికి రెండు సేయవోయింది
నూటొక్కరాశిని మర్దన సేస్తుండ, అన్నది

నిజాయితీ పరుడైన కాపు, చాలీ చాలని ఆదాయంతో సంసారం ఈదు తున్నాడు. అతనికో కూతురుంది. సంసారం కొరకు సాహుకారు దగ్గర అప్పుచేశాడు కాపు. సాహుకారు ఓనాటి పగటి పూట కాపు ఇంటికి వచ్చాడు. అమ్మాయిని అయ్య సంగతి అడిగాడు. కాపుబిడ్డ "మా అయ్య ముల్లుకు ముల్లు నాటవోయిండు" అన్నది. సాహుకారు బిత్తరపోయి అమ్మ సంగతి అడిగాడు. "మా అమ్మ ఒకటికి రెండు చేసుకరానువోయింది" అంది కాపు బిడ్డ. అదీ అర్థం గాక మరేమడుగాలో తెలియక "మరి నీవేం చేస్తున్నావు"? అని అడిగాడు సాహుకారు. "నూటొక్క రాశిని మర్దన సేస్తుండ" అంది కాపు బిడ్డ లోలోన నవ్వుకొని.

సాహుకారు బుర్రగిర్రున తిరిగిపోయింది. కుతూహలం పెరిగింది. మాటల ముడిని విప్పనిది కదలకూడదనుకున్నాడు.

"ఎంటో అమ్మాయి! కాపు కూతురనిపించుకొన్నావు, నీవు చెప్పింది నాకేం అర్థం కావడంలేదు" అన్నాడు శ్రేష్ఠి.

"ఇదిగో! సాహుకారు అర్థం విప్పిచెప్పినట్లయితే మా అయ్య మీకిచ్చే డబ్బుకు రెండింతలిస్తాను" అంది పకపకనవ్వుతూ కాపుబిడ్డ.

ఆ అమ్మాయి పరిహాసానికే అంటున్నదనేది శ్రేష్ఠి కర్థమైపోయింది. వెంటనే "అదంతా ఎందుకమ్మాయీ! నువ్వే చెప్పు మీ అయ్యనాకు అప్పేలేదని అంతా తీర్చేశాడని కాగితం రాసిస్తాను" అన్నాడు ఉదారహృదయంతో ఉత్సాహంతో సాహుకారు.

కాపు బిడ్డ సాహుకారు దిక్కు కృతజ్ఞతా భావంతో చూసింది. "అయ్యా! ముల్లుకు ముల్లు నాటవోయాడంటే ముల్లు వంకాయతోటకు కంప (కంచె) నాటవోయాడని అర్థం. ఒకటికి రెండు చేసుకురాను పోయిందంటే సెనగల్ని పప్పుబద్దలుగా చేయడానికి పొరుగింటికి పోయిందని అర్థం. ఇక నూటొక్క రాశిని మర్దన సేస్తుండ అంటే రొయ్యల్ని చంపి పొట్టు తీసి వేపుడు చేస్తున్నానని అర్థం" అన్నది దండం పెట్టి కాపుబిడ్డ.

ఆ కృషీవలుని ఇంటి నగ్న స్వరూపం ఆ సాహుకారు కళ్లకు బొమ్మకట్టినట్లయింది. కుటుంబంలోని పిల్లాపాపా అందరూ పరిశ్రమిస్తున్నారు. అయినా తన వడ్డీల అప్పు తీర్చలేక పోతున్నారు. చీ చీ పాపపు వడ్డీ అనుకున్నాడు. అప్పు అనేది మానవత్వంతో మరొకరికి సహకరించే విధంగా ఉండాలి కాని, వడ్డీలపై వడ్డీలు లాగి ఆ సంసారాన్ని కూలద్రోసే విధంగా ఉండరాదనుకున్నాడు. ఆ అమ్మాయి తెలివి తేటలకు ముగ్ధుడయ్యాడు. హృదయమూ నయనాలూ ద్రవించాయి. కోటుజేబు నుండి అప్పు పత్రం తీసి పాటాగొట్టి ఆ అమ్మాయి అంజలీబద్ధ హస్తంలో ఉంచి భార హృదయంతో వెనక్కు మళ్లాడు సాహుకారు.

నిజమే, ఆ కుటుంబంలోని పూర్వ సంసారాలవల్ల అక్కడ పుట్టిన చిగురు కొమ్మయినా చేవదేరి ఉంటుంది. చక్రవడ్డీలకు మరిగి పాషాణ హృదయుడైన సాహుకారు మనస్సునే మార్చిన ఏడేళ్ల బాలిక ప్రజ్ఞ ఈ పొడుపు గాథలో ద్యోతకమవుతోంది. ఆ గాథ ఓ కుటుంబ పరిస్థితిని బొమ్మకడితే ఈ క్రింది పొడుపు గాథ తిండిపోతైన ఓ యువతి మనస్తత్వాన్ని తెలియజేస్తోంది.

కతకత కానసులు
పీటెడు పాశం జుర్రసులు (నూకసులు)

వత్తుల సెయ్యద్దసులు
దీవం సిటుకు
తలుపు పొటుకు (పోక పొటుకు)
వచ్చినా ఎనుక వండసులు.

ఓ భార్యామణి భర్త చాటున బాగా తినమరిగింది. అతనికి మాత్రం చెడ్డది వడ్డది చేసి పెట్టేది. తాను పంచభక్ష్య పరమాన్నాలతో పొట్ట పూజ చేసేది. ఆ రోజు మధుర పదార్థాలెన్నో సిద్ధం చేసింది. ఇక తిందామనుకొంది- ఏదో పనిమీద ఇరుగమ్మలు పొరుగమ్మలు వచ్చారు. వారందరినీ సాగనంపి సాపాటు కానిద్దామనుకుంది. కానీ భర్త రానే వచ్చాడు. అతనికేదో ఇంత పెట్టింది. తాను తర్వాత తింటానంది. అలసిసొలసి వచ్చిన భర్త నడుంవాల్చి కళ్లు మూసుకున్నాడు. ఆ యిల్లాలు కొంత సేవతని పొంతన ఉంది. అచ్చట్లు ముచ్చట్లు పలికి నంగనాచి కబుర్లు చిలికింది. ఆ భర్త ఉలుకూ పలుకూ మానాడు. నిద్ర పోయాడనుకొంది. సంతోషంతో వంట ఇంట్లో ప్రవేశించి ఆదరాబాదరాగా పొట్ట పూజ కానిచ్చి భర్త పక్కకు చేరింది.

"ఓయ్! ఓయ్! అప్పుడే నిద్రపోయావా! ఓ కథ చెప్పవా" అని మోచేతితో గుద్దుతూ మోకాలితో కుదుపుతూ అడిగింది. భార్య ప్రవర్తన అతనికీరోజు కొత్తేం కాదు. అయినా "తిండిపోతుది" అని మనస్సులోనే అనుకున్నాడు.

"ఓ అసులూ!" అని భార్యను సంబోధించాడు. "ఇది కథకాదు, పీట కింద దాచిపెట్టిన పాయసం జుర్రావు. చేయి బయట కుడుక్కుంటే నేను చూస్తానేమో అని వత్తులోనే చెయ్యద్దావు. ఓ చిటుకు వేసి దీపమూదావు. తలుపును పుటుక్కున దగ్గరకు లాగావు. వచ్చి నా వెనుక ఒరిగావు."

పాపం, ఆ పడతి బండారం బయటపడింది. ముంతెడంత ముఖం చింతాకంత అయ్యింది. మారు మాటాళ్లేదు, అంటే మారు కథ పొడవలేదు. ఏవేవో శాస్త్రాలు చెప్పి భర్త నోరు కట్టివేసే ఆ మగువ తేలు కుట్టిన దొంగలా నోరే తెరువలేదు.

"పడితే పిడికెడు, విడిస్తే ఇల్లెడు" అనే పొడుపు కథ "దీపానికి" సంబంధించిందే అయినా పొడుపు గాథ విషయంలో ఈ మాట సత్యమనిపిస్తుంది.

"జానెడు పిట్ట మూరెడు తోక" అనే పొడుపు కథ "తెడ్డు"కు సంబంధించింది అయినా పొడుపుగాథకు కూడా అన్వయిస్తుంది. ముత్తెమంత పొడుపు కథలో ముంతెడంత అర్థం నిండివుంది. అందువల్లనే వీటిని పొడుపు గాథలనడం. ఇలాంటిదే మరొకటి పరిశీలిద్దాం.

భారతీయ సాహిత్యంలో అనేక ధర్మ గ్రంథాలు ఇంద్రియ నిగ్రహ ప్రాధాన్యాన్ని నొక్కి వక్కాణించాయి. కాని మానవునిలో జితేంద్రియత్వం కనిపించడంలేదు. "పొరుగింటి పుల్లకూర రుచి" అని భావిస్తున్నాడు. అప్పుడప్పుడు స్వీయను ఉపేక్షించి పరకీయను అపేక్షిస్తున్నాడు. ఈ క్రింది పొడుపు కథ ఆ విషయాన్నే ప్రస్తావిస్తుంది.

నూనె మల్లెడ్డి యేసింది పొన్న
కై మల్లింది పొన్న
పొన్న కింది కోయిన ఫలమేం లేదు గాని
కారకుచ్చ తెల్లారె....
బంగారు కొడవలి తోని కోసిన గడ్డి
గాడ్డి ముందల వేస్తే
తినని గాడ్డిని
ఎడమ కాలితో తందునా!
కుడి కాలితో తందునా!

ఈ జీవితంలో పంతాలు-ప్రతిజ్ఞలు ఆవేశకావేశాల్ని పెంచుతాయి. అవి నెరవేరినా నెరవేరకున్నా జీవన ఋజుపథంలో ఆనందంతో - ఆవేదనతో నిండిన మలుపుల్ని సృష్టిస్తాయి. ఈ పై పొడుపు గాథ దాదాపు అలాంటి మనస్తత్వాన్నే చిత్రించింది.

తెలుగు దేశంలో ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలోని పటేల్ పట్వారీలను గ్రామాధికారులంటారు. పట్వారీలను కరణాలనీ మాలి పటేళ్లను మున్సబులని ఇతర ప్రదేశాల్లో పిలుస్తారు. ఓ గ్రామం పట్వారీ గారికి పటేల్ భార్యమీదికి మనసుపోయింది. ఆమెకొరకు పరితపించాడు. ఎన్ని ఎత్తులన్నా ఎత్తి ఆమెను పొందాలనుకున్నాడు. తన భార్యతో కలిసి ఓ ప్రణాళిక సంసిద్ధం చేశాడు. భర్త "ఊఁ" అంటే "ఊఁ" అనీ, "ఆఁ" అంటే "ఆఁ" అనే ఆ భార్య ఆ ప్రణాళికను

ఆవరణలో పెట్టింది.

తాము చేసే తప్పుడు పనికి శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతాన్ని వాడు కోడానికి కూడా వెనుకాడలేదు భార్యా భర్తలు. వ్రతానికి పటేల్ భార్యని ఆహ్వానించింది పట్వారీ భార్య. తానే స్వయంగా పిలుచుకొని వచ్చింది. ఆ రోజు రాత్రికూడ పని ఉందనీ తనకు తోడుగా ఉంటుందనీ ఆమె అత్తగారికి చెప్పి అనుమతి కూడా తీసుకుంది. వ్రతం జరగాల్సిన విధంగా జరిగింది. పటేల్ భార్యకు ఎనలేని గౌరవ మర్యాదలిస్తున్నారందరు. వచ్చిన వాళ్ళందరు వెళ్లిపోయారు. పట్వారీ భార్య కోరికమేరకు పటేల్ భార్య అక్కడే ఉండిపోయింది.

రాత్రి రెండో జాము ప్రవేశించింది. అంతవరకు పట్వారీ భార్య పడగ్గదిలోనే ఇద్దరూ ఆ మాటా ఈ మాటా మాటాడుకుంటున్నారు. ఈ సమయంలో పటేల్ భార్యను ఒంటరినిచేసి పట్వారి భార్య వెళ్ళిపోయింది. ఆ గదిలోకి పట్వారి వచ్చాడు, తలుపులు మూశాడు, ఆమె మీద తనకు సంవత్సరాలుగా మోజుందన్నాడు, ఆ మోజు తీర్చమన్నాడు.

ఆమె పరిస్థితి గమనించింది, తన తల వెంట్రుక ఒకటి పెరికింది. మెడలోని మంచి ముత్యాల దండను తెంపి నేలపై వెదజల్లింది. "అయ్యో! ముత్యాల దండ తెగిపోయింది, రేపు మా అత్త ఏమంటుందో అని కంట నీరు పెట్టుకొంది. భయ భ్రాంతయై చలించిపోయింది. క్షణంలో మూర్తీభవించిన శోక దేవత అయ్యింది. పట్వారీ తత్తరపడ్డాడు. ఆమె ఇచ్చిన వెంట్రుకను తీసుకున్నాడు ముత్యాల నేరుతూ దండ గుచ్చడం మొదలుపెట్టాడు. ఆమె శోక దేవతలా చింతిస్తూ అలాగే కూచుంది. పట్వారి పట్టుదలతో తెల్లవారేవరకు దండ తయారు చేస్తూనే ఉన్నాడు. ఆ వెంట్రుకకు ఒకవైపునుండి ముత్యాలు గుచ్చుతుండగా మరోవైపునుండి జారిపోతున్నాయి. ఆవిధంగా కార- కుచ్చ తెల్లారిపోయింది, పటేల్ భార్య వెళ్లిపోయింది.

అప్పటికి జరిగిందేంటో పట్వారీకి అర్థమయ్యింది. తనకు పరాభవం జరిగిందనుకున్నాడు. ఎట్లయినా ఆమెను సాధించాలని నిశ్చయించుకున్నాడు.

ఓనాడు రచ్చకట్టు మీద సభ ఏర్పాటు చేయించాడు. పటేల్ తండ్రిని పిలిపించాడు. "నూనెమ్రెడ్డి మేసింది పొన్న...." అనేశాస్త్రం వేశాడు. దాని

ర్థం విప్పిచెప్పమని బలవంతం చేశాడు. "చెప్పితే తన ఆస్తి వదులుకుంటానని, చెప్పకపోతే నీకోడలిని వదులుకోవాల్సి ఉంటుందని" నియమం పెట్టాడు.

పటేల్ తండ్రికిది యేమీ అర్థంకాలేదు. కొడుకు ఊళ్లోలేడు. పదిమందిలో వచ్చిన ఈ సమస్యను పరిష్కరించే మార్గం కనిపించలేదు. పంతాలతో పట్టింపులతో బతుకుతున్న కాలమది. ఇంటికి వచ్చి చింతిస్తూ కూచున్నాడు... ఊరికి ఊరే గుప్పుమన్న ఈవార్త కోడలికి తెలియకుండా ఉంటుందా! ఆమె చింతిస్తూ కూచున్న మామ గారి వల్ల అసలు సంగతి తెలుసుకొంది. వెంటనే రచ్చకట్టుకు బయలుదేరింది. తానేదో ఘనకార్యం సాధించినట్టు మీసాలు దువ్వుతూ కూచున్న పట్వారీ ముందుకు వెళ్లింది. ఆమె సాహసానికి అందరు బిత్తరపోయి చూస్తున్నారు. మా మామగారికి మీరువేసిన శాస్త్రానికి నేను సమాధానం చెబుతానన్నది.

పొడుపుగాథ ఉత్తరార్థాన్ని (బంగారు కొడవలి....) ప్రయోగించింది. పట్వారీకి అర్థమయ్యింది. చేజేతులాతానే స్వర్ణావకాశాన్ని పాడుచేసుకున్నాననుకున్నాడు. ముత్యాలపేరు సమకూర్చడం లోపడి ముద్దుగుమ్మవైపే చూడలేకపోయాడు. తానుగాడిద, నిజంగానే అడ్డగాడిద, తనలో తానే కుమ్లుతూ కుంగుతూ, వంచిన తలయెత్తలేదు పట్వారీ.

"ఓడిపోయింది మా మామకాదు, నేనుకాదు, నీవు" అంది పటేల్ భార్య. ఓటమినంగీకరించాడు పట్వారి.

ఈ పొడుపు గాథ మర్మం ఇద్దరికే తెలుసు. ఆ ఇద్దరూ మర్మాన్ని మర్మంగానే ఉంచారు. కాని జానపదహృదయం ఆ రహస్యాన్ని బట్టబయలు చేసింది. పెద్దల బుద్ధుల వెనుకఉన్న మాయల్ని - మర్మాల్ని లోకానికి తెలియజేసింది. కొన్నివాస్తవాల్ని లోకానికి తెలియజేయడమే కాకుండా కథలో చిత్రవిచిత్రాల్ని కలిపింది. జానపదహృదయానికి కథా వైచిత్రిపై మక్కువ ఎక్కువ. దానికిక్రింది పొడుపుగాథ నిదర్శనం.

మామా! మేనమామ
ఉంచుకున్నదాని కొడుకునురా!
మామ్మ అన్నానికి రమ్మంటున్నదిరా!

ఓ షోకిలా రాయన్నికి నాటకాలపై ఎనలేని మోజు. ఎక్కడ ఎవరు

నాటకం మానినా పెళ్లి చూస్తుంటాడు. ఓనాడొక నాటకానికి వెళ్లాడు. ఆనాటకంలో అమ్మాయి వేషం వేసిన అబ్బాయిని అమ్మాయిగా భ్రమించి, అపహరించి ఇంటికి తెచ్చి ఓగదిలో పెట్టితాళం వేశాడు. ఈ అపహరణ ఎవరికంటా పడలేదని సంతోషించాడు. అయినా ఈ విషయం మీద ఆ నాటకాలవాళ్లు ఏమనుకుంటున్నారో తెలుసు కోవాలనిపించింది. ఇది బయటకు పొక్కితే జనం ఏమనుకుంటున్నారో కూడా తెలుసుకోవాలనిపించింది. ఇదొక కుతూహలం అంతే.

అక్కడా ఇక్కడా తచ్చాడుతున్న ఇతణ్ని సముద్రపు దొంగలు పట్టుకొన్నారు. దొంగతనాల్లో శిక్షణ ఇచ్చి తమలో కలుపుకొన్నారు. ఇక ఎటూ వెళ్లలేని పరిస్థితుల్లో ఆ దొంగల గుంపులో కలిసి పోయాడు. తప్పించుకుందామనుకున్నా సాధ్యం కాలేదు. చివరికి పదిసంవత్సరాల తర్వాత ఆ యువకుని ప్రయత్నం ఫలించింది.

ఏలాగోలాగ ఇంటికి వచ్చేశాడు. కాని ఇక్కడ కథ మరోమలుపు తిరిగింది.

ఇంటి మూలగది తలుపులు మూసి ఉన్నాయి, పైగా తాళంవేసి ఉంది. లోన ఎవరో తలుపులు తట్టుతున్నారు. ఆ యువకుని చెల్లెలికి అనుమానం వచ్చింది. మారుతాళం చెవితో తలుపులు తీసింది. ఆశ్చర్యంతో కళ్లింతలు చేసింది. స్త్రీవేషంలో ఉన్న ఆ అందాల నటుడు అన్నీవివరంగా చెప్పాడు. ఈ విషయం ఆ అమ్మాయి తన తల్లిదండ్రులకు చెప్పింది. అన్నకొరకు ఎదురు చూసింది. అప్పటికే నాటకాల వాళ్లు వెళ్లిపోవడంవల్ల ఆయువనటుడు అక్కడే ఉండి పోవాల్సివచ్చింది. అదీగాక అతడా అమ్మాయిని చూశాక అక్కణ్నుండి కదల్లేక పోయాడు. ఆ అమ్మాయికూడా అతణ్ని ప్రేమించింది. తల్లిదండ్రుల అనుమతితో ఆ నటుణ్ని పెళ్లి చేసుకొంది. అప్పటి నుండి ఆ యువనటుడా ఇంటనే ఉండిపోయాడు. ఆ ఇంటికి మగదిక్కయ్యాడు. ఆ కుటుంబం వృత్తి వ్యాపారాదులు తనవిగాచూసు కుంటున్నాడు.

ఆ యువ దంపతులకో కొడుపు పుట్టాడు. వాడు దినదిన ప్రవర్ధమానమై పెరిగాడు. ఆడనేర్చాడు. మాటాడ నేర్చాడు. మాటలో పొదవడం నేర్చాడు. తల్లిదండ్రుల వల్ల తన మేనమామ కథాకమామిషు విన్నాడు.

ఆనాడు అంటే ఏడేళ్ల తర్వాత ఆయింట్లో ప్రవేశించిన ఆ వ్యక్తి ఎవరో తల్లి చెప్పగా తెలుసుకున్నాడు. కాళ్ల చేతులు కడుక్కోమని నీళ్ల అందించాడు. "ఈ అబ్బాయి ఎవరో అచ్చం...." అని ఆశ్చర్యంలో మునిగిపోయాడతను, అప్పుడు ఈ పొడుపు గాథను పొడిచాడా కుర్రాడు.

ఈ కథ ఇలా మలుపు తిరుగుతుందని పాపం ఆ మేనమామ కలగన్నాడా! కాని జానపదుడు కలగన్నాడు.

నిజమే! సమాజంలో ఇలాంటి విచిత్ర సంబధాలప్పుడప్పు డేర్పడుతుంటాయి అవి జనం నోటిలో ఆడుతాయి, కథలవుతాయి, అక్షర రూపాన్ని ధరిస్తాయి, అందరినీ అలరిస్తాయి.

ఇలాంటి కొన్ని యాదృచ్ఛిక సంఘటనలు కొన్ని మనస్సుల్ని కలుపుతాయి, కొన్నిమనస్సుల్ని విరుస్తాయి. దాంతో కుటుంబ వాతావరణం చెడుతుంది. వరుసలు బీరకాయ పీచులవుతాయి."కాపోనికి వరున లేదు కప్పకు తోకలేదు" అనే సామెతలుద్భవిస్తాయి. ఈ క్రింది పొడుపు కథ అటువంటిదే!

తాతా! తాతగారూ
వరుసకు బావగారు
కూతురు మీ యత్తగారు
కూటికి పిలుస్తుంది రండి.

తన కూతురుకో కొడుక్కో సంతానం కలిగినప్పుడు ప్రతివ్యక్తి తాత అవుతాడు. మనుమలూ మనుమరాండ్రూ పెరుగుతూ తాతగారి మీసాలతో ఆడుకొంటారు. వారు పెద్దవారైనా తాతగారితో పూర్వ సాన్నిహిత్యం చెదరి పోకుండా ఉంటుంది. ఆ సాన్నిహిత్యమే ఇక్కడ కొంపముంచింది.

ఎదిగిన మనుమరాలు ఓనాటి రాత్రి తాత ప్రక్కన నిద్రించడం జరిగింది, ఇంట్లో ఎవరూలేరు. తాత ఆ రోజే వచ్చారు. మనుమరాలికి లోకం తెలియదు. మనస్సు వికసించలేదు. మంచిచెడ్డల గురించి ఇంకా ఆలోచించే వయస్సూరాలేదు. చింత చచ్చినా పులుపు చావని ఆ తాతగారు మనుమరాలని కౌగిలించుకున్నారు. లోకం తెలియని ఆ అమ్మాయి వ్యతిరేకించ లేదు.

ఆ మరునాడే తాతగారు వెళ్లిపోయారు. రాత్రి జరిగిందేంటో ఆ అమ్మాయికి అర్థమయింది. తాత మీద అసహ్యం కలిగింది, ఎంతో సేపు చింతించింది, కుళ్లి కుళ్లి యేడ్చింది. అయినా గుట్టు రట్టుగాకుండా వ్యవహరించింది.

వేములవాడ రాజరాజేశ్వర స్వామి దర్శనానికి వెళ్లిన తల్లిదండ్రులు వచ్చారు. వారికి కూడా ఈ విషయం చెప్పలేదు. అలా కొన్ని రోజులు గడిచాయి. తన కూతురునూ అల్లుణ్ని చూసిపోడానికి మళ్లీ ముసలాయన వచ్చాడు. ఆయన కూతురు తాతను భోజనానికి పిలుచుకురమ్మని తన కూతురుకు చెప్పింది. మనుమరాలికి తాత మీద కసిఉంది. తన మనస్సు ఎదిగిందని తాతకు చెప్పాలనుకుంది. తాత హృదయం కలుక్కుమనేట్లు పొడిచింది.

అతడు తాత - తాను మనుమరాలు, అది తనతల్లి వైపు వరస. అతడు తనను పొందాడు, అందువల్ల బావ అయ్యాడు, తాను మరదలయ్యింది, ఇది అక్రమ సంబంధం వల్ల ఏర్పడ్డ తనవైపు వరస. తనను పొందాడు కాబట్టి తాన తని భార్య అయ్యింది, తన తల్లి అంటే అతని కూతురు అతనికి అత్తవరున అయ్యింది, ఇది కూడా తన కారణంగా ఏర్పడ్డ వరసే.

జానపదులు క్రాంతదర్శులు. ఈ సంఘటనను కనుగొన్నారు. పై పొడుపు కథను కట్టుకొన్నారు.

సామాజిక బంధాలు శిథిలం కాకూడదనే ఉద్దేశంతోనే ధర్మశాస్త్రాలు ఆ విర్భవించాయి. అవి శిథిలాలైతే మనుగడ దుర్భరమవుతుంది. అ దుర్భర స్థితినుండి సుగతికి, ఆసుగతి నుండి ప్రగతికి భారతీయ సాహిత్యం సోపానాల్ని నిర్మించింది. కాని ఆ సోపానాలెక్కలేనివాళ్లు, ఎక్కినా ఆచరణలో పెట్టలేని వాళ్లు తాము దిగజారడమే కాకుండా సామాజిక నిబంధనల్ని పాతాళానికి తొక్కారు. ఈ క్రింద ఉదాహరించే భార్యాభర్తల సంవాదం అందుకో నిదర్శనం.

సవాసేరు బెల్లం
తైదా రొట్టె
సక్కంగ తినోయి
నాసామి.
పాలటిక తీసుక
పక్కన గొట్టితే
పండ్లిగుల వట్టెనే
నీ దేవుడు.

భర్త పొరుగూరుకు వెళ్లాడు, ఆ యువతి తన ప్రియునికి కబుర్లంపింది. అతడు ఈ అదును కొరకే చూస్తున్నాడు. వెంటనే వచ్చేశాడు. ఆ భర్తకు భార్య విషయంలో మొదటినుండీ అనుమానంగానే ఉంది. ఆరోజతడు కావాలనే వెనక్కు వచ్చాడు.

ఆమెతన ప్రియుని కొరకు తైద (రాగి) రొట్టెలు చేసింది. ఆ ఉడుకుడుకు రొట్టెలకు సవాశేరు బెల్లం సంసిద్ధంగా ఉంచింది. రొట్టెబెల్లం ప్రియునికి అందిద్దామనుకున్నంతలో భర్త రానేవచ్చాడు. ఆమెవెంటనే రొట్టె-బెల్లం పాల కుండలో ఉట్టిమీద పెట్టింది. ప్రియుణ్ని పెద్ద కొట్టైలో దాచింది. భర్తను మాటల్లో మభ్యపెట్టి కూచోబెట్టింది.

కొట్టైలో కూచున్న ప్రియుడు ఉక్కతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. అటూ ఇటూ కదులుతున్నాడు. ఆ సంగతి ఆమెకు అర్థమవుతూనేఉంది. ఆ ప్రియుణ్ని ఓదార్చాలి. ఇప్పుడు కష్టమున్నా భర్త పోయిన వెంటనే నీవు "సవాశేరు బెల్లం, తైదరొట్టె" తిందువుగాని అంది, ఒక్కసారికాదు, మూడు సార్లు అంది. భర్త ఇదంతా గమనిస్తూనే ఉన్నాడు.

"ఏమిటా పాట" అడిగాడు భార్యను.

"అదో పొడుపు కథలే" చప్పరించి వేసింది భార్య.

"అయితే నేనో పొడుపు కథ పొడుస్తా" అనిలేచాడు భర్త.

నేరుగా పాలకుండ దగ్గరికి వెళ్లి ఉట్టిమీది నుండి దింపాడు. ఆ కుండను పట్టుకొని కొట్టై దగ్గరకు వెళ్లాడు. తన బలం కొద్ది కొట్టైలోని వ్యక్తి నెత్తిన గొట్టాడు. భార్యవైపు చూస్తూ "పాలటిక తీసుకొని, పక్కన గొట్టితే పండ్లిగుల వట్టెనే నీ దేవుడు" అన్నాడు.

సంసారం సాఫీగానే సాగాలి, తనప్రియుడు కూడ తన ఇంటికి వచ్చిపోతూఉండాలి. ఏబలహీనత కారణమైనా ఈరకపు మనస్తత్వం సమంజసంకాదు. రంకూ బొంకూ దాగడం చాలా కష్టం. అయినా రంకాడ నేర్చినవారు బొంకాడి తప్పించుకున్న కథలూ - గాథలూ లేకపోలేదు. పదిమందిలోనే బలాదూరుగా తనప్రియుణ్ని పిలిపించుకున్న సంఘటనలూ లేక పోలేదు.

ఇద్దరి మీదెక్కి
ముగ్గుర్ని నూట గట్టుకోని
పరాసికాన్ని పైనేసుకోని
హాసికాన్ని సేతవట్టుకోని
గాండ్లోని కొట్టెన్కంగవడి
మా కోట్లకు రా !

ఆనాడు రుక్మిణి "లోపలి సౌధంబు" లోనికి వచ్చే ఉపాయం కృష్ణునికి చెప్పంపింది. అట్లే ఓ కోటలోసి దొరసాని మనసైన మగవానికి మర్మంతో మాట పంపించింది. కోటలోనికి వచ్చేవారెలా ఉండాలో అతని వేషధారణ కూడా అలాగే ఉండాలనే ధ్వని ఆమె మాటల్లో ఉంది.

"ఇద్దరి మీదెక్కి" అంటే చెప్పులు వేసుకోవాలనీ, ముగ్గుర్ని నూటగట్టుకోని, అంటే కాసు సున్నం ఆకులనునోట బట్టి అనీ, "పరాసి కాన్ని పై నేసుకోని" అంటే జారిపోయే సిల్కుకండువాను భుజంపై వేసుకొని అనీ, హాసికాన్ని సేతవట్టుకోని " అంటే విలాసార్థం ధరించే కట్టే పట్టుకొని అనీఅర్థాలు ధ్వనిస్తున్నాయి. ఇకగాండ్ల వాని కొట్టు వెనుకగా మా కోట్లోకి రావాలి అనడంలో ఆమె అభిప్రాయం సువ్యక్తమవుతూనే ఉంది. "గాండ్ల" నూనె తీస్తాడు. నూనె తీసుకొని వెళ్లడానికి ఎందరో అటువైపు వస్తారు. ఆ వచ్చిన వాళ్లందరూ ఈ "టీకు తాకుసోకులయ్య"ను చూస్తుండగా రావాలని ఆ కోట్ల దొరసాని అభిప్రాయం.

అంతగాకోరుకున్న ఆమగువ కోరిక తీరక ఉంటుందా? కడుపు పండక ఉంటుందా! జానపదుని కంటపడకుండా ఉంటుందా! కథ రచ్చకెక్కక ఉంటుందా!

కేవలం ఇలాంటి పొడుపుగాథలే కాకుండా, పిల్లల మనస్సులు మెచ్చని పనులు తల్లిదండ్రులు చేసినప్పుడు తమ వ్యతిరేకతను పరమరమణీయంగా వ్యక్తీకరించిన విషయాలు పొడుపుగాథల రూపంలో కనిపిస్తున్నాయి. అందులో ఒకటి ప్రస్తావిస్తాను.

"తమలపాకు తెచ్చాను
తీసుకో మామయ్యా!"

"ఆకుతెచ్చావా! సున్న మేదమ్మా!"
"సున్నం గోడకుంది
తీసుకో మామయ్యా!"

ఆ తల్లిదండ్రులకు కట్నాలు కానుకలు ఎక్కువగా ఇచ్చే స్తోమతలేదు. అందువల్ల తమకూతురును ఓ దూరపు బంధువుకు ఇవ్వాలని నిశ్చయించారు. అతని మొదటి భార్య పోయింది, ఇదిరెండోపెళ్లి, ఆ అమ్మాయి కతడు మామ వరస కూడా అవుతాడు. అతడుకూడా ఈ పెళ్లికి అంగీకరించాడు. ఆ అమ్మాయికేమో ఇష్టంలేదు, తల్లిదండ్రులతో గట్టిగా చెప్పలేక పోతోంది. ఆ తల్లిదండ్రులకు కూడా ఇది ఈడూజోడూ కుదరని పెళ్లి అని తెలుసు. అయినా వాళ్లకున్న ఇబ్బందుల వల్ల ఏదో కతకత అనిపించి పెళ్లి అయ్యిందనిపిస్తే చాలు అని అనుకుంటున్నారు.

పెళ్లికొడుకు వచ్చాడు. మాటా ముచ్చట కుదిరింది. భోజనాలు చేశారు. అతను వసారాలో కూచున్నాడు. తల్లిదండ్రులేదో పనిమీద ఉండడం గమనించి ఆ అమ్మాయి మెల్లగా అతని దగ్గరికి వెళ్లింది.

"తమలపాకు తెచ్చాను తీసుకోమామయ్యా" అంది. "ఆకు తెచ్చావా! సున్న మేదమ్మా!" అతడడిగాడు. "సున్నం గోడకుంది, తీసుకోమామయ్యా" ఆ మాటఅని గిరుక్కున వెళ్లిపోయిందా అమ్మాయి.

గోడసున్నం తమలపాకులో వేయరు. అది తీసినా సరిగారాదు. ఒకవేళ వచ్చినా ఆకులో వేసినా నోరు పూర్తిగా పండదు. ఇంకేం ఆ అమ్మాయి హృదయ మతనికి తెలిసి పోయింది. ఆమె ప్రజ్ఞకబ్బుర పడ్డాడు. గృహ యాజమానికి మరో సంబంధం చూసుకొండని చెప్పి వెళ్లిపోయాడు.

ఇలాంటి పరిస్థితుల్లోనే "సంశయాత్మావినశ్యతి" అని గీతాకారుడు చెప్పింది సత్యమనిపిస్తుంది ఆ అమ్మాయి మనసులోని మాట దాచుకోలేదు, ఆ కారణాన్నే తన జీవితానికి పూలబాట వేసుకోగల్గింది.

సాంఘిక జీవితాల్ని ప్రతిబింబించే ఇలాంటి పొడుపు గాథలెన్నో లభిస్తున్నాయి. జానపదుల హృదయక్షేత్రంలో ప్రవేశించి సేకరించుకున్న ఈ

గాథల్ని గంపలకెత్తవచ్చు, గాదెలు నింపవచ్చు. సాంఘిక పొడుపు గాథల కన్నా అధికంగా కాల్పనికాలు లభిస్తున్నాయి. అవి కొన్ని ప్రస్తావించుకొని ఈ వ్యాసానికి సమగ్రతను సమకూర్చుదాం.

కాల్పనికాలు :

ఈ మనస్సు తానున్న సంఘంలోని యథార్థ విషయాల్ని గమనిస్తూనే తదతీతంగా తద్భిన్నంగా ఊహిస్తూనే ఉంటుంది. ఆ ఊహలు రూపుగట్టి అక్షరాకృతిని ధరిస్తాయి. అప్పుడవి వాస్తవ విరుద్ధాలుగా కనిపిస్తాయి. అలా కనిపించిన వాటినే కల్పన లంటాం. కట్టుకథలంటాం. ప్రపంచంలోని అన్ని సాహిత్యాల్లోనూ కల్పనలున్నాయి. అసలు కల్పన లేనిది సాహిత్యమేకాదు అనే వాదనకూడా ఉన్నది. అయినా సాంఘిక జీవనంతో పోల్చినప్పుడు కల్పనల్లో అయథార్థ సంఘటనలెన్నో కనిపిస్తాయి. కాల్పనిక సాహిత్యానికి సర్వసాధారణాలైన ఈ గుణాలు కాల్పనిక ప్రహేళికలకూ అన్వయిస్తాయి.

తెలుగు కాల్పనిక పొడుపు గాథల్లో రాజులు, రాణులు, మంత్రులు, సేనాధిపతులు, వేశ్యలు, విదూషకులు, నెరజాణలు, పాములు, ప్రధాన పాత్రలు, ముఖ్యంగా స్త్రీల మేధాశక్తి ప్రశంసనీయం. "ఎందరో రాకుమారులు సాహసికులు స్త్రీలు వన్నిన శాస్త్రముల చర్చలందు పూర్వపక్షమైపోయిరి" 1 అనడం ఎంతో ఎరుకతో చెప్పిన మాట. ఈ పొడుపు కథే అందుకు నిదర్శనం.

కొడుకా కొడుకా
మొగనికి తమ్ముడా
నక్కన్న పండయ్యో
నన్నిస్త లేవయ్యో

ఓ మహారాజ్యాన్ని ఓ మహారాజు పరిపాలిస్తున్నాడు. ఆయనకు ఒక్కగానొక్క కూతురుంది. ఆ అమ్మాయి అంతఃపురంలో కూడా అరికాలు కింద పెట్టకుండా అల్లారు ముద్దుగా పెరిగింది. రాజూ రాణీ రాజకీయ వ్యవహార సముద్రంలో పూర్తిగా మునిగిపోయి, వయసు వచ్చిన కూతురు సంగతే మరచిపోయారు. రాజకుమారి వేటకూ-విహారానికీ అశ్వాన్నీ రథాన్నీ స్వయంగా అశ్వశాలాధ్యక్షుడే సిద్ధం చేసేవాడు. అప్పుడప్పుడు వేటకు అతడు కూడా వెంటవెళ్లేవాడు.

1. జానపద గేయసాహిత్యము - పు: 519.

ఓకనాడు వాళ్లిద్దరూ వేటాడుతూ పరివారానికి దూరమై ఓకొండ గుహలో చిక్కుకున్నారు. అక్కడ రాకుమారిపైకి ఓకొండ చిలువ వచ్చేసింది. దానిని నరికి ముక్కలు చేశాడు అశ్వశాలాధ్యక్షుడు. గజగజవణకిపోయిన రాకుమారి అతని బాహువుల్లో ఒదిగి సేదదీర్చుకుంది. అతడే తన భర్త అని తీర్మానం కూడా చేసుకుంది. అతడు కూడా ఆమెను పవిత్రంగా ప్రేమించాడు. రాకుమారి గర్భవతి అయ్యింది, ప్రసవించింది. అంతకు పూర్వమే తల్లిదండ్రుల ముందు ప్రేమా-పెళ్లి ప్రస్తావనతీసుకొని రావడానికి అనేక పర్యాయాలు ప్రయత్నించింది. కానీ వారు రాజకీయపు గొడవల్లో మునిగిపోయి వీటి చెవిని పెట్టలేదు. ఈ రహస్యం ఇద్దరు దాసీలకు ఆ ప్రేమికులకు తప్ప మరెవ్వరికీ తెలియదు. పదునాలుగేళ్ల రాకుమారికి పుత్రోదయమయింది. ఆ పిల్లాణ్ని అదే నగరంలో ఉన్న ఓ పూటకూళ్ల పెద్దమ్మ రహస్యంగా పెంచే ఏర్పాటు చేశారు. ఆ పెద్దమ్మకు ఆ దాసీల ద్వార సమస్త వస్తువులు పంపేవారు.

రాకుమారి పుత్రుడు శుక్లపక్ష చంద్రునిలా దినదిన ప్రవర్ధమానుడయ్యాడు. ఆ బాలుడు కంపచాటు మొక్కలా జివ్వున పైకి యెదిగి వచ్చాడు. పదహారు సంవత్సరాలు గిర్రున తిరిగి పోయాయి. అజానుబాహుడూ సమున్నత శరీరుడూ అయిన రాకుమారి పుత్రుడు చూపరుల దృష్టికి కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాడు. ఆటపాటల్లో సాముగరిడీల్లో అందరిలో అగ్రణిగా పేరుపొందాడు.

ఇన్నేళ్లు గడిచినా కూతురు బాగోగుల్ని, పెళ్లి పెడాకుల్ని గూర్చి ఆ తల్లిదండ్రులు ఆలోచించనేలేదు. అందువల్ల ఆమె ప్రణయ రహస్యం రహస్యంగానే ఉండిపోయింది. ముజ్జిడుగా ఉన్న రాజకీయ వ్యవహారాల రథాన్ని ముందుకు లాగలేక ముసలిరాజు ఓ రోజు గుటుక్కుమన్నాడు.

రాజులేని రాజ్యంలో శాంతి పూజ్యమని భావించిన మంత్రులందరూ మంత్రాలోచనంచేసి ఓ నిర్ణయానికి వచ్చారు. తమ పట్టపు భద్రకుంజరానికి పూలమాల ఇచ్చి నగరంలో విడిచిపెట్టారు. ఆ ఏనుగు ఎవరి మెడలో మాల వేస్తుందో అతని మెడలో రాజపుత్రి మాలవేస్తుంది. అతడా రాజ్యానికి రాజవుతాడు రాకుమారి ప్రమేయం లేకుండానే నిర్ణయాలు జరిగిపోతున్నాయి. భర్త మరణంతో వృద్ధరాణి నిర్ణయాన్ని మంత్రులకే వదిలివేసింది. పట్టపేనుగు నరాసరి వెళ్లి పెద్దమ్మ పెంచుతున్న రాకుమారి పుత్రుని మెడలో మాల వేసింది.

అశ్వశాలాధ్యక్షునికి రాకుమారికి కంగారెత్తింది. ఇప్పుడేమి చెప్పినా రసాభాసమే అని ఆమె ప్రియుణ్ని సముదాయించి కొడుకును పెళ్లి చేసుకొంది.

పదహారు సంవత్సరాలుగా రహస్యప్రణయ జీవన మాధుర్యాన్ని అనుభవిస్తున్న రాకుమారి ప్రప్రథమంగా శోభనం గదిలో అడుగు పెట్టింది. పిచ్చిగా నవ్వుకొంది. నిర్లజ్జగా పాన్పుమీదికి చేరింది. వెల్లకిల పడుకుంది. బెదురు బెదురుగా పయ్యెదమీద చేయివేసిన కొడుకువైపు తిరిగింది. వాత్సల్య పూర్ణ దృక్కులతో చూసింది. పుత్రహస్త స్పర్శకామె పాలిండ్లు క్షీర పూర్ణాలయ్యాయి. ఆమె తనువెల్ల మాతృప్రేమతో పరవశించింది.

ఆ పిల్లాడు తనకు కొడుకు. తాను విధివశాన వివాహ మాడింది కాబట్టి తనమగనికి తమ్ముడు, అందుకే చక్కగా పడుకొమ్మంది, చన్నిస్తా లె (ర) మ్మంది.

ఆపదహారేళ్ల బాలుడు అశ్రుసిక్తనయనుడై తల్లిపాదాలపై పడ్డాడు. ముప్పయి సంవత్సరాల ఆ తల్లి తన పాపణ్ని అన్నాళ్లకు కన్న ఒడిలోకి లాక్కొంది. ఇద్దరూ కలిసి అశ్వశాల వైపు నడిచారు.

రహస్య ప్రణయం, రహస్య ప్రసవం, రహస్య పోషణ, గజమాలాధారణ, మాతాపుత్ర వివాహం, ప్రహేళికా ప్రహసనం అనే అత్యద్భుత సన్నివేశాల్ని, అతిలోక కల్పనా సౌందర్యంతో జగం మెచ్చి తల ఊచే విధంగా సృష్టించాడు జానపదుడు. అతని మనస్సు కేవలం అద్భుతాల నల్లడమేకాదు హృదయాను భూతుల్ని కూడా చాక్యంగా వ్యక్తీకరిస్తుంది. అంతేగాక నిత్య జీవితంలో తాను పాటించే నియమాల్ని కథలుగా అల్లి ప్రాచీనుల కంటగడుతుంది. అలాంటి కట్టు కథే ఈ క్రింది పొడుపుగాథ.

"అంతన్న వచ్చి కొంత మేసిందు"
"అంతనా ! కొంతనా !"
"గంపె సూత్రమంతా వెంటనే"
"ముత్యాల పాన్పు కింద
వరాల పరాయి కింద ఉన్నది
దాన్ని కాల బెట్టి
ఖరీదు చేసుకురా!"

ఓ రాజుగారు బ్రహ్మచారి, పొదుపరి. కూర-నార, పప్పు-ఉప్పు విషయంలో కూడా వంటవానికి రోజు సాదర రోజు ఇస్తుంటాడు. ఆ తర్వాత సభకు వస్తాడు వంటవాడు మధ్యాహ్నం వరకు వంటపని పూర్తిచేసి రాజుకొరకు ఎదురు చూస్తుంటాడు. ఒకనాడు వంటమనిషి అజాగ్రత్తగ ఉండడంతో అన్నం కుక్క తినిపోయింది. రాజు వచ్చేవరకు మళ్లీ వంట చేయాలి. కాని ఇంట్లో వంటచెరకూ లేదు, వంట సరకూలేదు. ఏంచేయాలన్నా రాజుగారిని అడగాలి. అందుకే సభకు వచ్చాడు. అందరిలో చెప్పేదెలా! మాటలో మర్మాన్ని ప్రవేశపెట్టాడు.

"అంతన్న వచ్చి కొంతమేసిం" దనగానే కుక్కముట్టిందని రాజు గ్రహించాడు. వంటవాడేమో కొంతనే అన్నాడు. అనగా ఇంకా కొంత ఉండాలి. ఆకొంతతోనే ఈపూటకు సరిపుచ్చుకోవాలి. సర్వప్రాణుల్లో పరమాత్ముడున్నాడు. కుక్క ఎంగిలి అంటే పరమాత్ముని ఎంగిలే. ఎంగిలికి తప్పేంలేదు. అందుకే వెంటనే "అంతనా! కొంతనా!" అని అడిగాడు.

నిజానికి కుక్కతిన్నది కొంతనే, కాని కొంత కాదు అంతా అని చెప్పి తాను తినాలనుకున్నాడు వంటవాడు. అందుకే "గంటె సూత్రము అంత వెంటనే" అని ఒట్టు తిన్నాడు. బ్రాహ్మణుడు సూత్రంపట్టి ఒట్టు తింటాడు. వంటవాడు గంటెనే సూత్రంగా భావించి ఒట్టు తిన్నాడు.

రాజుకు కోపం వచ్చింది. తన సంపాదనలో మిగిలిన ఒకే ఒక్క వరహా పాన్పుక్రింద ఉంది. అది కాలబెట్టి సాదర కొనుక్కురా అన్నాడు. ఏదైనా వస్తువు అమ్మాల్సిన పరిస్థితి యేర్పడితే విసుగూ కోపమూ ధ్వనించే విధంగా కాల బెట్టి అనే పదప్రయోగం చేస్తారు. వంటలవాడు అర్థం చేసుకొని వచ్చిన దారి పట్టాడు.

ఈ కథలో రాజుకెంత ఉన్నా తన సంపాదనపైన్నే బతుకుతున్నవాడు. అలా అందరూ బతకాలని సందేశం. గొంగడున్నంత కాళ్లు వారజాపుకోవాలి గదా! అది జానపదుని భావనేకాదు అందరి భావన. ఇష్టం వచ్చిన విధంగా ఖర్చు పెట్టి బ్రతుకు భారం చేసుకోడం నబబుకాదు. అయితే బ్రతుకు బరువవడానికి ఈ ఒక్క కారణమే ఉంటుందనలేం. ఇంకా ఎన్నో ఉంటాయి. అందుకే ఆ అర్థాన్ని బలపరచే పొదుపు కథ పుట్టింది.

"పదిచ్చి తెచ్చుకొంటి
ఇరవై ఇచ్చి సేపిచ్చుకొంటి
ఎదల మెరిసె
మనసుల తిరిగె - ఏంది?"

ఓ యువతికి కొంత వయసు మీరిన తర్వాత వివాహమయ్యింది. ఆమెకదివరకే ఓపాముతో సంబంధముంది. భర్తతో సాంసారిక జీవనం అమెకు నరక ప్రాయమయింది. ఒకరోజు పామూ, భర్త ఒకే సమయంలో వచ్చారు. భర్త పీడ ఎలా విరగడవుతుందా అని ఆమె ఆలోచించింది. తలనొప్పి తీవ్రంగా ఉన్నట్లు నటించింది. ఆ నొప్పి పోవాలంటే ఊరవతలి పుట్టమీది మన్నే కావాలి అంది. ఆ మట్టిని మించిన మందు లేనేలేదంది.

ఆమె భర్త ఊరవతలి పుట్టదగ్గరకు వెళ్లాడు. బుసలు కొడుతూ పైకి వచ్చే పామును చూశాడు. తన చేతిపారతో పామును ముక్కలు ముక్కలు చేశాడు. మన్ను తీసుకొని ఇంటికి వచ్చి భార్య ఫాల తలంమీద పూశాడు. గట్టి పట్టీ వేశాడు. ఈ పరిచర్యలు చేస్తూనే కరవడానికి వచ్చిన పామును ముక్కలుగా నరికిన విషయం చెప్పాడు.

ఆమె వెంటనే పెడమొగమై పడుకొంది. చాలా సేపు చింతించింది. దాసీని పిలిచి పది రూపాయలిచ్చి ఆ పాము ముక్కలు తెప్పించింది; ఉట్టిమీది గురిగిలో పెట్టింది. మరునటి రోజు చూసేవరకు ఆ గురిగిలో బంగారు ముక్కలున్నాయి. అవుసలిని పిలిపించి అతనికి ఇరవై రూపాయలిచ్చి ఆ ముక్కలతో సొమ్ములు చేయించి ఎదమీద వేసుకొని మెరిపించింది. అయినా ఇంకా ఆమెకేదో వెలితిగా ఉంది, భర్తమీద మహా క్రోధముంది. పాము చనిపోయినప్పటినుండి ఆమె జీవితంలో ఏదో పోగొట్టుకున్నట్టు భావిస్తోంది. అందుకు కారకుడైన భర్తమీద ప్రతీకారం తీర్చుకోవాలని ఆలోచిస్తోంది.

ఒకనాటి రాత్రి భర్తముందు ఈ సమస్యను తెచ్చిపెట్టింది. అది విప్పి చెప్పితే తన తలను, విప్పి చెప్పకపోతే అతని తలను పందెముగ కాసింది. ఇంత చిన్నవిషయానికి ఇంత పెద్ద పందెం. భర్త ఆశ్చర్యంతో తల మున్కలయ్యాడు. అయినా ఆమె సవాలు స్వీకరించాడు. దేశదేశాలు తిరిగాడు. సమస్యముడివిప్పే వారు కనిపించలేదు.

తిరిగి తిరిగి అతడు తన చెల్లెలు ఇంటికి వెళ్లాడు. చింతతో వంతతో కుమిలి పోతోన్న అన్నను చెల్లెలు చూసింది. ఆతిథ్యమిచ్చి సమయం సందర్భం చూసి సంగతేంటని అడిగింది. అన్న చెల్లెలికంతా చెప్పాడు.

ఆమెకు ఇంతకుపూర్వమే వదినకూ పాముకూ ఉన్న సంబంధం గూర్చి తెలుసు. ఆయింటి దాసీ వల్ల జరిగిన కథంతా అంతకు పూర్వమే తెలుసుకొంది. అన్నను ఓదార్చింది. వదినవేసిన సమస్య ముడివిప్పింది. అతడానందంతో ఇంటికి వచ్చాడు. ఎవరికి పది ఇచ్చిందో, ఏది తెప్పించుకుందో, ఎవరికి ఇరవై ఇచ్చిందో, ఏం చేయించుకొని ఎక్కడ మెరిపించిందో అంతా సవివరంగా చెప్పేశాడు, శాస్త్రమర్మం విప్పేశాడు.

తన రహస్యం బట్టబయలయింది. భరించలేని అవమానంతో, మాటకు కట్టువడే స్వాభిమానంతో వెంటనే తలగొట్టుకుంది,

పొడుపుగాథల్లోని పొలతులందరూ మనసున్నవారు, మాట తప్పనివారు, మరణమన్నా వెరువనివారు, మచ్చవచ్చినా జంకనివారు, మచ్చరాకుండగనే మెలిగేవారు. మచ్చరాకుండా నిష్కల్మషంగా నిలిచిపోయిన, దివ్యంగా వెలిగిపోయిన మరో మగువ కథ ఈ క్రింది పొడుపుగాథ.

"అన్నా ! పిండోలె ఎన్నెల<br>
అచ్చం ఎన్నెల ముద్దుగున్నది"<br>
"అచ్చం ఎన్నెలే గాని<br>
అచ్చానికో మచ్చపుట్టెగా చెల్లెలా"<br>
"అచ్చానికో మచ్చపుట్టే<br>
నచ్చినా నీ యిల్లు సొచ్చపోదు గదా అన్నా !

.... .... ....

"ఒంటికాలి పబ్బతి పట్ట ధర్మమగునా"<br>
"వంటసేను పదాట్ల కల్వ నీకు నాయమగునా"<br>
"సేనుకో పులాస వద్దది గదా"<br>
"సేనుకు పులికి సెల్లెలొరున గదా"

ప్రజ్ఞాపాటవాలున్న ప్రధానమంత్రి అండదండలుండగా ఓ మహారాజు నిశ్చింతగా రాజ్యపాలన చేస్తున్నాడు. ప్రధాని మాటకూ చేతకూ ఆ రాజ్యంలో విలువ ఉంది. అతని భార్య ఎంతో తెలివిగలదనే ప్రచారం ఉంది. పైగా అందగత్తె అనికూడా అందరికీ తెలిసిపోయింది.

ఓనాడు రాజు ఉద్యానవనవిహారం చేస్తూ తన పెంపుడు పైడికంటెతో ముచ్చటించాడు. ఈ రాజ్యంలో అందరిని మించిన అతివ ఎవ్వరన్నాడు. ఆ పైడికంటె ప్రధానమంత్రి భార్య అని సమాధానమిచ్చింది. ఆ రోజునుండి రాజు మంత్రి భార్యను పొందడానికి యేమేం చేయాలా అని ఆలోచిస్తున్నాడు. మంత్రి రాజుగారి మనస్సులోని ఈ విషయాన్ని పసిగట్టాడు. ఈ దురాలోచనను నిరోధించే మార్గాల్ని అన్వేషిస్తున్నాడు.

ఆనాడు, రాజు మంత్రి ఇంటికి వెళ్ళాడు. మంత్రి అతణ్ని ఆదరించి మర్యాదలు చేశాడు. గృహాంతర్భాగంలోని మూడుగదులకు తాళాలు వేశాడు. భార్యను ఆ మూడుగదుల వెనుక ఉంచాడు. భోజనానంతరం మూడువిడియాలు తెచ్చి అక్కడ పెట్టి లోనికి వెళ్ళాడు.

అప్పుడు మంత్రిభార్య పెంచుకున్న పైడికంటె రాజు దగ్గరకి వచ్చింది. "రాజుకు ప్రధాని భార్య చెల్లెలౌరుసగద" అని అది యెగిరిపోయింది. రాజు కోపంతో విడెం విసరికొట్టి అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు. రాజు కోపాన్ని గమనించిన ప్రధాని ఇక అక్కడ ఉండకూడదనుకున్నాడు. కామం యుక్తాయుక్త వివేచనా జ్ఞానాన్ని దూరం చేస్తుందని, కొన్నాళ్లపాటు తాను దూరంగా ఉండాలని ఆలోచించి ఓ కొండగుహలో దాక్కున్నాడు. భార్యకు మాత్రం తన మనసులోని మాట చెప్పక తన దూరపు బంధువు వివాహానికి పోతున్నానని చెప్పాడు.

మంత్రి వెళ్ళిపోయిన విషయం రాజుకు తెలిసింది. తనకు మార్గం మరీ సులభమయిందనుకున్నాడు. ఆ రోజు రాత్రే మంత్రి భార్యను పిలిపించాడు. సౌధోపరిభాగంలో పిండారబోసినట్లున్న వెన్నెల్లో మంచాలు వేయించాడు. మంత్రి భార్య చక్కగా అలంకరించుకొని రాజు దగ్గరకు వచ్చింది. ఆమెకు చాలాకాలంగా రాజు తనకు అన్న అని తెలుసు. రాజుతల్లి, ఆమె తల్లి అక్కచెల్లెండ్రు, ఒకే తల్లిపిల్లలు. ఆమె తల్లి పొరుగురాజ్యపు భార్య. ఒకనాడు మహా

రణ్యమధ్యంలో తల్లిదండ్రులతో పాటు ఆమె కూడా ప్రయాణం చేస్తున్నది. ఓ సింహం తల్లిదండ్రులను పొట్టన పెట్టుకుంది. ఆమె ఓ గుంతలో పడడంతో సింహం బారినుండి తప్పించుకోగల్గింది. వేటకు వచ్చిన ఈ దేశపుమంత్రి రక్షించాడు. ఆ తర్వాత ఆమె వివాహం అతనితోనే జరిగింది. ఆమె భర్తకు కూడా, రాజు తన అన్న అవుతాడన్న సంగతి ఇంతవరకు చెప్పలేదు. తల్లి దండ్రులతోబాటు ఆమె కూడా సింహం బారినబడి చనిపోయిందని లోకం చెప్పు కొంటోంది. దుఃఖాన్ని దిగమింగుకొని తానెవరైంది ఇంతకాలమెవరికీ ఆమె చెప్పనేలేదు. రాజుకన్ను ఆమెపై పడిందని భర్త ఆమెతో సూచనామాత్రంగా అన్నాడు. ఆమె ఆలస్యం చేయకుండా పెంచుకుంటున్న పైడికంటెకు చెప్పా ల్సిన సంగతి చెప్పివంపించింది. రాజు దగ్గరికి వచ్చిన వెంటనే నమస్కరిం చింది. ఈ విషయమంతా పూసగ్రుచ్చినట్లు చెప్పింది.

రాజు తన ధర్మభ్రష్టత్వానికి పరిపరివిధాలా చింతించాడు. నోట మాట రావడంలేదు. మంచానికి అంటిపెట్టుకొని తనలో తానే కుళ్ళిపోతున్నాడు. అన్న ఆవేదనను గమనించింది చెల్లెలు. అతనితో మాటాడి ఆ విషయం మరిచిపోయేట్లు చేయాలనుకొంది. అందుకే ఇలా అంది.

"అన్నా! పిండివలె వెన్నెల, ఎంతో స్వచ్ఛమైన వెన్నెల, ఆహా ముద్దు గున్నది." "స్వచ్ఛమైన ఈ వెన్నెలకు మచ్చ వచ్చింది గదా చెల్లెలా" అన్నాడు రాజు. "ఈ స్వచ్ఛత్వానికే మచ్చవస్తే చచ్చినా నీ యింటిలో ప్రవేశించేదాన్ని కాదుగదా అన్నా!" అన్నది మంత్రిభార్య.

కనలిపోయిన రాజు ఈ మాటలతో కదిలిపోయాడు. చెల్లెలి ముందు మోకరిల్లి అక్కణ్ణుంచి వచ్చేశాడు. ఆ మరునటిరోజే మంత్రి ఎక్కడఉన్నాడో తెలుసుకున్నాడు. వెంటనే అతని దగ్గరకువెళ్ళి ఒంటికాలిమీద నిలబడి చేతు లెత్తి దండం పెట్టాడు.

"ఒంటికాలి పబ్బతిపట్ట ధర్మమగునా" అన్నాడు మంత్రి. "పంటసేను పదాట్ల కల్ప నీకు నాయమగునా" అన్నాడు రాజు. "సేనుకో పులాన పడ్డదిగదా" అన్నాడు మంత్రి. "సేనుకు పులికి సెల్లెలొరునగదా" అన్నాడురాజు.

గుహలో కూచున్నమంత్రి వెంటనే లేచివచ్చి రాజును కౌగిలించుకున్నాడు.

జానపదుని ఆలోచనా ధోరణి, కథను పొదిగిన సంవిధాన నైపుణి అపూర్వంగా కనిపిస్తుంది. పదిపాదాల పొడుపువెనుక ఇంతకథ నిక్షిప్తమై ఉంది. పూర్వాపరాలు కలిపినప్పుడే ఈ మాటల్లోని ముళ్ళు విచ్చుకుంటాయి. అప్పుడది కథాత్మక ప్రహేళికగా భాసిస్తుంది. ఆ కథాత్మక ప్రహేళికే పొడుపుగాథ.

ఇక చివరగా, జానపదులు గుప్పించిన అలంకారాలతో పరిశోభితమైన ఒక పొడుపుగాథను పరిశీలించి ఈ వ్యాసానికి ముగింపు పలుకుదాం.

"జలజల ముత్యమురాయే
జల ముత్యమురాయే,
పూసిన తంగెడు రాయే
బూదేవి రాయే
కాసిన తంగెడు రాయే
కామాచ్చి రాయే
గన్నేర్ల మోతకు
మావారు మేతవట్టక ఉన్నారు,
మేతవట్టి ఇత్తురాయే
లేత మామిడికొమ్మ,"
"వెనుక సెవులు, వెల్లాయివళ్ళు
రాతిలో మెదడు రాయిపూరుచెక్క
ఇంటివెనుక తంగేడు పూసినపుడు
పట్నం పాడైనపుడు
వస్తిపోయే హన్మాండ్లగుడికి"

ఓ రాజుగారు ఓనాటి సంధ్యాసమయంలో చల్లని పిల్లగాలిని పీలుస్తూ ఆంజనేయస్వామి మందిరం అరుగుమీద కూచున్నారు. ఆదారి వెంబడి ఆ నగరంలో పేరుమోసిన కాపుకోడండ్రయిదుగురు అదే సమయంలో నీలాటిరేవుకు పోతున్నారు. అందులో అందరికన్న చిన్నది అందగత్తె-హంసగమన. ఆ చిన్న దానిమీద రాజు మనసుపడ్డాడు. వెనుకబడ్డ వెలదిని దగ్గరకు పిలిచాడు.

"ఓ చిన్నదానా! అంతలేసికొప్పును తలకోసి (తలకుపోసి) ముడిచావా! తలకోయక (తలకుపోయక) ముడిచావా!" అడిగాడు రాజు.

ఆ చిన్నది రాజు మనసు గుర్తించింది. ఈ లోకంలో కూచున్న చోటికే బువ్వ రావాలని కోరుకునే వారెందరున్నారో కదా అనుకుంది. అందుకే రాజుతో ఇలా అంది.

"రాజా! రాజా! హనుమాన్ గుడి అరుగుమీద నీయంత నీవు కూసున్నావా! లేక నిన్నెవ్వరన్నా కట్టేసింప్రా :" అంతే ఇక ఒక్క క్షణం కూడా అక్కడ నిలువకుండా అక్కల్లో కలిసిపోయింది.

రాజు చింతాక్రాంతుడై రాత్రివరకు అక్కడే కూచున్నాడు. రాజుగారి నర్మసచివుడు రాణికీవార్త చేరవేశాడు. రాణి హుటాహుటిన పయనమై రాజు దగ్గరకు వచ్చింది. రాజు భార్యకు మనస్సులోని మాట చెప్పాడు. ఓ అదెంత పాటిలే! నేను సంధానకర్తనవుతానని భర్తను గృహోన్ముఖుణ్ని చేసింది రాణి. మరునాడు కాపు ఇంటికి వెళ్ళింది.

కాపుకోడంద్రు ఆమెను సాదరంగా ఆహ్వానించి సపర్యలుచేసి పప్పు దంచడంలో మునిగిపోయారు. అప్పుడు రాణి "జలజల ముత్యమురాయే........లేత మామిడికొమ్మ" అంది. ఆమె పిలుపులోని అర్థాన్ని చిన్నది గ్రహించింది. అన్ని రూపకాలతో తన రూపాన్ని ప్రశంసించిన రాణి సౌందర్య హృదయానికి మురిసిపోయింది. వెంటనే ఇలా అన్నది.

"వెనుకచెవులు = తమలపాకులు
వెల్లాయిపళ్ళు = పోకలు
రాతిలోమెదడు = సున్నం
రాయిపూరుచెక్క = కాచు
ఇంటివెనుక తంగెడు పూసినపుడు = వెన్నెల కాచినపుడు
పట్నం పాడైనపుడు = అందరు నిద్రించిన తర్వాత
వస్తిపోయె హన్మాండ్ల గుడికి"

పప్పుదంచుతూ, దర్వుమీద దర్వువేస్తూ, సుప్తి పదాన్ని ఆలాపిస్తూ పై పాట పాడింది చిన్నది. సమయాన్ని చెప్పి సంభారాల్ని కూడా సమకూర్చమంటున్న చిన్నదాని జాణతనానికి, రసిక హృదయానికి రాణి అలరించి, సెలవు తీసుకుంది, రాజుకు చెప్పింది, రాత్రికి స్వాగతం పలికింది.

జానపద హృదయసాగరాన్ని మథిస్తే పొడుపు గాథల రత్నాలు కోకొల్లలుగా బయటపడతాయి. ఆ రత్నాల్లో మొదట మొదట కొంత వైవిధ్యం కనిపించినా రానురాను అన్నీ ఒక్కమూసనుండే సిద్ధం చేసినట్లనిపిస్తాయి. వైదిక వాఙ్మయంలో నిగూఢంగా అంతర్భూతమై ఉన్న ప్రశ్నోత్తర ప్రాయమైన విజ్ఞానం, పౌరాణిక సాహిత్యంలో కథా కథనాత్మకమై విపులంగా పెరిగి ప్రబంధవాఙ్మయంలో హద్దుల్ని దాటింది. ఆయాకాలాల్లో ఆయా సందర్భాల్లో కవులు రచించిన కొన్ని శ్లోకాలుకూడా కథను దృష్టిలో ఉంచుకొనే కూర్చినవిగా అనిపిస్తాయి. ఆ సంప్రదాయాన్ని అనుసరించి, లోకవృత్తాన్ని గ్రహించి పండిత ప్రోక్తమైన కథాంశ బీజభూతాలైన పద్యాలు కొన్ని పొడుపుగాథలకు మూలాధారాలయ్యాయి. తెలుగు పొడుపుకథల్లో వేటినీ అనుసరించనివీ, వేటినీ అనుకరించనివీ అధికంగా ఉన్నాయి. కనుకనే శిష్టజన వ్యవహృతాలైన పొడుపుకథలు స్వల్పంగా, జానపదుల వ్యవహృతాలు అత్యధికంగా లభిస్తున్నాయి.

ఈ పొడుపుగాథల్లో జానపదులు ప్రయోగించిన నిసర్గ రమణీయాలైన అలంకారాలు గమనార్హాం. వీటిల్లో ఎక్కడ వ్యర్థపదమనేది కనిపించదు. ఇవన్నీ కవితాశిల్పాన్ని పుణికి పుచ్చుకున్నాయి. ప్రతి కథలోని వక్రోక్తులు వ్యంగ్యవైభవంలో విరాజిల్లుతున్నాయి. అనేక కావ్యకళా రహస్యాల్ని రంగరించుకొన్న పొడుపు గాథలన్నీ రుచికి పాలమీగడలు, శుచికి వెన్నెలలు, సువాసనకు దిరిసెనలు, మృదుత్వానికి దూదులు-వెన్నముద్దలు.



# పొడుపు పద్యాలు

"దీని భావమేమి తిరుమలేశ" అని ఏడుకొండలవాణ్ని కవి ప్రశ్నించాడు. ఎందుకీ ప్రశ్న! కవికి తెలియదా! లేకపోతే ఆ పరమాత్మున్నే పరీక్షిద్దామనా! ఈ రెండూకావు. మనిషి కూసేది, రాసేది మనిషికొరకే. ప్రశ్న అడిగేది కూడా మనిషినే. అయితే సమాధానం ఒక్కోసారి మనిష బుద్ధి కందదు. మనిషి బుద్ధి కందనిది మనిషి బుద్ధి కందుతుంది. ఆ మనిషి మనుషుల్లో ప్రత్యేకార్హత పొందు తుంటాడు. ఆ అర్హతే అతనినోట సమాధానం పలికిస్తుంది, సమస్యను పరిష్కరిస్తుంది. మరి అలాంటి మనిషిని మనిషి అన్నా మాధవుడన్నా ఒక్కటే.

ఆ కారణాన్నే "దీని భావమేమి తిరుమలేశ" అనే పద్యాలు వెంకట రమణున్ని అడిగినవైనా మనిషిని అడిగినవిగానే భావించాలి. ఈ తిరుమలేశ పద్యాలే పొడుపు పద్యాలు. కేవలం ఇవే కాకుండా ఈ గుణాలున్న అన్ని పద్యాల్ని పొడుపు పద్యాలనే పిలుస్తారు.

తెలుగు కావ్యాల్లో అక్కడక్కడ ప్రహేళికల ఛాయలున్న పద్యాలు కనిపిస్తున్నాయి. అలంకారాల్లో చిత్రోత్తర (గూఢోత్తర) అచ్చంగా పొడుపు కథే. చిత్రోత్తరాలంకారమున్న ప్రతి పద్యం పొడుపు పద్యమే. సూక్ష్మాలంకారం సమాసోక్తి, గూఢోక్తి, వక్రోక్తి, శ్లేష తదితర అలంకారాల్లో పొడుపుకథల ఛాయలు కనిపిస్తాయి. కావ్యాల్లో ఈ అలంకారాలు కనిపించేచోట ప్రహేళిక ఛాయలుండడమో లేదా ప్రహేళికాభాసముండడమో జరుగుతుంది.

కావ్యాల్లోనే కాకుండా సాధారణ శతకాల్లోనూ పొడుపు పద్యాలున్నాయి. వేమన శతకంలో పదికి పైగానే ఈ పద్యాలు కనిపిస్తున్నాయి.

పడతి మోసెనొకడు, పడతి మేసెనొకడు
పడతి నెదనుబెట్టి బ్రతికెనొకడు
పడతికొరకు నిట్లు పలుపాట్లు పడిరయా
విశ్వదాభిరామ వినురవేమ!
స్త్రీ నెత్తిన రుద్రునకును
స్త్రీ నోటను బ్రహ్మకెపుడు సిరిగుల్కంగా

శ్రీ నెదిరె రొమ్మునహరికి
శ్రీ నెడపగ సురుడవీవు దేవరవేమా !

మొదటి పద్యంలోని పొడుపులకు రెండో పద్యంలో విడుపులున్నాయి. శివుడు గంగను కొసాడు, బ్రహ్మ వాణిని మోశాడు. విష్ణువు లక్ష్మిని ఎదపై ఉంచాడు.

ఆలి నొల్లక యున్న వానమ్మ మగని
నందులోపల నున్న వానక్క మగని
నమ్మినాతనిఁ జెఱుచు దానమ్మ సవతి
సిరులు మీకిచ్చు నెప్పట్లఁ గరుణలోడ.

ఆలినొల్లనివాడు భీష్ముడు, భీష్ముని అమ్మ గంగ, గంగభర్త సముద్రుడు, సముద్రంలో ఉన్నవాడు మైనాకుడు, మైనాకుని అక్క పార్వతి, పార్వతి మగడు శివుడు, శివుని నమ్మినవాడు రావణుడు, రావణుని చెరచినది సీతాదేవి, సీతాదేవి తల్లి భూమి. భూమి సవతి లక్ష్మి, ఆ లక్ష్మీదేవి మీకు సంపదలిచ్చుగాక !

ఈ విధంగా పురాణగాథలెన్నో పొడుపు పద్యాల్లో గుది గ్రుచ్చబడ్డాయి. పాపిసెట్టి సీతారామకవి[1] రాసిన ఈ క్రింది 34 పద్యాలలో (కవిపేరున్న పద్యం తప్ప) అన్నీ పురాణగాథల్ని స్మరించేవే. భారతీయ సాహితీ సాంస్కృతిక సాంప్రదాయాల్ని కళ్ళముందు బొమ్మ గట్టించేవే.

1. శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు ఈ పద్యాలను సేకరించారు. పార్థివ సం॥ర కార్తీక శు॥ ౧ నాడు, పాలమూరు జిల్లాలోని నాగర్‌కర్నూల్లో ఒక ఇంటి ముందు లభించిన చీచు ప్రతిలో ఇవి ఉన్నాయి. వారి మామ శ్రీ అమరం బాచు పెద్దలక్ష్మయ్యగారు ఈ పద్యాల్ని సవరించి లుప్త భాగాల్ని పూరించారు.

1. గణేశునకు దండము

[n]పార్వతీ రమణుడే పడతిని తలనుంచె (గంగను)
పరమయోగులు గట్టు పట్టెయేది (ఏణేయం)
విద్యావిహీనుని విజ్ఞులేమందురు (పశువు)
వేల్పులందున తొలివేలుపెవరు (జనని)
జూదమందున ధర్మసుతు నెవ్వడోడించె (శకుని)
చంద్రజూటుకు సాక్షి చతుర ఎవరు (గేదంగి)
బాలకృష్ణుం డాడు భంగిమ పేరేమి (తాండవం)
శూలిచూపుల చేత నోలెనెవడు (కాముడు)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమిమాత్రలు జూచిన నయముగాను
నలరు గణనాథునకు మేము ననుదినంబు
వందనము జేసెదము లోక వంద్యముగ

2. శారద - లక్ష్మి - పార్వతి

పార్వతీ రమణుని పట్టణం బెక్కడ (ఈశాన్యం)
పరమేష్ఠి సతిపేరు పలుకుటేమి (శారద)
ఖడ్గంబునకు వాడి గలిగి ఏమిట నిలుచు (పదను)
కాంతల ముఖమందు గలుగుటేమి (తిలకం)
వక్షమందున నేమి వైకుంఠు డునిచెను (లక్ష్మిని)
వసుమతీశుల యొద్ద వ్రాతకెవరు (వ్యాపార్లు)
కాంతలలో మేలు గణుతింప నెవ్వతె (ఊర్వశి)
పరమాత్ము డేమిట పడతిజేసె (రాతిని)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నయముగాను
శారదా లక్ష్మి పార్వతి శాశ్వితముగ
మనల కరుణావిధేయుడై మనచుచుండు

---

n ఈ పద్యాల్లో లాక్షణికులకు కనిపించే దోషాలు లభ్య ప్రతిలోనివే. వాటిని కావాలనే సవరించలేదు.

3. బ్రహ్మ - విష్ణు - మహేశ్వరులు

| | |
|---|---|
| భూతనాథుని సతి భూషణం బేమిటి | (తాంబ్రమము) |
| భువిలోన నెవ్వరు పూజనీయులు | (బ్రాహ్మలు) |
| ఏ నామస్మరణచే నేగె ఖట్వాంగుడు | (గోవిందా) |
| ఎగసి తృణావర్తు నెవడు గూల్చె | (కృష్ణుడు) |
| జనకు కూతురు సీత జన్మించు టెక్కడ | (కమలం) |
| గేటి రాజనందిని గిత్తయేది | (సింహేంద్రం) |
| నరుని కాయము తీరు పరికింప నెట్టిది | (నశ్వరం) |
| పుడమిలో నూతులు పూడు టెట్లు | (ఊర్లుట) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నయముగాను
నలరు ముమ్మూర్తులెప్పుడు ననుదినంబు
మనల కరుణా విధేయులై మనుచుచుండ్రు.

4. వ్యాస - వాల్మీక కాళిదాసులు

| | |
|---|---|
| వసుధలో సురలకు వైరియు నెవ్వడు | (క్రవ్యాత్తు) |
| దశరథ విభుకగ్రదార ఎవతి | (కౌసల్య) |
| శంభుని రాణిని జనులు ఏమందురు | (భవాని) |
| పాములుండెడి తావు నామమేమి | (వల్మీకం) |
| అతివల ముంజేతి కందమేమైయుండు | (కంకణం) |
| గౌతమ సతితోడ గలిసె నెవడు | (పాకారి) |
| కృష్ణుడెవ్వరి తల గినిసి నాట్యము జేసె | (కాళింగు) |
| స్వామిరాజు ఏమిచ్చి సూత పడియె | (గోదానం) |
| ఉదధి గట్టెడి వేళ యుడుత తానేమిచ్చె | (ఉసుక) |
| రమణుల కీయగ దానిదేది | (అలుసు) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు/నడిమి మాత్రలు జూచిన నయముగాను వ్యాసవాల్మీకులును కాళిదాసు లెపుడు/మనలకరుణా విధేయులై మనుచుచుండ్రు.

## 5. శ్రీ కాశీ విశ్వనాథుడు

ఖల్లాణరాయుడు పశుపతి కేమిచ్చె (న్వశ్రీని)
పర్వతంబుల నొంచు ప్రబలుడెవరు (పాకారి)
వన్నెకు ప్రియమైన వస్తువు పేరేమి (పసిడి)
వనచరుడెవ్వని వలన బుట్టె (రవికి)
పుట్టులబ్బలవాని పొనగవాహన మేమి (అశ్వము)
పూతన విషమునే పొంతననిచె (స్తనాల్లో)
పక్షంబు లోపల పదునైదు ఏముండు (తిథులు)
హరియెట్టి రూపమై యడిగెబలిని (వడుగు)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరునట్టి
కాశీ విశ్వేశ్వరుం డెప్డు కరుణతోడ
మనల కరుణా విధేయుడై మనుచుచుండు

## 6. రామేశ్వరుడు రక్షించు

వనజ సంభవునకు వాహనం బేమిటి (మరాళం)
కలకంఠు డేమిచ్చె కాంతకొఱకు (సామేను)
రిక్కలలో తొల్త లెక్కింత్రు దేనిని (అశ్విని)
కాంతల యురమందు గలుగుటేమి (సరులు)
కమలనాభునకును కందర్పుడేమగు (కొడుకు)
గగనమండల మందు గలుగు నేవి (తారలు)
కంస మర్దనునకు ఘనవాహనం బేమి (పక్షీంద్రం)
కలికి కుచంబుల గప్పునేది (కంచుకం)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నయముగాను
అలరు రామేశ్వరుండును నహరహంబు
మనల కరుణా విధేయుడై మనుచుచుండు

7. కంచి వరదరాజులు

పొలతులు చేపట్టి నలరు జూపెయ్యది (మాకందం)
పసిబాలపోరు పీఱంగి మాను (చూచిన)
కలువల చెలికాని కడభార్య పేరేమి (రేవతి)
కమల గర్భునకును కాంతయెవరు (భారతి)
క్రైక బుద్ధి జెఱచు కాంత నామంబేమి (మందర)
గౌరీశునకు మారు పేరునేది (పురారి)
బాలుర క్రేపుల బరగ దాదెనెవండు (అజుడు)
రైవత సుతకును రమణుడెవరు (బలుడు)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
కంచి వరదుడు పాలించు ఘనతతోడు
మనల కరుణా విధేయుడై మనుచుచుండు.

8. కాళహస్తి రామలింగ

పరగ పూజకు దెచ్చు ఫలము నేమందురు (టెంకాయ)
పశుపతి విషమెందు పరగ నిల్పె (గళము)
సూచనల్ దెలిపెటి సుషిర వాద్యంబేమి (కాహళం)
సింహంబు దేనిని చెలగి తినును (హస్తిని)
సోమశేఖరు మేన పాములేమైయుండు (హారాలు)
సోముని కాకకు సమయునేది (కమలం)
శ్రీ చెన్నకృష్ణుడు స్త్రీలనెట్టుల గూడె (లాలించి)
సీతకే మొసగెను కోతి యపుడు (ఉంగరం)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
కాళహస్తిని వెలసిన ఘనుడు నెపుడు
మనలకరుణా విధేయుడై మనుచుచుండు.

## 9. తిర్మల వేంకట్రమణ

| | |
|---|---|
| పొంచుండి రాముడు త్రుంచెను దేనిని | (కోతిని) |
| శంభుడు గప్పిన శాలువేది | (చర్మము) |
| పూతన యైవచ్చి పొలియించె నెవ్వరి | (బాలల) |
| పెద్దరాతికి మారు పేరు నేది | (గ్రావేంద్రం) |
| చందురుడేతీరు ముందుగా గనిపించు | (వంకర) |
| జలజాక్షు చక్రమే చలువనుండు | (వట్రము) |
| ఫాలాక్షు తనయుని పక్షి వాహనమేది | (నెమలి) |
| హరి యేమియై పురాలవని గూల్చె | (బాణమై) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరునట్టి
తిరుమలేశుండు నెప్పుడు స్థిరముతోడ
మనలకరుణా విధేయుడై మనుచుచుండు.

## 10. శ్రీరంగనాయక స్వామి

| | |
|---|---|
| పద్మనాభుని ప్రక్కబాయని దెవ్వరు | (శ్రీలక్ష్మి) |
| పంక్తి ముఖుండేపె బలిమిగూడె | (రంభను) |
| భాగీరథుండేమి పాటించితెచ్చెను | (గంగను) |
| భావజ జనకుని పాను పేది | (నాగము) |
| గృహరాజ సూనుని ఘనమైన పేరేమి | (యముడు) |
| మహిలోన భూపతి మన్ననేమి | (కరుణ) |
| ముత్యమే కార్తిలో ముందు జన్మించును | (స్వాతిని) |
| సోమకు నేమియై స్వామి దునిమె | (మీనమై) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
ఆదివంక్తిని జూచిన యలరుచుండు
నట్టి శ్రీరంగ నాయకు డనుదినంబు
మనల కరుణా విధేయుడై మనుచుచుండు.

## 11. భద్రాచల రామస్వామి

| | |
|---|---|
| ఇంద్ర తనూజుని ఇంతి నామంబేమి | (సుభద్ర) |
| ఇందు శేఖరు హారమందునేమి | (రుద్రాక్ష) |
| గోపాల కృష్ణుండు గోట నెత్తినదేమి | (అచలం) |
| కొడుకును బొంచి తాగూడు టేమి | (స్త్రీలను) |
| పాండు పుత్రుల కెప్డు పగ గోరునెవ్వడు | (రారాజు) |
| పాలాక్షు దేనతి భ్రమసి గూడె | (ఉమను) |
| గంధర్వ చేజిక్కి కరియెట్లు మొరవెట్టె | (ఓస్వామి) |
| కడగొట్టు దశరథు కాంత యెవరు | (సుమిత్ర) |

అన్నిటికి జూడమూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
భద్రగిరి రామస్వామి నిద్దముగను
మనలకరుణా విధేయుడై మనచుచుండు.

## 12. శిరుసన గాండ్ల రామ

| | |
|---|---|
| జెనులు మోక్షముగోరి జౌరునగరమేది | (కాశికి) |
| జగతీశునకు నేమి శేఖరంబు | (కరులు) |
| భరతాగ్రజుని మాత పరగనామంబేమి | (కౌంసల్య) |
| పసులకేమిట పాడి ప్రబలమయ్యె | (వానల) |
| శ్రీచందనమునకు బెలగిన గుణమేది | (సుగంధం) |
| ధృతరాష్ట్ర డేమిట కృష్ణ గనియె | (కండ్లలో) |
| అగజకు భర్తయై నెగడెను నెవ్వడు | (పురారి) |
| అజడు జన్మించిన యట్టిదేది | (కమలం) |

అన్నిటికి జూడమూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
నట్టి శిరుసన గండ్ల రామయ్య మెపుడు
మనల కరుణా విధేయుడై మనుచుచుండు

## 13. జీడికంటి రామచంద్ర

| | |
|---|---|
| ఖాండవం బేటికి కాల్చెను సప్తార్చి | (అజీర్తి) |
| కాలకేయుల గూల్చగలిగె నెవడు | (గాండివి) |
| కఱకంఠు సుతునకు ఘనవాహనంబేమి | (శ్రీకంఠము) |
| కాంత కన్నులకేమి కప్పు బెట్టు | (కాటిక) |
| హేమకశిపు తమ్ము నామమణచెనేది | (వరాహ) |
| భువి వసంతంబన బొలుచునేది | (ఆమని) |
| దేహతాపము జేయు దేవత పేరేమి | (పోచమ్మ) |
| ధరణి మేఖల యయి దనరునేది | (సంద్రము) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమిమాత్రలు జూచిన నలరుచుండి
జీడికంటిని గల రామ చెందురుండు
మనల కరుణా విధేయుడై మనుచుచుండు.

## 14. దామగుండము రాముడు

| | |
|---|---|
| వ్రతములలో నుత్త మోత్తమమేయది | (కేదారి) |
| వసుదేవ తనయుడెవ్వరి వధించె | (మామను) |
| ధృతరాష్ట్ర సుతుడేల హ్రదములోపలజొచ్చె | (దాగుంద) |
| ఇంద్రుని వనమునేమందురిలను | (ఖాండవం) |
| కీచకు వధియించి కీర్తి బొందెనెవండు | (భీముడు) |
| కఱకంఠుతలపైని గలుగునెవడు | (రేరాజు) |
| మగల మగువలను మరులు గొల్పునెవండు | (కాముడు) |
| ఆతపత్రంబున అందురేమి | (గొడుగు) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
దామగుండము రాముండు, దయనుజూచి
మనల కరుణావిధేయుడై మనుచుచుండు.

## 17. భారిగడ్పుల న్పృసింహ

గౌతము సతిగాంచి కామించె నెవ్వడు (జంభారి)
కమలాక్షు నాభిని గలుగునేది (వారిజం)
దాశరథేశుండు ధరణిజకేమంపె (ఉంగరం)
ద్రౌణి బాణంబేడ తరుణినేచె (కడ్పులో)
కొట్టలేక యశోద పట్టినేమిటగట్టె (రోలను)
కౌసల్య సుతుకింపుగానిదేమి (అమృతం)
బూరుగు పంటకై కీరమెందుకుచేరె (ఆశించి)
ప్రహ్లాదుడేమని కలవరించె (శ్రీహరి)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుంతు
భారిగడ్పు నృసింహుడు భవ్యముగను
మనల కరుణా విధేయుడై మనుచుచుండు

## 18. ధర్మపురి నారసింహ

కృష్ణుడేకాంతతో క్రీడించె పసినాడు (రాధను)
రావణానుజుడేది రాముకిచ్చె (మర్మము)
కాకుత్సుడెవరిని గలిసి వారధిగట్టె (కపుల)
జనకజగోరిన జంతువేది (హరిణం)
వాన పాముసకుండు వనరైన పేరేమి (భూనాగం)
ఆట తీరుపువేళ పాటయేమి (హారతి)
దాతలగని యర్థి దాపు జేసటయేల (ఆశించి)
దండి నరక ప్రాప్తి దనరు నెటుల (ద్రోహాన)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుంతు
ధర్మపురి నారసింహుండు నిర్మలముగ
మనల కరుణా విధేయుడై మనుచుచుండు,

19. యెండబెట్ల నారసింహ

| | |
|---|---|
| పరమేష్ఠి గమనించు పక్షివాహనమేది | (రాయంచ) |
| నదుల పుట్టుకకేవి నారులయ్యె | (కొండలు) |
| వంచి స్త్రీలను నేమనందురు జనులెల్ల | (వంచెత) |
| పాకారి వేనిని పరగనొంచె | (గట్లను) |
| చేప చూపులుగల చెలియనామంబేమి | (మీనాక్షి) |
| చతురాస్యు ప్రియమైన చెలువయెవరు | (శారద) |
| వైవాహికములందు వాసి భూషణమేమి | (బాసింగం) |
| వజ్రివాహనముకు వైరియేది | (సింహము) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరునట్టి
ఎండబెట్ల నృసింహుండు నెల్లవేళ
మనల కరుణా విధేయుడై మనుచుచుండు.

20. మంగళగిరి నృసింహ

| | |
|---|---|
| సంపన్నతకు నేమి జగతి యందున పేరు | (శ్రీమంతం) |
| వంశంబు నేమంద్రు వసుధయందు | (వంగడం) |
| ఇందుకు పదునారు నందమేమైయుండు | (కళలు) |
| అగజకు నేసొమ్ము లందమయ్యె | (రాగివి) |
| నారద జనకుని నామమేమందురు | (విరించి) |
| ? హరిశ్చంద్రుడెట్టు లవని యేలె | (సూనృతం) |
| రాముంకు బోయిన రాజెట్లు మృతినొందె | (కృశించి) |
| అనుజుడెట్టుల యన్న వెనుకబోయె | (సహనం) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండి
చెలగు మంగళగిరి నారసింహస్వామి
మనల కరుణావిధేయుడై మనుచుచుండు,

## 21. గుండాల రామలింగము

వానర బలమెల్ల వార్ధియేమిట గట్టె (గుండ్లు)
వైరులు పైకెత్తు వడువునేది (డాలు)
అంబుధి దరువగా నందు బుట్టినదేమి (లక్ష్మి)
అవని యహల్య నేమగుదు బడియె (రాయి)
హరి పవ్వళించిన యాకు వృక్షంబేమి (మఱ్ఱి)
పశుపతి నేతీరు ప్రజలుగనిరి (లింగం)
శంభుని జడలోన చెలగి నిలిచినదేమి (గంగ)
ఆననంబునకేమి అందమయ్యె (ముక్కు)
అన్నిటికి జూడ రెండేసి యక్షరములు
ఆది మాత్రల యందున హర్షముగను
కలుగు గుండాల రాముండు కరుణతోడ
మనల కరుణా విధేయుడై మనుచుచుండు.

## 22. గద్వాల చెన్నకేశవా

కపిలుడే నృపజుల శపియించె కోపించి (సగరు)
రాజుల సభకేది తేజమొసగు (విద్వాంసం)
బాలకృష్ణుడు వేని పరగంగ గాచెను (ఆలను)
దంతంబులకు కాంతి వింతయేమి (దాచెన)
ఏమి బెట్ట మనుష్యుడెన్నిక కెక్కును (అన్నము)
ఎవరు బంపగ రాముడవని విడిచె (కైకేయి)
మత్స్యమేటికి గాలమేసిన వచ్చును (ఆశకు)
మహిని పెద్దలు ఎక్కు మ్రానులేవి (పావాలు)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండి
కీర్తి బడసెడు గద్వాల కేశవుండు
మనల కరుణా విధేయడై మనుచుచుండు.

23. శ్రీశైల భ్రమరాంబ

నలుడు జూదంబాడి అడవికేగెడువేళ
ఏమిటి విడిచితానేగె భువిని (స్వశ్రీని)
పర్వతంబునకును ప్రతినామమెయ్యది (శ్రీశైలం)
పౌలస్త్యుడనుమనే వలనుగాల్చె (వాలము)
తరుణులు తరుచుగా తాము జూపునదేమి (విభ్రమం)
దక్షిణంబున నుండు దైవమెవరు (శమను)
అన్నదమ్ముల భార్యలందరేమందురు (ఏరాండ్లు)
హరికి పండ్లెవ్వతె యడవి నొసగె (శబరి)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
నట్టి శ్రీశైల భ్రమరాంబ యనుదినంబు
మనల నెప్పుడు రక్షించి మనుచుచుండు.

24. గోవింద రాజుల స్వామి

చిన్నికృష్ణుని నోటగన్నది తల్లేమి (భూగోళం)
అంబ ఏమనె రాముడడవి కరుగ (దీవించె)
అంబరీషుండు ఏవ్రత మాచరించెను (ద్వాదశి)
శంబరారి నెవండు జృంభమణచె (పురారి)
కాళిదాసెవ్వరి కడనుండి విలసిల్లె (భోజుని)
కైవర్తకుల వేటకైనవేవి (వలలు)
పురహర చాపంబు పరిమళమెట్టిది (మైసాక్షి)
కరిరాజు నెవ్వరి శరణువేడె (స్వామిని)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన న రుచుండు
నట్టి గోవింద రాజులు ననుదినంబు
మనల కరుణా విధేయుడై మనుచుచుండు.

## 25. బొల్లిగట్టు తిర్మలయ్య

భూతేశు గమకించు ప్రీతివాహన మేమి (ఆబోతు)
కృష్ణుడెవరికి నోట సృష్టిజూపె (తల్లికి)
చెంచుదాసులచేత జెలగునాదంబేది (జేగంట)
పిట్టనెక్కిన వాని దట్టియేది (పట్టుది)
భార్గవు సుతనెందు బడద్రోచె శర్మిష్ఠ (నూతిలో)
నూతిలోపలి నీరు నుండునెట్లు (నిర్మలం)
రావణుండెవ్వరి రహిమీర జెఱబట్టె (స్త్రీలను)
ఆశబడియే పండ్లు హరికినిచ్చె (తియ్యవి)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
నట్టి బొలిగట్టు తిర్మలయ్యను దినంబు
మనల కరుణావిధేయుడై మనుచుచుండు.

## 26. వంటిమిట్ట రామస్వామి

అబ్జనాభుడు దీర్చుకుబ్జ నామంబేమి (త్రివంగ)
హరియెంత వాడయి అడిగెబలిని (పొట్టిగ)
పాండవులెచ్చట బాణాదులుంచిరి (జమ్మిని)
పొట్టకొఱకెరుకేమి పట్టి తెచ్చె (పిట్టలు)
మందిరంబలలోన మరియతుకులునేమి (నరాలు)
నలువ యేమిటియందు నాడు బుట్టె (కమలం)
దక్షుడై ధరయెల్ల రక్షించునెవ్వాడు (శ్రీస్వామి)
మండి మేఘము నేది మెండు జెఱచు (సమీరం)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలు జూచిన నలరుచుండు
నట్టిదేవుండు మావంటి మిట్ట స్వామి
మనల కరుణా విధేయుడై మనుచుచుండు

## 27. మట్టికంటి రామచంద్ర

గేము బిడ్డకి నేమి గేహినుల్ దెత్తురు (గోమయం)
తక్షకుండేమి పరీక్ష జూపె (మట్టిని)
మండువేసవి బూయు మ్రాను పేరేమిటి (మాకందం)
ఆదిత్య సుత తపం బెందు జేసే (నీటిలో)
సన్న్యాసి తానెట్లు సంచరించును భువి (విరాగం)
కక్షచె రాముడు గట్టెనెవరి (మామను)
కాపురంబెంతని ఘనులుపమింతురు (కంచంత)
పిట్టంబు కేమని ధరణి పేరు (సాంద్రము)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాటలు జూచిన నలరుచుండు
మట్టి మరిగంటి రాముండు ననుదినంబు
మనల కరుణా విధేయుడై మనుచుచుండు

## 28. చెళ్లపిళ్ల రాయసామి

స్వామియే రూపమై సోమకు దునుమాడె (మచ్చమై)
కంసాకి తొలుదొల్త గాచెనేమి (దూళ్లను)
ఇనుడస్తమించిన యింటికి కళయేమి (దీపిక)
హేమ కశ్యపు నెట్లు స్వామి దునిమె (గోళ్లను)
అంగారవర్ణుండు అర్జునుకేమిచ్చె (గురాలు)
అజునకే వాహన మమరియుండు (రాయంచ)
స్వల్ప [illegible]కము దెల్పు చాల్పునుండెడిదేమి (గసాలు)
రామానుజుని మాత నామమేమి (సుమిత్ర)
అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రల యందున నలరుచుండు
చెళ్లపిళ్ల రాయుడెప్పుడు శ్రేష్ఠముగను
మనల కరుణావిధేయుడై మనుచుచుండు.

29. పాండురంగ విఠలేశ

| | |
|---|---|
| చెలువొప్ప నేనుగల్ చెలగి యాడును దేది | (ద్వీపాంతం) |
| హరి యేమియై బలినపహరించె | (వడుగై) |
| వాయువునకు మంచి వాహనంబేమిటి | (కురంగం) |
| వాసన కాశించి వచ్చునేది | (భృంగము) |
| అంతకుండెవరికి వింతగా జనియించె | (రవికె) |
| కురురాజు దేనిచే గూలెనవని | (శఠము) |
| ఘర్మకాలము బెట్టు ధర్మంబు పేరేమి | (శైలేంద్రం) |
| చర్మాంబరుని తావు జలగు నేది | (ఈశాన్యం) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రల యందున నలరుచుండు
పాండు రంగ విఠలుడును భవ్యముగను
మనల కరుణావిధేయుడై మనుచుచుండు

30. జటపోలు గోపాలుడు

| | |
|---|---|
| పుడమీసురులకెల్ల కడు ప్రేమ యెయ్యది | (భోజనం) |
| తరువు కింకొక పేరు దనరుటేమి | (విటపి) |
| ఏపక్షి వలన తానెఱుకు మోక్షమిడెంచె | (కపోతం) |
| వెనకయ్య వాహన మనగనేది | (ఎలుక) |
| చుట్టరికంబేమి చూచి చేయగవలె | (బాగోగు) |
| రాధేయునకు మీర రానివేవి | (శాపాలు) |
| వనజ సంభవుకెన్ని నసువగు మోములు | (నాలుగు) |
| వంటకు ప్రథమంపు వస్తువేది | (తండులం) |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రల యందున నలరుచుండు
నట్టి జటప్రోలు గోపాలుడనుదినంబు
మనలకరుణా విధేయుడై మనుచుచుండు.

**31.** జగన్నాథమస్వామియు

| | |
|---|---|
| ఆంజనేయుని గన్న అతివ పేరేమిటి | [అంజన] |
| భాస్కరుండెప్పుడు బరగుచుండు | [పగలు] |
| అభిమన్యుతనయుడు అంతమొందెను దేన | [వన్నాగం] |
| పంచ తంత్రములోని ఫలమదేమి | [కథలు] |
| పాకంబు రుచివండు పాండవు పేరేమి | [భీముడు] |
| ప్రజలు కష్టపువేళ బలుకుటేమి | [హాస్వామి] |
| ఇమ్మగా రవిజుడు సౌమ్ముల్లేరవి దాచె | [భూమిజ] |
| ఇనజ భృత్యుని పితృనామమేమి | [వాయువు] |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రలయందున నలరుచుండు
ఆజగన్నాథ స్వామియు ననుదినంబు
మనల కరుణావిధేయుడై మనుచుగాత.

**32.** తిమ్మాజిపేట చెన్నుడు

| | |
|---|---|
| ? ఇందుద్రమినాడు పొందునే సతియింది | [స్వాతిలో] |
| కోకిలే చిగురులు గోరుచుండు | [కొమ్మావి] |
| ఇంద్రజుండెందులో ఖండేందునోడించె | [ఆజిలో] |
| శూరుడు శరమేల చేరదీయు | [దూపేయ] |
| నందాత్మజుడు తల్లికెందు సృష్టినిజూపె | [నోటను] |
| అతివలకేమిటి యందమొనగు | [కచశ్రీ] |
| మడుగులో కృష్ణుని మెడను జుట్టినదేమి | [పన్నగం] |
| హరియేమియై భూమి నడిగె బలిని | [వడుగు] |

అన్నిటికి జూడ మూడేసి యక్షరములు
నడిమి మాత్రల యందున నయముగాను
వెలయుచుండిన తిమ్మాజి పేట చెన్ను
మనల కరుణావిధేయుడై మనుచుచుండు.

33. పాపిసెట్టి సీతారామ

| | |
|---|---|
| బ్రదుక్నుచే నేపక్షి పక్ష వికలమయ్యె | [సంపాతి] |
| పాండవేయుల గురుపత్ని యెవరు | [కృపికి] |
| కందర్పకేళికి కడురమ్యమేయది | [పూసెజ్జ] |
| కాయ మేమిలోన గలియుతుదకు | [మట్టిని] |
| వెలయదేవతలందు విబుధుడునెవ్వడు | [అసీరి] |
| తేరిపై తమగుర్తు తీరు ఏది | [పతాకం] |
| మూడు మూర్తులకాది మూలంబు నెవ్వడు | [విరాట్టు] |
| హిమవంతు డేమిచ్చె ఈశ్వరునకు | [ఉమను] |
| అన్నిటికి జూడ మూడేసి యక్షరములు | |
| నడిమి మాత్రల యందున నలరుచుండు | |
| పాపి సెట్టింటి పేరుతో బరగుచున్న | |
| సీతరాముడు చెప్పె ఈసీసములను | |

34. ఈ క్రింది పద్యంకూడా ఈ కవిదే

| | |
|---|---|
| వాలి సుగ్రీవులవైరమే గతి గల్గె | [తారకై] |
| మందరయెవరితో పొందజెప్పె | [కైకతో] |
| కొంకక హనుమంతు లంకయేమిట గాల్చె | [తోకను] |
| కోరి కయ్యము నాడ గూర్చునెవడు | [నారదు] |
| ఇనసుతాగ్రజు జీరి ఇలగూల్చు మృగమేది | [దుందుభి] |
| దుర్యోధనుండెవరి తోడగూడె | [శకుని] |
| కాంతలు తిలకమే చెంతను నుంచురు | [నిటలం] |
| దశకంధరుడు సీతదాచెనెచట | [లంకలో] |
| అన్నిటికి జూడ మూడేసి యక్షరములు | |
| తల్లక్రిందౌచు పేరులుదనరుచుండు | |
| ఉత్తరంబులువీనికి చిత్తమలర | |
| తెలిసికోరయ్య కవులార తేటపడగ. | |

పొడుపుకథ ఒక ప్రయోజనాన్ని ఆశించిన సాహిత్య ప్రక్రియ. ఆ ప్రయోజనం కూడా వ్యక్తి మానసిక వికాసానికి దోహదం చేసేదే. ఆ కారణాన్నే పొడుపు కథలెన్నో పుట్టాయి. ఆ పుట్టిన వన్నీ నోటపట్టవు. ఏ పొడుపు కథతో లయ ఉంటుందో అదే నోట నిలుస్తుంది. లయ ఉన్నప్పుడు పద్యమో గేయమో వచనగేయమో అవుతుంది. జానపదులు సృష్టించిన పొడుపు కథలన్నీ లయాత్మకాలే. జాత్యుపజాతి పద్యాల్లో రూపుదిద్దుకొన్న పొడుపు కథల్ని పండితులే గిలికినా పద్యలయ పట్టువడ్డ జానపదులు పలకక పోలేదు.

ఆ కారణాన్నే పాపిసెట్టి సీతారామ కవిగారి పై 34 సీస పద్యాల్లో లయ తప్పని నడక కనిపిస్తుంది. అక్కడక్కడ యతి భంగాలున్నాయి, మాండలిక పదప్రయోగాలున్నాయి. కవి స్వచ్ఛందంగా పలికినప్పుడు మతి యతి మీద కాదు, గతిమీద ఉంటుంది. జానపదుల బాణీలకూ గతులకూ దగ్గరగా ఉండే తెలుగు దేశి ఛందస్సులో వచ్చిన పద్యాలు వందల కొలది ఉన్నాయి.

శ్రీ మంగిపూడి వెంకటశర్మ చమత్కార చంద్రికలో పొడుపు పద్యాలెన్నో ఉన్నాయి. దీనిభావమేమి తిరుమలేశ మకుటంతో శ్రీ బూరెల సత్యనారాయణ మూర్తి రాసిన తిరుమలేశ శతకం ఇటీవలి కాలంలోనే వచ్చింది. అంతకు పూర్వమే ఉన్న తిరుమలేశ శతకపద్యాలు ఎదురు మదురుగా లభిస్తున్నాయి. నాగఫణీశా! మకుటంతో ఉన్న కొన్ని పొడుపు పద్యాలు జానపదుల్లో వినిపిస్తున్నాయి. "ఊహగాదు నిజము ఉమ్మరెడ్డి" అనే మకుటంతో 108 ఆటవెలదులు రాసి "పొడుపు పద్యాలు" పుస్తకరూపంలో వెల్వరించారు (1984 జూన్ ద్వితీయ ముద్రణ) శ్రీ ఉమ్మానారాయణరెడ్డి.

పెద్దబాలశిక్ష, అభినవాచార్యకం, పొడుపు కథలు తదితర గ్రంథాల్లో కొన్ని పొడుపు పద్యాలు కనిపిస్తున్నాయి. ఇవి ఎక్కువగా జాత్యుపజాతుల్లో ఉండడం గమనార్హం.

ప్రాచీన తిరుమలేశ శతక పద్యాలు :

వంగతోట నుండు వరిమళ్ళల్లోనుండు
జొన్న చేలనుండు చోద్యముగను
తలపు మూలనుండు తలమీద నుండును
దీని భావమేమి తిరుమలేశ? 1

ప్రశ్నలోనే సమాధానం ఇమిడి ఉండే ఉత్తరాలంకారం లాంటిది ఇది. వంగ తోటలోనే ఉంటుంది, వరిమళ్ళలోనే ఉంటుంది, జొన్న చేలలోనే ఉంటుంది, తలుపు మూలకే ఉంటుంది, తల శరీరం మీదనే ఉంటుంది. పొడుపులోనే విడుపులున్నాయి.

వేయి కనులు గలిగి వెలయునింద్రుడుకాడు
కాళ్లు నాల్గు కల్గు కాదు పశువు
నరుడు పట్టకున్న నడువగా జాలదు
దీనిభావమేమి తిరుమలేశ? 2 [మంచం]

విధి నిషేధ పాదాలతో నడచిన ఈ పద్యంలో వేయి కన్నులున్నాయి కాని ఇంద్రుడు కాదనీ, నాల్గు కాళ్ళున్నాయి కాని పశువు కాదనీ, కాళ్ళున్నా ఇది నడవాలంటే నరుడే పట్టాలని ఆలోచన రేకెత్తిస్తుంది. విడుపు "నులక మంచం". ప్రాచీన తిరుమలేశ శతక పద్యాలిలాంటివే ఎన్నో ఉన్నాయి.

---

1, 2 పొడుపు కథలు పుట 17

## అర్వాచీన తిరుమలేశ శతక పద్యాలు :

ఆకసమున దిరుగు నది పక్షియా కాదు
తోక కలిగియుండు మేకగాదు
త్రాడు కలిగి యుండు తలప యెద్దునుగాదు
దీనిభావమేమి తిరుమలేశ! 1 [గాలిపటము]

కూడు కన్నులుండు ముక్కంటియాగాడు
గడ్డమలరు మౌని గాడు జూడ
వలసినపుడు మనకు పిలచిన దొరకును.
దీని భావమేమి తిరుమలేశ! 2 [కొబ్బరికాయ]

రెండువాడి కొమ్ములుండు నెద్దునుగాదు
అన్నమడుగబోదు ఆర్తిగనదు
మనము చెప్పినట్లు మంచిగా బరుగెత్తు
దీని భావమేమి తిరుమలేశ! 3 [సైకిలు]

బాహువుల్ పెక్కుండు బాణాసురుడు కాడు
కలదు జన్నిదంబు కాడు ద్విజుడు
చెవులు, తోకనుండు జీవంబు లేకుండు
దీని భావమేమి తిరుమలేశ! 4 [రాట్నము]

కూడు శిరములుండు ముదమొప్పపదికాళ్లు
అలరు కూడు తోక రాజకనులు
అరయ నాల్గు కొమ్ములలకరంబులు రెండు
దీని భావమేమి తిరుమలేశ! [అరక]

---

1,2,3,4,5, తిరుమలేశ శతకము పుటలు 3, 88.

ఉమ్మా రెడ్డి పొడుపు పద్యాలు :

నెత్తిమీద వాని నెచ్చెలి కూర్చుండు
ప్రక్కలోన ఒకటి పవ్వళించు
పాముపిల్లలెన్నొ పారాడు మేనిపై
ఊహగాదు నిజము-ఉమ్మరెడ్డి 1 [శివుడు]

రాజుపెద్దకొడుకు రాకాసి మర్దించి
తపసితోడ గలసి తరలిపోవ
గుండుకాలుదాకి గున్నమ్మ పుట్టెరా
ఊహగాదు నిజము-ఉమ్మరెడ్డి 2 [శ్రీరాముడు]

మూడుకండ్లవాడు ముక్కంటిమరికాడు
తలకు పిలక యుండు తాతగాడు
తాత గుడికిపోవ తలకాయ పగిలెరా
ఊహగాదు నిజము-ఉమ్మరెడ్డి 3 [కొబ్బరికాయ]

పండుగానిపండు వెండిరంగుపండు
విత్తనంబులేని వింతపండు
పండు బట్టి పిసుకు పరమ సన్యాసిరా
ఊహగాదు నిజము-ఉమ్మరెడ్డి 4 [విభూదిపండు]

పంచశీలయంచు పలవరించెను వాడు
వెన్నుపోటు పొడిచి వెక్కిరించె
ఉత్తర పొలిమేర యెత్తురా మనజెండ
ఊహగాదు నిజము-ఉమ్మరెడ్డి. 5 [చైనావాడు]

---

1, 2, 3, 4, 5 పొడుపు పద్యాలు, పుటలు 15, 4, 10, 11, 23.

అర్వాచీన తిరుమలేశ శతకం అధునాతన పదార్థాలెన్నింటినో స్పృశించింది. అదే విధంగా ఉమ్మారెడ్డి పొడుపు పద్యాలు కూడా ఆధునిక విషయాలెన్నింటినో స్పృశించాయి. ముఖ్యంగా స్వామివివేకానంద, గాంధితాత, పటేల్, నెహ్రూ, ప్రకాశం పంతులు, కన్నెకంటి హనుమంతు, వేమన్న, వీరబ్రహ్మం, శ్రీనాథుడు, సి.నా.రె తదితరుల్ని పొడుపుపద్యాల్లో బంధించారు రచయిత. స్త్రీలలో కుంతి, ద్రౌపది, అనసూయ, ఝాన్సీలక్ష్మిబాయి, చింతామణి తదితరుల్ని స్మరించారు రచయిత. ఈ శతకంలో ఈ విధంగా 108 పొడుపు పద్యాలున్నాయి

ఈ మధ్యకాలంలోనే జాతీయ సాహిత్య పరిషత్ వారి మాస పత్రిక సాధన సుమనోవినోదిని శీర్షిక క్రింద శ్రీ ధూళిపాళ మణి శ్రీ పొడుపుపద్యాలు నెలనెలా ప్రచురిస్తోంది.

"తోడుకోడలు మామకు వేడినీరు
నూతి ప్రక్కన గదిలోన నాతి చిలుక"
ధాతువేదియొ గుర్తించి దాటుమయ్య
దానవార్థిని కంకణ దానమిదియె" 1 (కోడలు నీరుతోడు)

"కాకి యోకాకి! కాళ్ళకు గజ్జలివియె
మకర సంక్రాంతి కాంతి సంభారమిదియె
కనుము పండుగ మోద విక్రాంతికాగ
అక్కబావలరాక సొంపెక్కనేడు" 2 (కనుము)

పై రెండు పద్యాల్లో క్రియాపదం గోప్యంగా ఉంది. మొదటి పద్యంలో కోడలికి విశేషణంగా ధ్వనించే తోడు శబ్దమే క్రియాపదమయ్యింది. రెండో పద్యంలో పండుగకు విశేష్యమైన కనుము శబ్దం క్రియాపదమయ్యింది. ఇలాంటి పద్యాలు చిత్ర కవిత్వం కోవలోకే వస్తాయి. పొడుపుపద్యాల్లో చిత్రకవిత్వ లక్షణాలు కొన్ని సహజంగానే ఉంటాయి.

---

1, 2 సాధన మే & జూన్ 1986

కోzహమ్ శీర్షిక క్రింద వారు రాసినవి తిరుమలేశ పద్యాల్ని అనుసరించాయి.

బుద్ధిలేదు కాని బుద్ధిని దీపింతు
తోక కలదు కాని మేకకాదు
నోరులేదు కాని మీరెదవాజ్నిధి
నెంచుడయ్య రూపునేనెవరిని? 1 (తాటాకుగ్రంథం)

బారనిడివియున్న ఫణిరాజునేగాదు
పొడువు చారలున్న పులినిఁగాదు
కంపు కాయమైన నింపుట రసనకు
సింగివేలియుందు నేనెవరిని. 2 (పొట్లకాయ)

శ్రీమంగిపూడి వెంకటశర్మ చమత్కార చంద్రిక పొడుపు పద్య రచయితలకు మంచి ప్రేరణ ఇచ్చిందనే చెప్పాలి. వారు రచించిన కొన్ని పద్యాలు గమనిద్దాం. 1922లో ఇది అచ్చయినా 1911లోనే వారు కొన్ని పద్యాల్ని ఆంధ్ర పత్రికలో ప్రచురించారు.

కుతిక నలుపుగాని శితికంఠుడాగాడు
పాముగాదు నెమలిపక్షి గాదు
గంతులిడుచు నడుచుఁగాని కప్పయుగాదు
దీనిభావమేమి? తెలుపరయ్య 4 (ఊరపిచ్చుక)

వెలయు వర్ణత్రయంబున వృక్షమొకటి
మొదటి వర్ణద్వయంబున మెదలుగజము
అమరు జంబీర మంత్యద్వయంబు వలన
వృక్షమేదియొ తెల్పుడీ విబుధులార: 5 (దానిమ్మ)

---

1 సాధన జులై & ఆగష్టు 1986.
2 సాధన, సెప్టెంబర్ 1986.
3 చమత్కారచంద్రిక-1922లో ప్రచురణ.
4,5 ఆంధ్రపత్రిక 1911 విరోధికృత సంవత్సరాది సంచిక.

కనులు మూయడెప్పుడు క్రతభుజుండును గాడు
వాలముండుగాని పాముగాదు
తీర్థసేవ సేయు దేవభక్తుడుగాడు
దీని భావమేమి తెలుపరయ్య! 1 (చేప)

పక్షివర్యుండు పరగు పంచాక్షరముల
వాని తలఁదీయ క్షుద్రదేవతజనించు
వాని తలఁదీయ తక్కెడ జానుమీరు
వాని ప్రథమాక్షరముఁదీయఁదనరునృపతి 2 (కపోతరాజు)

పెద్దబాలశిక్ష, అభినవాచార్యకము, పొడుపుకథలు తదితర గ్రంథాలలోనే గాక శ్రీ కపిలవాయి లింగమూర్తి తదితరులు సేకరించిన పద్యాలెన్నో కనిపిస్తున్నాయి. వాటిలో కొన్నయినా ఒకచోట ఉండాలనే ఉద్దేశంతోనే మరికొన్ని పద్యాలు ఈ వ్యాసంలో ఇస్తున్నాను.

రాముడెవ్వరిఁగూడి రావణుమర్దించె (లోకమూకలో)
పరవాసుదేవుని పట్నమేది (రంగనగరం)
రాజమన్నారుచే రంజిల్లు శరమేది (లకోరికోల)
వెలయఁగానుక3 వంటి విత్తు దేది (జంబీరబీజం)
సీతనుజేకొనఁజెఱచిన ధనువేది (పంచాస్త్రిచాపం)
సభవారి నవ్వించు జాణమెవడు (వికటకవి)
అలరంభ తఱములో సలరుమాలికయేది (మందారదామం)
శ్రీకృష్ణుఁడేయింటఁజెలగుచుండె (నందసదనం)
అన్నిటికి జూడ నైదేసి యక్షరములు
ఒనర నిరుదెసఁజదివిన నొక్కతీరె
చెప్పఁగల్గిన నేనిత్తు చిన్నమాడ
చెప్పలేకున్న నగుదునే చిన్ననగవు,

---

1,2 ఆంధ్రపత్రిక 1911 విరోధికృత సంవత్సరాది సంచిక
3 నాలుగు.

రాజులకెటువంటి రత్నముల్ ప్రియము స్యో
కాయలే చెట్లవి కరులు మింగె (వెలగలవె)
ఎద్దాని నీళ్వురుండెచ్చోట ధరియించు
జారుడేవంక నెవ్వాని(గోరు (నెలతలనె)
ఎన్నెన్ని దినముల కేతెంచుచున్నవు
జనయిత్రి పుష్పిణి సమయమేది (నెలనెలనె)
బంధువుండేజాడ పరగనేతెంచును
ఈతగాడె ద్దాన భీతిజెందు (కెలకులకె)
అన్నిటికి(జూడ నైదేసి యక్షరములు
ఈవలావల(జూచిన నేకవిధము
చెప్ప(గలవాడు భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగుదునే చిన్ననగవు.

తులలేని ధనముచే తుల(దూగునది యేది (తుల)
గిరిజామనోహరు గేహమేది (గిరి)
విరివిగా తుమ్మెద విహరించు తావేది (విరి)
ఓడకంబుధి దాటుచుండు నేది (ఓడ)
కలకాలమొకరీతి కల్లయౌనదియేది (కల)
శ్యామలక చీలలో జాణయేది (శ్యామ)
దివిషద్గణము నడతెంచు మార్గంబేది (దివి)
కరివేల్పు(గన్న మృగంబు నేది (కరి)
వలపుదారి పెక్కుముల(బట్టగలుగునేవి (వల)
పలుకుదురు లేక లెన్సగా(జెలగదేది (పలుకు)
ప్రశ్నలన్నిటికిని తొలిపదములందె
ఉత్తరములున్నవని చూచి యుల్లసిలుడు.

1 నెగడగనె

మనుజుని సృష్టించు మహనీయు పేరేది (నల్వ)
పతతి మానము మద్గు పరచునేవి (వల్వ)
చంద్రుండు పొడచూప సంతసించునదేది (కల్వ)
నాగు బాముకు మరో నామమేది (చిల్వ)
వెన్నెలలో నుండు విఖ్యాత గుణమేది (చల్వ)
కఱకులోక్షి యొనర్చు కార్యమేది (నిల్వ)
పరగ రూపసి యింతి పర్యాయ పదమేది (చెల్వ)
మనషికుండగ రాని గొన మదేది (పల్వ)
అన్నిటికిఁ జూడ రెండేసి యక్షరములు
చివరి వర్ణంబు నందున లవలు మిశ్ర
మము నొనర్పగ నుత్తర్వుల మరియుండు
తెఱుఁగజెప్పుడు విజ్ఞాన గరిమ మీర.

శ్రీమంతుడును భార్య చెలగుచునొక్కటి (ధనియాలు)
చేలంబు శాఖయుఁగ్రాలు నొకటి (చీలమండ)
రదనంబు కాకంబు రహిమీరనొక్కటి (పలుగాకి)
యవనికయును చాప యనగ నొకటి (తెరచాప)
పత్రంబు గ్రావంబు పరగంగ నొక్కటి (ఆకురాయి)
నేత్రంబు శిశువును నెనయ నొకటి (కనుపాప)
విష్ణుండు మరికాంత వివరింప నొక్కటి (విష్ణుకాంత)
వస్త్రంబు మగజాతి వరుస యొకటి (చీరపోతు)
అన్నిటికిఁజూడ నాల్గేసి యక్షరములు
ఏక పదముగఁ జెప్పడీ యిలను బుధులు
చెప్పఁగలిగిన నేనిత్తు చిన్నిమాడ
చెప్పలేకున్న నగుదునే చిన్న నగవు.

పార్థ శంకరులేల పైకొని పెనగిరి (కిటికి)
పతిబాసి ఛాయ యోపగిది నుండె (బడబ)
చింత చిగురునకును చెలగిన రుచియేది (పులుపు)
స్త్రీ ప్రౌఢతను చాటి చెప్పునేది (కులుకు)
తపసుచే నేమిటి తనకు సాధింపంగ (మహిమ)
ధర్మవ్యాధుండెవరు ధరణిలోన (కటిక)
అతివ కందము నిచ్చు నదియేది మహిలోన (వలువ)
జీవంతియని దేని చెప్పు చుంద్రు (కరక)

అన్నిటికిఁ జూడ మూడేసి యక్షరములు
ఈవలావలఁ జూచిన నేక విధము
చిత్త భవభంగ శివలింగ చిన్మయాంగ
వృషతురంగ శుభాంగ గౌరీశలింగ.

కరణాల చేతిలోఁ గలుగు నాయుధ మేది (కలము)
కాసకు గుణమీయఁ గలుగు నేది (ములక)
బాలుండు వ్రాతకై పట్టుకొనెడి దేది (వలక)
వర గృహంబున కేది వరలు కప్పు (కలప)
ఇంటిలోపలికేగ నేమి దాటగవలె (కడప)
భర్తకై యిల్లాలు పరచునేమి (పడక)
శర్కరి నేమని జనులువాకొందురు (గులుక)
చెలగి మూషక మేమి చేయుచుండు (కలుగు)

అన్నిటికిఁ జూడ మూడేసి యక్షరములు
ఈవలావలఁగన సరిపోల వలయు
చిత్తభవ భంగ శివలింగ చిన్మయాంగ
వృషతురంగ శుభాంగ గౌరీశలింగ.

ఏనుగు సింహంబు నెలనాగయును గూడి
యొక మాటలోపల నుండవలయు (నాగ. కేసరాలు)
పక్షియు వస్త్రంబు పాషాణమును గూడి
యొక మాటలోపల నుండవలయు (కాకిబొంత రాయి)
ఫణిరాజు ఫణివైరి ఫణిభూషణుడు గూడి
యొక మాటలోపల నుండవలయు (నాగ గరుడేశ్వరము)
రారాజు రతిరాజు రాజరాజును గూడి
యొక మాటలోపల నుండవలయు (రాజమదన కుబేరము)

దీని యర్థంబు చెప్పగా ధీనిధులకు
నెలలు పన్నెండు గడువిత్తు నేర్పుగాను
చెప్పు నాతడు భావజ్ఞ శేఖరుండు
లక్షణోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!

ఏమి చేయక వృథా యేటి నీరేగును (కట్టకట్టక)
భూపాలు డేటికి పుట్టువాండు (నేలనేలనే)
తుంగముసైల ప్రీతి తొలకాడు వేనికి (కిట కోటికి)
సభవారి నవ్వించు జాణ యెవడు (వికట కవి)
కలహంస నివసించు కాసార మెయ్యది (సురనరసు)
వీరు డెద్దానిచే విజయ మొందు (చేతి హేతిచే)
లజ్జ యెవ్వరి కమూల్య పుటలంకారంబు (కుల స్త్రీలకు)
దేవాంగులకు దేన జీవనంబు (నేత చేతనే)

అన్నిటికిఁ జూడ నై దేసి యక్షరములు
ఒనర నిరుదెన చదివిన నొక్క తీరె
చెప్పఁగల్గిన నేనిత్తు చిన్నమాట
చెప్ప లేకున్న నవ్వుదు చిన్ని నవ్వు.

నక్షత్ర వీధికి నాయకు డెవ్వడు (శశి)
రంగగు గుడిలోని లింగమేది (శిల)
వాహనంబుల మీది వన్నెకు మొదలేది (లక్క)
దేవతా ఋషులకు తిండి యేది (కంద)
నరకాసురునిఁ గన్న నాతి నామంబేది (ధర)
పొలతి చక్కదనానఁ బోల్పనేది (రంభ)
తల్లికి కడగొట్టు తనయుని పైనేది (భ్రమ)
కమలాప్త బింబంబుఁ గప్పునేది (మబ్బు)

అన్నిటికిఁ జూడ రెండేసి యక్షరములు
ఆదులుడుపంగ తుదలెల్ల నాదులగును
చెప్పు నాతడు భావజ్ఞ శేఖరుండు
లక్షణోపేంద్ర ! కృష్ణరాయక్షితీంద్ర !

మనుజుని యాకార మహిమకు మొదలేది (తల)
నగవైరి వైరికి నగరమేది (లంక)
రాముండు కాచిన రాక్షస పక్షేది (కాకి)
శిబికర్ణు లార్జించు చెలువమేది (కీర్తి)
పంచ బాణుని వింట పరగిన రుచియేది (తీపు)
గిరిజపతి భుజించు గిన్నెయేది (పుర్రె)
చెలగి నయన రక్ష చేసెడి విధమేది (రెప్ప)
చెలగిమానము గాచు చెట్టదేది (పత్తి)

అన్నిటికిఁ జూడ రెండేసి యక్షరములు
ఆదులుడుపంగ తుదలెల్ల నాదులగును
చెప్పు నాతడు భావజ్ఞ శేఖరుండు
లక్షణోపేంద్ర ! కృష్ణరాయక్షితీంద్ర !

నారీ లలామ ! నీ పేరేమి చెప్పమన్న
తమి మీర నెడమ నేత్రంబు చూపె (వామాక్షి)
మత్తేభయాన ! నీ మగని పేరేమన్న
తన చేత జీర్ణ వస్త్రంబు చూపె (కుచేలుడు)
వెలది ! నీకేమైన బిడ్డలా చెపుమన్న
కర మొప్ప మింటి చుక్కలను చూపె (ఇరువదియేడు)
కుటిల కుంతల ! నీదు కులము నామంబన్న
పంజరంబున నున్న పక్షి చూపె
ప్రభువు మీకెవ్వరన్న గోపకుని చూపె (శ్రీకృష్ణుడు)
ధవుని వ్యాపార మేమన్న దండమిడెమె (తపస్సు)
చతురమతులార ! యీ ప్రౌఢ జాణతనము
తెలిసి కొనరయ్య బుద్ధి కౌశలము మెఱయ.

రజక, కవాటముల్ రహి దప్పి యుండుట
కేమి హేతువొ దానినెరుగ వలయు (ఉతకలేత)
ఇల్లును, శేషువు హీనమై యుండుట
కేమి హేతువొ దాని నెరుగ వలయు (కప్పలేక)
పాలిచ్చు మొదవును, ఒకపక్షి హీనమై
యేమిట నుండెనో యెరుగ వలయు (చేపలేక)
సస్యంబు, కుమ్మరి సంతోష వర్జమై
యేమిట నుండెనో యెరుగ వలయు (వానలేక)
దీని యర్థంబు చెప్పిన దేశికులకు
నెలలు పంన్డెండు పురసతు నేర్పుతోడ
సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగదునే చిన్నినగవు.

శ్రీరామునకు సీత వెలగి యెచ్చటనుండు (డాకడా)
నా రాముడేటికి నడవి కేగె (కైకకై)
వీగిన మారీచుడేది బొల్చుచు వచ్చె (మెకమె)
నెనగి దైత్యుని రాముడెచటఁ జంపె (నేలనే)
సుగ్రీవుడా రాముఁ జూచి యేమనిపలికె (సంతసం)
వాలి రాముని చేత నేల చచ్చె (కనక)
లంక నేరీతిని పొంక మడంచెను (కలంక)
ప్రజల నేటి కతంబు ప్రబలఁజేసె (కేకే)

అన్నిటికిఁ జూత మూడేసి యక్షరంబు
లివ లావలఁ జూడంగ నేకవిధము
సమ్మతిగఁ జెప్ప భావజ్ఞ చక్రవర్తి
చెప్పలేకున్న నగుదునే చిన్నినగవు

ఖర్జూర ఫలములు గణికుండు కొని తెచ్చి
సగపాలు మోహంపు సతికి నిచ్చె
నందు నాలవ పాలు ననుగు తమ్మునికిచ్చె
నష్ట భాగం బిచ్చె నతని సతికి
తగ తొమ్మిదవపాలు తనయుని కిచ్చెను
తన చేత నాల్గున్న తల్లి కిచ్చె
మొదటఁ దెచ్చినవెన్ని మోహంపుసతికెన్ని
భ్రాతకెన్ని, వాని భార్యకెన్ని
తనయు కెన్ని యిచ్చె దడయక తల్లికి
నాలుగెట్టులాయె, నయముతోడ
గణిత మెఱిగినట్టి కరణాల బిలిపించి
యడుగ వలయు దేవ యవసరముగ

1. ఆద్యంత మధ్యమాంతాది మధ్యంబులో
   తేటి, రక్కసి రాజు, తెలియ దల్లి

2. ఆద్యంత మధ్యమాంతాది మధ్యంబులో
   శివునిల్లు, వరిచేను, క్షీరధార

3. ఆద్యంత మధ్యమాంతాది మధ్యంబులో
   భార్యయు, ఖడ్గంబు, ఐరగచెట్టు

4. ఆద్యంత మధ్యమాంతాది మధ్యంబులో
   పూతవన్నెయు, గెడ, పంటజోడు
   అన్నిటికిఁ జూడ మూడేసి యక్షరములు
   మొదలు తుదలును, నడితుద, మొదలునడుమ
   ప్రాణరక్షణ తలలందు పాదపముల
   వరికరములందు నీయర్థ మరయవలయు

విడుపులు :

1. అంబలి : 1-3 అలి, 2-3 బలి, 1-2 అంబ.
2. గుమ్మడి : 1-3 గుడి, 2-3 మడి, 1-2 గుమ్మ.
3. ఆవాలు : 1-3 ఆలు, 2-3 వాలు. 1-2 ఆవ
4. పొగడ : 1-3 పొడ, 2-3 గడ, 1-2 పొగ.

మామిడేల పూచు మండు వేసంగిని
జాలుఁ డేల పోవుఁ బసుల వెంట
రాజు సేన నేల రవిఁ జేర్చుచుండును
మాట నొక్కమాట ముద్దు కృష్ణ !

(కాయనే)

1. ఆద్యంత మధ్యమాంతాది మధ్యములలో
   కథ, తీగె, స్వప్నంబు గలుగవలయు

2. ఆద్యంత మధ్యమాంతాది మధ్యములలో
   ఏనుగు, నన, తుక్రు డెనగవలయు

3. ఆద్యంత మధ్యమాంతాది మధ్యములలో
   దారి, మోనము, వాణిదనరవలయు

4. ఆద్యంత మధ్య మాంతాది మధ్యములలో
   చెలి, పోరు, బందిగం బలరవలయు
   అన్నిటికిఁజూడ మూడేసి యక్షరములు
   శోభ, ఖాదిత సాహాయ్య, శుత్తులకును
   నామధేయంబులగుచుఁజెన్నారవలయు

విడుపులు :

1. కలత : 1-3 కత, 2-3 లత, 1-2 కల.

2. కవిరి : 1-3 కరి, 2-3 విరి, 1-2 కవి.

3. బానట : 1-3 బాట, 2-3 నట, 1-2 బాన.

4. ఆకలి : 1-3 ఆలి, 2-3 కలి, 1-2 ఆక.

వండగ నెండిన దొక్కటి
ఖండించిన పచ్చిదొకటి, కాలినదొకపై
తిండికి రుచియైయుండును
ఖండితముగఁ దీనిఁదెల్పు కవియుంగలడే!

(వక్క, ఆకు, సున్నము)

రాజీవనేత్ర! నీ రాజ్యమెక్కడ నంటె
ఒక చేత కోప్పువెంట్రుకలుఁ జూపె (కుంతల)

బింబాధరోష్ఠి! నీ పేరేమి చెప్పుమన్న
శుకవాణి సొగసైన మొకముఁజూపె (మోహనాంగి)

ఇందీవరాక్షి! నీకెందరు విభులన్న
ఘనమైన ముద్దుటుంగరముఁజూపె (ఒక్కడె)

పద్మాయతాక్షి! నీ పట్నమెక్కడనన్న
నవ్వుచు నెన్నని నడుముఁజూపె (నళింద్ర ?)

విశిదియేదంటె పాలిండ్ల నడుమఁజూపె (గొల్లవారిండ్లమధ్య)

కలముఁజెప్పుమంటె మరువెంట్రుకలను జూపె (జాంబవంతుని కులం)

కలికి రమ్మంటె బుగ్గలు నలిమి జూపె (సంధ్యాకాలము)

శిశిర! వినరయ్య యీ జాణప్రౌఢతనము.

అర్చకుండొకడు దివ్యాబ్జముల్ గొనివచ్చి
సూడచ్యుత స్థానమునకుఁ జేర్చి
తొలిదేవళంబు ముంగలి కొలంకునఁదోగఁ
జేతి పువ్వులు యథాస్థితిఁ దలిర్ప
అందుఁగొన్నిటిని దైత్యారికి నర్పించి
శేషమూగడి తటాకమున ముంపఁ
దత్స్నానమున రెట్టదనరఁ బూర్వపురీతి
నర్పించి యవలికోళంబు వలన
త్రిగుణమైన మొదలి తీరునఁబరమేశుఁ
బూజచేసి మిగులు పూలు గుర్ల
మూట రెంటనొకట మొగివృద్ధిగానుంచె
తొలుతనెన్ని దెచ్చె తోయజములు. (111)

ఆయా తరగతుల వాచకాల్లో కొన్ని పొడుపు పద్యాలు కనిపిస్తున్నాయి. పల్లెపట్టుల్లో కొందరినోట ఇప్పటికీ అక్కడక్కడ వినిపిస్తున్నాయి.

పదిపదము లాఱుకన్నులు
వదనంబులు మూడు మూడువాలంబులతో
చదునైన చోటఁదిరిగెడు
నెదౌ జెప్పెడివాడు జాణ యిమ్మహిలోనన్. (నాగలి)

ముక్కున పైనము నడచును
ప్రక్కన నోరుండుగాలి పారణ సేయున్
గ్రక్కున వేసిన కూయును
మక్కువతో దీనిఁదెలియు మనుజులుగలరే! (బొంగరము)

ఫలమై వెలసెను భువిలో
ఫలముల లోలోన నుండు పండ్రెండచ్చుల్
అట్టకు ముప్పది విత్తులు
విత్తులలో సగము తెలుపు నలుపైయుండున్
(సంవత్సరము, నెలలు, రోజులు, పగలు-రేయి)

శిలవృక్ష లతలఁబుట్టిన
చెలువలు ముచ్చురును గూడి చిడిముడి పడుచున్
దలవాకిట రమియింతురు
సలలితముగ దీని నెఱుఁగు సరసులు గలరే!
(సున్నము, వక్క, ఆకు)

శుద్ధకుల జాత యొకసతి
ఇద్దరణిందండ్రిఁ జంపి యెనఁగ విశుద్ధిన్
బుద్ధిఁబితామహు బొందుచు
సిద్ధముగాఁ దండ్రిఁగనును చెప్పుడు దీనిన్. (మజ్జిగ)

ఈకలు లేవటి ప్రాణికి
కాకిరూపంబునుండు కాళ్లును రెండున్
చేకొని పట్టితె కఱచును
దీని భావంబుఁదెలుపు నాగఫణీశా! (పటకార)

భూమిని పడి పొర్లాడును
గాలికి నోరావళించి గ్రక్కున భ్రమింపన్
నడినెత్తి మంటమండును
దీని భావంబుఁదెలుపు నాగఫణీశా! (కొలిమితిత్తి)

కొమ్ములు రెండుండు కోడెవత్సముగాదు
కట్టినచోటనుండు కదలకుండు
పిల్ల మేతడగదు మేఘానికాసించు
దీని భావమేమి తెలుసుకొనుడు! (చెఱువు)

ప్రజలనోట వినిపించే పై చివరి పొడుపు పద్యాల్లో గణభంగాలున్నాయి. యతులు గతులు తప్పాయి, వ్యాకరణ దోషాలున్నాయి. లయననుసరించి పాడుకొనే ప్రజలకు ఈ బందోబస్తులక్కరలేదు. లేదా కవి కైత గట్టిన కాలంలో ఇవన్నీ ఉండి జనం నోటపడి అందులోని నియమాలు రాలుపోయాయేమో! "కాళిదాసు కవిత్వం కొంత నా పైత్యం ఇంత" అనేది నిజమయ్యిందేమో!

వృత్త ఛందస్సుతోని పొడుపు పద్యాలు కూడా ఆయా గ్రంథాల్లో కనిపిస్తున్నాయి, ఎక్కడో ఒకరిద్దరినోట వినిపిస్తూనేఉన్నాయి. జానపద వాణిలకు దగ్గరగా ఉండే జాతులుపజాతుల్లోని పొడుపుపద్యాల్ని మాత్రమే ఈ వ్యాసం కాని వాసంలో (పద్యాలే అధికంగా ఉన్నాయి కాబట్టి) చూపించడం జరిగింది.

ఆయా పత్రికల్లో పొడుపుకథలు వస్తున్నట్లుగానే ఈనాటికీ ఇంకా పొడుపు పద్యాలు వస్తూనేఉన్నాయి. కాని పద్యంలో మంగిపూడి వారి చమత్కారం, పటుత్వం కనిపించడం లేదు. పొడుపు పద్యం సాఫీగా సాగిపోవాలి, తన నిండా సారళ్యాన్నే నింపుకోవాలి. అప్పుడే అది జనం నోట నిలుస్తుంది. రచయిత ఎవరో తెలియకున్నా పొడుపు పద్యం మాత్రం బతికి బట్టకడుతుంది.

# పొడుపు గేయాలు

జానపద సాహిత్యంలో అంతర్భాగం పొడుపు కథలు. అవి పుట్టినానాటి నుండి నేటివరకు పద్యాల్లో గేయాల్లో వచన గేయాల్లో లభిస్తూనే ఉన్నాయి. పొడుపు కథలు, పొడుపు సామెతలు, పొడుపు గాథలు, పొడుపు పద్యాల మాదిరి గానే గేయాలూ కనిపిస్తున్నాయి.

గేయానికి భావ లయ ప్రాణం. లయకు మాత్రలు ఆధారం. ఈ గ్రంథం లోని మొదటి వ్యాసంలో లయలు అనే శీర్షికక్రింద ఛందస్సులోని దేశీ రీతుల్ని రాగ లయ తాళాల్ని పరిశీలించడానికి పొడుపు కథ ఉపయోగపడుతుందని చెప్పడం జరిగింది. అక్కడే త్ర్యస్రాది భేదాల్ని కూడా ప్రస్తావించడం జరిగింది. (పుట : 21)

త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణ మొదలైన మాత్రా భేదాల వల్ల లెక్కలేనన్ని గమకాలు ఏర్పడే ఆస్కారముంది. అర్థస్ఫూర్తి కలిగేంతవరకు సాగిన పొడుపు కథలో దీర్ఘగేయా లున్నాయి, హ్రస్వగేయా లున్నాయి. ఒక్కో గేయంలో పెక్కు పొడుపులు పెక్కు విడుపులూ ఉన్నాయి, ఒక్క పొడుపే ఒక్క విడుపే ఉంది.

వచన గేయాల ప్రసక్తిని వదలిపెట్టేస్తే రాగ లయ తాళాల్ని సంతరించు కున్న పొడుపు గేయాలు లెక్కకు మిక్కిలిగానే లభిస్తున్నాయి. శ్రీ నేదునూరి గంగాధరంగారు తమ జానపదగేయ వాఙ్మయ వ్యాసావళిలో (పుటలు 148నుంచి 158 వరకు) ఇచ్చిన పొడుపు కథలన్నీ పాడడానికి యోగ్యమైనవే. వారుదాహ రించిన వాటిలో సిద్ధప్ప సంవాదాలు, కోలాటాల తందానాలు, యాగంటి వారి వేదాంత కీర్తనలు కూడా ఉన్నాయి. జానపద సాహిత్యం మీద పరిశోధన చేసిన మహానుభావులెందరో పొడుపు కథా గేయాల్ని ఉదాహరించారు. పొడుపు కథల ఛాయలున్న మార్మిక గేయాల్ని కూడా కొందరు అందించారు.

అధిక సంఖ్యలో లభిస్తున్న గేయాల్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు, పొడుపు పద్యాల మాదిరిగానే పొడుపు గేయాలుగా పిలవ్వచ్చునని పించింది. పైగా ఆధునిక కాలంలో చలన చిత్రాల్లోకి చొచ్చుకుపోయిన జానపద బాణీల్లోని సంవాదాత్మక మైన పొడుపు పాట ఓ ప్రత్యేకతను సంతరించుకొంది. చేయితిరిగిన మహాకవు

ఎందరో పొడుపు కథ రంగూ హంగూ పులిమి జనరంజకంగా పాటలందించారు. "ఇవి పొడుపు పాటలర్రో" అని జనం అనుకునేట్టు చేశారు.

జానపదులు కోలాటాలాడేప్పుడు, అడుగుల భజన చేసేప్పుడు, మోట గొట్టేటప్పుడు ఈ పొడుపు గేయాల్ని ఎలుగెత్తి పాడుతుండడం ఈనాటికీ కనిపిస్తుంది. పొడుపూ రాగమే! విడుపూ రాగమే!

ఊరులేని పాటి మీద
పేరులేని గరక మొలచె
నోరులేని లేడి మేసెరా
ఓరి తమ్మి ఓరి అన్న-
దీనిలోని మాయ యేందిరా!

ఊరులేని పాటి తోలు
పేరులేని గరక జాలు[1]
నోరులేని లేడి వాలు[2]
ఓరి తమ్మి ఓరి అన్న
దీనిలోని మాయ ఇదేరా[3]

మోట గొట్టేప్పుడు ఒకరు మొదటి పొడుపు పాటను గళమెత్తి పాడితే, మరొకరు విడుపు పాటను అందుకుంటారు. అంతేగాకుండా కోలలు వేసేప్పుడు కూడా ఈ పాట చెప్పుకోవడం ఉంది. ఎన్నో పొడుపులూ విడుపులూ ఉన్న ఈ క్రింది గేయం కూడా ఈ రెండు సందర్భాల్లో పాడుకొంటూనే ఉన్నారు. అయితే మోటలు పోయి కరెంటు మోటార్లు వచ్చిన ఈ కాలంలో ఇలాంటి పాటలు కోలాటాలకే పరిమితమై పోయాయి.

పోతుంటిరా జాణ పోతుంటిరా
పార్రమాను కట్టమీద పోతుంటిరా
వాగన్ని నలుసుకుంట
వాగన్ని సుట్టుకుంట

1. వాల్ (వెండ్రుకలు), 2. కత్తి, 3. తాలూకా ఎల్లారెడ్డి, ఇందూరు జిల్లా.

వాగని కోసరం నేనువోతుంటిరా :
పొవ్వాకు నలుసుకుంట
సుట్టాకు సుట్టుకుంట
ఇంగలం కోసరం నేనువోతుంటి రా ! ॥పోతు॥

వాగన్ని యెండ వెట్టి
వాగన్ని పండ వెట్టి
వాగని కోసరం నేను వోతుంటి రా !
వడ్లాను ఎండవెట్టి
రోకల్ని పండవెట్టి
కుదురు కోసరం నేను వోతుంటి రా ! ॥పోతు॥

వాగన్ని కట్టివేసి
వాగన్ని ఇడ్సిపెట్టి
వాగని కోసరం నేను వోతుంటిరా !
బర్రెనూ కట్టివేసి
బర్లూన్ను ఇడ్సిపెట్టి
దుత్తకోసరం నేను వో తుంటిరా ! ॥పోతు॥

వాగన్ని కూసోవెట్టి
వాగన్ని అండ్లవెట్టి
వాగనికోసరం నేనువోతుంటిరా !
దుత్తాను కూసోవెట్టి
కవ్వాన్ని అండ్లపెట్టి
తాడు కోసరం నేనువోతుంటిరా ! [1] ॥పోతు॥

తమ అలవాట్లనూ, అవసరాలనూ ఈ విధంగా పొడుపు నేయాల్లో కూర్చి- పేర్చి, ప్రశ్నించీ- ఆలోచనల్ని రేకెత్తించీ, అవతలివాడికి తెలువకపోతే తామే సమాధానం చెప్పడం నేటికీ అంతటా జరుగుతున్న విషయమే. పాడేవంటా కళ్ళ

1. పోతెపల్లి, పాలమూరు జిల్లా.

ముందు బొమ్మ కట్టేట్టుగా పాడుపుగేయాన్ని అల్లడం జానపదుల ప్రత్యేకత. ఈ పై పాడుపు గేయాన్ని సాధారణంగా పురుషులు పాడితే, ఈ క్రింది గేయాన్ని స్త్రీలు పాడుతున్నారు.

పోతుంటిరా నేను పోతుంటిరా
చార్కమాను కట్టమీన పోతుంటిరా !
వాగన్కి కాలిచ్చి వాగన్కి చెయ్యిచ్చి
వాగనీ కోసరం నేను వో తుంటిరా ;
గాజులోన్కి సెయ్యిచ్చి కంచరోన్కి కాలిచ్చి
పైసల కోసరం నేను వో తుంటిరా ! ॥పో॥

వాగన్ని మీదవెట్టి వాగన్ని కిందవెట్టి
వాగని కోసరం నేను వో తుంటిరా !
నొసటాన బొట్టువెట్టి పండ్లకు దాసెనవెట్టి
అద్దంకోసరం నేను వోతుంటిరా ! ॥పో॥

వాగన్ని మూసివెట్టి వాగన్ని కప్పివెట్టి
వాగన్ని కొంగుతోటి ఇసిరుంటిరా !
కుండాను మూసివెట్టి కుంపాటి కప్పివెట్టి
దీపాన్ని కొంగుతోటి ఇసిరుంటిరా ![1] ॥పో॥

కొన్ని సంవాద ప్రహేళికలు కొంత రూపు మార్చుకొని పల్లెల్లో ప్రచలిస్తున్నాయి. ఈ క్రింది పొడుపు గేయం ఇలాంటిదే.

బోడోడు ఎవడురా - బొచ్చోడు ఎవడురా !
సుట్టుముట్టు కత్తులుండు - వాని పేరు ఏమిరా !
బోడోడు కోడిగుడ్డు - బొచ్చోడు టెంకాయ
సుట్టుముట్టు కత్తులుండు - వాని పేరు వంకాయ.

1. పోలెపల్లి, పాలమూరు జిల్లా.

ఊరుకున్న దేందిరా - ఊగులాడే దేందిరా !
కాళ్లనండు దేందిరా - కమ్ముకొచ్చే దేందిరా !
ఊరుకున్న దావురా - ఊగులాడేది దూడరా
కాళ్ళనందుది చెంబురా - కమ్ముకొచ్చేవి పాలురా.1

కోలాటాలాడేప్పుడు నవ్వుకుంటూ పాడుకుంటారీ గేయాన్ని. ఈ క్రింది పొడుపు గేయం కూడా ఆ సందర్భానికి చెందిందే.

ఎక్కింది ఏమిందిరా - కుక్కింది ఏమిందిరా ?
ఎక్కింది సెట్టూరా - కుక్కింది ఉలీరా
కట్టింది ఏమిందిరా - కాలింది ఏమిందిరా
కట్టింది లొట్టిరా - కాలింది పల్లూరా
అట్టింది ఏమిందిరా - రుద్దింది ఏమిందిరా
అట్టింది పిడకారా - రుద్దింది అలుకూరా
అబ్బింది ఏమిందిరా - రుబ్బింది ఏమిందిరా
అబ్బింది రోలూరా - రుబ్బింది పిండీరా ! 2

దాదాపు ఈ పాటవంటిదే కాని కొంత స్పష్టంగా, రాగ లయ బద్ధంగా కుదురుకొన్నది ఈ క్రింది పొడుపు గేయం.

పిండేది యేందిరా ఎక్కేది యేందిరా !
కారేది యేందిరా - కట్టేది యేందిరా !
పిండేది పిచ్చురా - ఎక్కేది మనిషిరా
కారేది పిల్లురా - కట్టేది లొట్టిరా
పిలుస్తున్న దేందిరా - కూసున్న దేందిరా
కాళ్ళనుండు దేందిరా - కారేది యేందిరా
పిలుస్తున్నది మిత్రురా - కూసున్నది మస్తిరా
కాళ్ళనుండది చెంబురా - కారేది పాలురా 3

1. ఉప్పల్ తాలూకా, రంగారెడ్డి జిల్లా.
2. ఉప్పల్ తాలూకా, రంగారెడ్డి జిల్లా.
3. కొల్లాపూర్, పాలమూరు జిల్లా.

గూఢార్థాల శబ్దాల్ని పేర్చి ప్రశ్నోత్తరాలు కొనసాగించే పద్ధతిని ఉద్ఘాత్మక మంటారని భరతుని నాట్యశాస్త్రం చెబుతోంది. ఉద్ఘాత్మక లక్షణం పొడుపు కథకు ప్రధానమైందే. ప్రశ్నోత్తరాలు గొలుసుగా సాగిపోడం పొడుపు గేయంలోనే ఎక్కువ.

భర్త : శారెడన్ని బియ్యంవోసి - శామకూర తొక్కువండి
వొగవాలు బువ్వవెట్టి - వొగవాలు తొక్కువేసి
ఎవ్వానికొరకు నీవు వోయుంటివే - భామ వోయుంటివే !

భార్య: వొగాన్ని పండవెట్టి - వొగాన్ని కూసోవెట్టి
వొగాని కొరకు - నేను వోయుంటిరో - నేను వోయుంటిరో !

భర్త : ఎవాన్ని పండవెట్టి - ఎవాన్ని కూసోవెట్టి
ఎవ్వాని కొరకు నీవు వోయుంటివే - భామ వోయుంటివే !

భార్య: రాయిని పండవెట్టి - గుంజాను కూసోవెట్టి
గుంద్రాయికొరకు నేను వోయుంటిరో - నేను వోయుంటిరో !

భర్త : శాశెడన్ని బియ్యంవోసి - శామకూర తొక్కు వండి
వొగవాలు బువ్వవెట్టి - వొగవాలు తొక్కువేసి
ఎవ్వానికొరకు నీవు వోయుంటివే - భామ వోయుంటివే !

భార్య: వొగాన్ని సేతవట్టి - వొగాన్ని నోటవట్టి
వొగానికొరకు నేను వోయుంటిరో - నేను వోయుంటిరో.

భర్త : ఎవాన్ని సేతవట్టి - ఎవాన్ని నోటవట్టి
ఎవానికొరకు నీవు వోయుంటివే - భామ వోయుంటివే !

భార్య: సంచీని సేతవట్టి - వాకూను నోటవట్టి
సున్నాముకొరకు నేను వోయుంటిరో - నేను వోయుంటిరో !

వడ్లాబియ్యాన్ని కోడె - వారుజిమ్ముల బొల్లి కోడె
కోడెం దోలురోరి మగడ - కోడెం దోలురా !

నీవు దోలిన తోల్కానికి - ఎదురు జిమ్ములు జిమ్ముతాది
పిల్లను వట్టురోరి మగడ - నేను దోలుతా !

సంవాద గేయాలే కాకుండా సాధారణ గేయప్రహేళికలు కూడా లెక్కకు మిక్కిలిగా లభిస్తున్నాయి. వాటిలో కొన్ని గమనిద్దాం.

తీసి తీసి పెట్టేదొకటి - తియ్యక పెట్టేదొకటి
పాయవట్టి పెట్టేదొకటి - పట్టి పట్టి పెట్టేదొకటి
పంచవెట్టి పెట్టేదొకటి - కుచ్చి కుచ్చి పెట్టేదొకటి

తీసి తీసి పెట్టేది కాటుక
తియ్యక పెట్టేది బొట్టు
పాయవట్టి పెట్టేది జడ

పట్టి పట్టి పెట్టేవి గాజులు
పంచవెట్టి పెట్టేది పాపడ
కుచ్చి కుచ్చి పెట్టేవి పూలు.1

[illegible] తీసి కాటుక పెట్టడం, ఏమి తీయకుండానే బొట్టుపెట్టడం, పాయ [illegible], [illegible] గాజులు పెట్టడం, పాపటపుల్లను పంచవెట్టి పాపడ తీయడం, పూలను దగ్గర దగ్గరగా కుచ్చడం ఇవన్నీ రోజూ జరిగేవే! కాని వాటిని [illegible] పొడుకోడం, అదికూడా అపార్థానికి ఆస్కారమిచ్చేవిధంగా పొడుపు [illegible]గా మార్చుకోడం జానపదుల హాస్యప్రియత్వానికి ఒక చిహ్నంగా కనిపిస్తుంది.

[illegible] ఆకులుంటివి
[illegible]
[illegible]
[illegible] ఉంటివి 2 (మర్రిచెట్టు)

[illegible]
[illegible]
[illegible]
[illegible] (రూపాయి)

---

1. [illegible], పాలమూరు జిల్లా.
2. [illegible], పాలమూరు జిల్లా.
3. మూడ్గుల, పాలమూరు జిల్లా.

దాని మొదలు చెరకు మొదలు
దాని ఆకు దామరాకు
దాని పూత మేడిపూత
దాని కాత గజ్జెకాత[1] (ఆముదంచెట్టు)

సుట్లు సుట్లు బావికాడా
సుందరమ్మ తోటకాడా
ఆకు పుట్టె పోక పుట్టె
కొడుకును కొట్టేసి -
కోడలు ముండమోసె[2] (అరటిచెట్టు)

ఇక్కడ ఉండవు అక్కడ ఉండవు
దొరవారి తోటలో ఉండవు
తింటే తీపి ఉండవు
ఉమిస్తే గింజలుండవు[3] (వానగళ్ళు)

ఈ గుంజ ఆ గుంజ యేరాండ్లు
పందిరి కిష్టమ్మ కోడండ్లు
వాళ్లాకెప్పుడు గోరాలు
వాళ్లాకాళ్ళకు దారాలు[4] (పొట్లకాయ)

కటకట రాముల కడుపుల పుడితి
ఏమై పుడితి ఏంసుఖ పడితి
ఆడదానితో దెబ్బలు తింటి
అగలేకపోయి అగ్గిలపడితి.[5] (పిడక)

---

1. అడ్లూరు ఎల్లారెడ్డి, ఇందూరు జిల్లా
2. మల్లారెడ్డిపేట, కరింనగర్ జిల్లా.
3. తాలూకా ఎల్లారెడ్డి, ఇందూరు జిల్లా.
4. అజలాపురం, పాలమూరు జిల్లా.
5. అజలాపురం, పాలమూరు జిల్లా.

నారయ్య : సై సామీ సై

బంగారు : వెయ్యి అయ్యోరా - ముందే నువ్వే వెయ్యి !

కాశి : వెన్నెలలో వికసించే తామర కమలం మీద ఒంటిరేక కలువపూలు జంటగ మొలిచాయంట అంటే ఏమిటో - ఆ వింత ఏమిటో?

నారయ్య : ఓస్ యింతేగదూ? కాసుకో !

బంగారు : పిల్లా, ఎత్తుకో సెప్తా

మంజు : సవాలువేసిన చిన్నవాడా ఆవింత నీచెంతనేవుందిలే

బంగారు : ఉందిలే

నారయ్య : ఏందిరా

బంగారు : ఏందో

మంజు : [తామరకమలం తరుణి నగుమొగం]

బంగారు : హా! అద్గదీ

మంజు : [కలువల జోడే కాటుక కన్నులు]

బంగారు : ఔ - ఔ - ఔ

మంజు : ముసులున్న వనములో ఎలమావినీడలో
చిలకల్లు పెంచిన చినదెవరోయీ !
ఆ చిన్నారి కన్నవాడు సింగంతో చెలగాడే
మొనగాడోయ్ - ఓ మొనగాడా !
ఆ బాలుని పేరేమోయీ ఆ మాటేమన ఆటౌనోయ్

కాశి : [ఆబాలే శకుంతలా - అవునా
బాలుడే వీరకుమార భరతుడు
ఆ ఆటే నవరస భరితమౌ భారతము]

కాశి : మగరాయనిపై అలిగిన
సొగసరి మొగమున - తోచీ తోచనిదేమో?

మంజు : [పెదవుల దాగిన చిరునవ్వే]

కాశి : నిదుర మబ్బులో వున్న అర్జునుని
చూచిందెవరో తలపూచిందెవరో ?

మంజు : [ఉవ్విళ్లూరే ఉయ్యాలచికాదా!]

కాశి : [illegible] పైన కలకలా - కొమ్మమీద కిలకిలా

విలవిలా కిలకిలా ఏమిటాకథ

వినదానా ఏమిటా కథ !

బంగారు : [illegible] పచ్చులు [illegible]

నారయ్య : కాదు కప్పలు కోతులు

కాశి : కాదు....కాదు.

[ పరిలో యమునా నదిలో జలకాలాడే కన్నెలు కలకల

పలువలు దాచినకృష్ణుడి కిలకిల తెలిసిన కన్నెలు విలవిలా.

అక్కడ విలవిల ఇక్కడ కిలకిల చిటకిటి కథ వినదానా]

చలనచిత్రాల్లో జానపద బాణీ గేయాలకు జీవంపోసిన మనిషి కొసరాజు. ఆయన గీతాల్లో పొడుపులు పొడిగారు, విడుపులు విడిచారు. "ఎత్తుకు పై ఎత్తు" చిత్రంలోని బృందగానంలో మూడు పొడుపులున్నాయి, మూడు విడుపులున్నాయి.

ఏందో చెప్పండి చూద్దాం ఏందో చెప్పండి

పల్లపల్లెపై రాసేది తెల్ల సుద్దతో వేసేది

పక్కన చారలు ఒంటిన వున్నవి

జానెడు బారెడు మీసాలున్నవి

గోళ్ళసిప్పితే గుండెలు పగులు

కోరలు జాపితే కొంగర బుట్టు

అమ్మయ్యో పిల్లి ! పిల్లి ! పిల్లి !

పిల్లికాదది

[illegible] ! [illegible] !

[illegible]

[illegible] ?

మ్యావు మ్యావు అను పిల్లికాదదీ

[illegible] ఎగిరే [illegible]కాదదీ

[పులి ! పులి !]

పొడుపు కథాసాహిత్యంలో కనిపిస్తున్న ప్రక్రియా వైవిధ్యం దృష్ట్యా పొడుపు పద్యాలలాగానే పొడుపు గేయం కూడా ప్రత్యేకంగా పరిశీలించాల్సిన అవశ్యకత ఏర్పడింది. తెలుగు సాహిత్యంలో అతి వేలంగా వచ్చిన తత్వాల్లో భక్తిరస గేయాల్లో అక్కడక్కడ పొడుపుగేయాల ఛాయలున్నవెన్నో ఉన్నాయి. సంవాద గేయాల్లో కూడా ఈ మెరుపులు కనిపిస్తున్నాయి. జానపదుల సుదీర్ఘ కథాగేయాల్లో సందర్భానుగుణంగా పొడుపు గేయాల ముక్కలు చోటుచేసుకున్నాయి. పిల్లల పాటల్లోని ఛాయామాత్ర పొడుపు గేయాలు సొగసులు చిందిస్తున్నాయి. అస్పష్టమార్మిక గేయాల్లోనూ పొడుపుకథ లున్నాయి. ముమ్ముందు ఇవన్నీ ఒక దగ్గరికి చేర్చే ప్రయత్నానికి ఈ వ్యాసం మార్గదర్శనం చేస్తే అంత కన్నా కావల్సిందేముంది !



# పొడుపు లెక్కలు

"ఒక్క లెక్క రాకపోతే ఒక జీవితం అర్థంకానట్టే" అని తరగతి గదుల్లో లెక్కల పంతుళ్లు చెబుతుంటారు. విద్యార్థికి లెక్కలమీద ఆసక్తిని పెంచడమే ప్రధానోద్దేశమైనా ఆ మాట లెక్కల ప్రాధాన్యాన్ని నొక్కిచెబుతోంది. మనిషికి నిత్యజీవితంలో అడుగడుగునా ఎదురు తగిలే లెక్కలు చిక్కుల్లో ముంచుతాయి, చిక్కుల్నుండి తేలుస్తాయి. లెక్కలోని చిక్కుముడిని విప్పగలిగితే లెక్క తేలి పోయినట్టే లెక్క. చిక్కుముళ్ళున్న లెక్కలనే చిక్కుప్రశ్నలనీ, చిక్కులెక్కలనీ, యుక్తి లెక్కలనీ, పొడుపు లెక్కలనీ వ్యవహారంలో పిలుస్తున్నారు.

అనేక శాస్త్రాంశాల్ని తనలో రంగరించుకొన్న పొడుపు కథ గణితశాస్త్ర విశేషాల్ని కూడా కలుపుకొంది. పొడుపు సామెతలు, పొడుపు గాథలు, పొడుపు పద్యాలు, పొడుపు గేయాలు పొడుపుకథా శబ్దంలోనే గతార్థాలైనా వైవిధ్యం కని పిస్తుండడంతో, ప్రజలు అక్కడక్కడ వ్యవహరిస్తుండడంతో పీటిని వేర్వేరుగా పరిశీలించడం జరిగింది. ఈ కోవలోకి పొడుపు లెక్కలు కూడా వస్తాయి.

తెలుగునాట రైతన్న నిన్న మొన్నటివరకు గిద్దెడు, సోలెడు, తవ్వెడు మానెడు, అడ్డెడు, కుంచెడు, కుండెడు లెక్కలు గట్టుకుంటూ కొలుచుకున్నాడు. ఇప్పుడు గ్రాములు, కిలోలు వచ్చినై, క్వింటాళ్ళు వచ్చినై. మానిక మూలబడ్డా మూడు కిలోల ధాన్యం దాదాపు మానికంత అని లెక్కగట్టుకుంటున్నాడు. కిలో అంటే దాదాపు శేరు అని సరిపెట్టుకుంటున్నాడు.

5 శేర్ల ఆనగం బుర్ర
3 శేర్ల ఆనగం బుర్రలతో
8 శేర్ల గింజలను
ఇద్దరికి చెరిసగం పంచాలి.

ఇవాళ రకరకాల సాధనాలు వచ్చాయి. కాబట్టి ఈ పని చిటుక్కున అయి పోతుంది. కాని యే పరికరాలు లేక ఆనగం బుర్రలే (సొరకాయ బుర్రలే) కొల మానాలు అయిన ఆ కాలంలో ఈ బుర్రలకు బుర్ర జోడించడం తప్పనిసరి మరి.

తాతగారు తన ఇద్దరు మనుమల్ని పిలిచి ఈ సంగతి చెప్పారు. ఎనిమిది శేర్ల ధాన్యాన్ని చెరిసగం తీసుకొని కోమటింటికి వెళ్లాలన్నారు. కాని ఆ ఎనిమిది

శేర్లను పంచుకోవానికి ఉన్న పరికరాలు 5, 3 శేర్ల ఆనగం బుర్రలు. మనుమల బుర్ర పనిచేసింది. 8 శేర్లనుండి మొదట 3 శేర్లు తీసి పక్కకు పోశారు. మిగిలిన 5 శేర్లనుండి మరో మూడుతీసి మొదటి మూడింటిలో పోశారు. అప్పుడవి ఆరైనవి, 6 శేర్లనుండి 5 తీశారు. 1 శేరు పక్కకుంచారు. 5 నుండి 3 తీసి దానికి ఒక్కటి కలిపారు. అవి నాల్గయ్యాయి. మొదటి 2 శేర్లు చివరి రెండుశేర్లు కలపగా ఇవి నాల్గయ్యాయి.

కొన్ని పొడుపు లెక్కలు ఇలాగే సుదీర్ఘ వ్యాఖ్యాన సాపేక్షకాలు. ఇవన్నీ చాలావరకు జానపదులు కట్టుకొన్నవే.

చెర్ల బర్లు (బర్రెలు)
బర్లమీద కొంగలు వాలుతయి -
ఒక కొంగ మిగుల్తది.
ఒక్కొక్క బర్రెమీద రెండ్రెండు వాలుతయి
ఒక బర్రె మిగుల్తది.
బర్లెన్ని ? కొంగలెన్ని ? (3 బర్రెలు, 4 కొంగలు)

ముప్పయి రొట్టెలు
ముప్పయి మంది,
మగోళ్ళకు రెండు
ఆడోళ్ళకు ఒకటిన్నర
పిల్లలకు సగం
ఎవరెవ రెంతమంది ?

(మగవారు 6, ఆడవారు 6, పిల్లలు 18)

121 ఎడ్లను
సమానంగా బంతులు కట్టాలి
ఎన్ని బంతులు ? $(11 \times 11 = 121)$

తండ్రీ కొడుకులు
మామ - అల్లుడు
మూడు రొట్టెలు
సమానంగా పంచాలి (ఒక్కొక్కటి)

చూడానికి కాచున్నది నల్గురనుకొంటాం. కాని అక్కడ ఉన్నది ముగ్గురే. తండ్రి - మామ అనబడే ఆ వ్యక్తి ఒక్కడే. కాని ఇద్దరు యువకు లున్నారు. ఆ ఇద్దరిలో అతనికి ఒకడు కొడుకు, మరొకడు అల్లుడు. తన అల్లుడూ, తన కొడుకూ, తాను ముగ్గురే. ఉన్నవి మూడు రొట్టెలు, ఒక్కొక్కటి సమానంగానే వచ్చాయి.

| | | |
|---|---|---|
| ఆడంగ వాయ్యేటివన్ని | .... | 36 |
| మల్లన్ని | .... | 36 |
| అంద్ల నగం | .... | 18 |
| నగముల నగం | .... | 9 |
| నాతోటి నూష్టరు | .... | 1 |
| | | 100 |

నందుకు పన్నెండు పచ్చలు
పచ్చకు ముప్పయి గింజలు
నందేంటి ?
పన్నెండేంటి ?
గింజలేంటి ? (సంవత్సరం, నెలలు, దినాలు

మెదడుకు మేతపెట్టే జానపదుల చిక్కులెక్కలే గాక ఇప్పుడు పత్రికల్లోనూ పొడుపు లెక్కలు వస్తున్నాయి. 1980 జులై, ఆగస్టు, సెప్టెంబరు మాసాల ఆంధ్రభూమి వారపత్రికలో పొడుపు లెక్కలెన్నో వచ్చాయి. అందులో కొన్ని గమనిద్దాం.

ఒక పిసుగు రోజుకు 1 మైలు చొప్పున నడుస్తూ పోతుంటుంది. కొద్దిరోజులయ్యాక ఆ పిసుగు ఒక చిన్న పిసుగును కని, తన ప్రయాణం సాగిస్తూ ఉంటుంది. ఆ చిన్న పిసుగు పుట్టిన 1వ రోజు 1 మైలు, 2వ రోజు 2 మైళ్ళు, 3వ రోజు 3 మైళ్ళు ఇలా రోజుకొక మైలుచొప్పున పెరిగిపోతుంది. అది ఎన్ని రోజులలో తల్లిని కలుసుకోగలుగుతుంది. (7 రోజులు)

ఒక నిమ్మతోటకి మూడు ద్వారాలున్నాయి. మూడు ద్వారాల దగ్గరా ముగ్గురు కాపలాదారులున్నారు. ఒక వ్యక్తికి ఒక నిమ్మకాయ అవసరం వచ్చి తోటలోకి వెళ్లాడు. ప్రతీ కాపలాదారుడు అతను కోసుకున్న వాటిలో సగంమీద ఒక నిమ్మకాయ ఇచ్చే షరతుమీద అతన్ని లోపలకు విడిచిపెట్టారు. ఆ వ్యక్తి కొన్ని నిమ్మకాయలు కోసుకొని, కాపలావాళ్ళ వాటాల్ని వారు కోరినట్లే ఇచ్చి బయటికి వచ్చేసరికి సరిగ్గా అతనికి ఒక్కకాయే మిగిలింది. అయితే అతను మొత్తం ఎన్ని కాయలు కోశాడు ? (22 నిమ్మకాయలు)

భీమయ్య ఒక బస్తా వేరుశనక్కాయలు నెత్తిన పెట్టుకున్నాడు. రామయ్య 10 బస్తాలు పెట్టుకున్నాడు. అయినా భీమయ్య మోసే బరువు రామయ్య మోసే బరువుకి 20 రెట్లు ఉంది. ఎందుచేత ?

(రామయ్య మోసేవి ఖాళీసంచులు కాబట్టి)

1 రూ॥కి 20 వంకాయలు, 1 బెండకాయ, 5 రూ॥లకి 1 గుమ్మడికాయ వస్తాయి. అన్ని కూరగాయల్ని తెమ్మని 100 రూ॥లు ఇచ్చాను. మొత్తం 100 కూరగాయలు రావలి ఎలా చెప్పండి ?

| | |
|---|---|
| 19 గుమ్మడికాయలు | రూ. 95-00 |
| 1 బెండకాయ | రూ. 1-00 |
| 80 వంకాయలు | రూ. 4-00 |
| 100 కూరగాయలు, | రూ॥లు 100-00 |

ఈ పొడుపు లెక్కలన్నీ పరిశీలిస్తే ప్రజాజీవనంతో సంబంధంలేనిది లేనే లేదనిపిస్తుంది. ధాన్యం, పశుపక్ష్యాదులు, రొట్టెలు, పండ్లు, రూపాయలు, కూరగాయలు ఇవేకదా ఈ లెక్కల్లో కనిపిస్తున్నవి. అందుకే పొడుపు లెక్కలింకా పుడుతూనే ఉన్నాయి.

పొడుపు పద్యాల్లో ఉదాహరించుకున్న "ఖర్జూర ఫలములు...." అనే పద్యం కూడా ఈ కోవలోకే వస్తుంది. వయోజన విద్యావాచకాల్లోనూ ఇలాంటి పద్యాలు కనిపిస్తున్నాయి.

పది పదము లాఱు కన్నులు
పదనంబులు మూడు, మూడు వాలంబులతో
చదునైన చోట, దిరిగెడు
నెదొ చెప్పెడివాడు జాణయిమ్మహిలోనన్.[1]

పెద్దబాలశిక్షలోని ఒకటి రెండు యుక్తిలెక్కలను పరిశీలిద్దాం. అవి కూడా పద్యాల్లో ఉండడం వాటికి విడుపు సూత్రాలు కూడా రాసిపెట్టడం గమనార్హం.

తార్కికుల్ నలుగురు, తస్కరు లేవురు
 శ్రోత్రియు లిద్దరు. చోరు డొకడు
భూసురుల్ ముగ్గురు, ముడియవిప్రార్భకుడు
 సకలార్థ నిపుణుడు శాస్త్రియొకడు
యల్లాపు లిద్దరు, యాచకు లిద్దరు
 బరివాంఛ్రుడు ముగ్గురు, బాప డొకడు
ఆగడి లిద్దరు, ఆరాధ్యు లిద్దరు
 దుష్టాత్ముడైనట్టి దొంగ యొకడు
అరసివారల నొకశక్తి యశనమునకు
సగము గోరగ, సవసంఖ్య జగతి సురుడు
చెప్ప దొంగలు హతులైరి, చేటు దప్పి
విజయమందిరి యావేళ విప్రులెల్ల.

కొంతమంది (15+15) దొంగలు బ్రాహ్మణులు కలిసి ప్రయాణిస్తున్నారు. అందులో సగంమందిని తింటానికి ఒక శక్తి వచ్చింది. తెలివిగల బ్రాహ్మణుడు తనవారిని దొంగలను కలిపి ఈ క్రింది క్రమంలో నిలబెట్టాడు. ప్రతి తొమ్మిదవ వ్యక్తిని తినుమన్నాడు. దొంగలు శక్తికి ఆహారమయ్యారు. బ్రాహ్మణులందరు బతికిపోయారు. X-బ్రాహ్మణుడు, O-దొంగ)

XXXX OOOOO XXO XXXOX OO XX OOO X OO XXO

---

1. ప్రయోజన విద్య, రెవ వాచకము. పుట : 26.

అర్చకుండొకడు దివ్యాబ్జముల్ గొనివచ్చి
మూడచ్యుత స్థానమునకు జేర్చి
తొలిదేవళంబుమంగలి కొలంకునదోగ
చెతి పువ్వులు యథాస్థితి దలిర్ప
నందుగొన్నిటిని దైత్యారికి నర్పించి
శేషమాగుడి తటాకమున ముంప
తత్స్థానమున రెట్టదనర పూర్వపురీతి
నర్పించి యవలి కోశంబువలన
త్రిగుణమైన మొదలి తీరున పరమేశు
పూజసేసి మిగులు పూలు గుళ్ల
మూట రెండు నొకట మొగివృద్ధిగానుంచె
తొలుత నెన్ని దెచ్చె తోయజములు.

(పుష్పాలు మొత్తం : 111)

ఈ క్రింది సూత్రం విడుపును సాధించడానికి తోడ్పడుతుంది.
తిరముగు ప్రసూన వృద్ధులు
వరుసను లిఖియించి యంశవర్గంబు బర
స్పర గుణితంబైనను గన
బరగుం బూజాప్రసూన పటలంబనఘా !

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ గ్రూపు పరీక్షల్లో కూడా ఈ చిక్కు లెక్కలు అతి వేలంగానే ఇస్తున్నారు. ఒకనాటి లీలావతి భాస్కర గణితాల్లో వ్యక్తి మానసిక వికాసానికి దోహదంచేసే పొడుపులెక్కలే అధికంగా ఉండేవి. శాస్త్రీయ విజ్ఞాన ప్రచారంలో కూడా పొడుపు లెక్క పొడుపు కథకేం తీసిపోదు. ఏదియేమైనా వ్యక్తి ఏకాగ్రత సాధనలో పొడుపులెక్క ఉపకరిస్తుందనడంలో సందేహంలేదు.

○ ○ ○

గ్రంథాల్లోనూ - అక్షరాస్యులైన వయోజనుల గ్రంథాల్లోనూ సంపాదకులు చేర్చినవి, పత్రికలలో బాలలశీర్షికల క్రింద ప్రకటించినవి, ఆకాశవాణిలో ప్రసారం చెయ్యబడ్డవి, వ్యక్తిగతంగానో లేక సాహితీ సంస్థల పక్షంలోనో ప్రత్యేకంగా పరిశోధించి ప్రచురించినవి మొదలైనవన్నీ ముద్రితాల క్రిందికి వస్తాయి. ప్రత్యేకంగా పరిశోధించి ప్రచురించిన వాటిలోతప్ప మిగతాఅన్నిట్లోనూ సమగ్రత్వాన్ని ఆశించడం సబబుకాదు. ఇందులో అయినా సమగ్రత్వం ఆశించలేం గాని దొరికిన మేరకయినా పూర్ణరూపం వచ్చిందా లేదా అని పరిశీలిస్తాం అంతే.

అభిరుచి కొద్ది ఎవరోఒకరు సేకరించారు. అవి ప్రచురింపబడ్లేదు. వ్రాత ప్రతి ఉంటుంది. ఇలాంటివి అముద్రితాలనబడతాయి. వీటిల్లో అకారాది క్రమ పద్ధతో లేదా విషయానుసరణ పద్ధతో పాటించడం సర్వసాధారణంగా కనిపించదు. "అడ్డగోలు జమాబందీలా" రాసి ఉంటాయి. లేఖకుల బ్రహ్మవ్రాతకు తలపట్టుకునేకంటే వారితో చెప్పించుకొని రాసుకోడం ఉత్తమం. అయితే ఇవి ఫలానాదగ్గర ఉన్నాయి అని తెలవడమే కష్టం. పది దిక్కుల తిరిగే పరిశోధకునికి ఎక్కడో-ఒకదగ్గర ఇవి దొరక్కపోవు.

మొత్తమ్మీద ముద్రితాలుభద్రపరిచే విధానాన్నిబట్టి పరిశోధకునికి ఎప్పుడో ఒకప్పుడు లభిస్తాయి. ఇక వాగ్రూపంలో ఉండి జనుల నాలుకలమీద భద్రపరచబడిన పొడుపుకథలు ఎక్కడపడితే అక్కడ లభిస్తాయి. జానపద సాహిత్య సేకరణలో ప్రధానమైన క్షేత్రకార్యం (Field work) ఇదే అనాలి. దీనిమీద ఆధారపడే వర్గీకరణం (Classification), సిద్ధాంతీకరణం (Theorisation) జరుగుతుంది. అయితే ఒక ఊళ్లోని అందరూ పొడుపుకథలు చెప్తారని భావించడానికి వీల్లేదు. పాలమూరు మండలంలోని కొన్నిగ్రామాల్లో "ఆ యెంకడు పడిదెలోడు బలెసిటుకులు సెప్తడు" అనే మాట వినిపిస్తుంది. ఇక్కడ యెంకడో, ఎల్లడో, మల్లడో ఎవరోఒకరు కావచ్చు. కాని ఆ చెప్పే అతణ్ని పట్టుకోడంలోనే ఉంది నేర్పు. అప్పుడే మౌఖిక ప్రచారంలోని పొడుపుకథలు సుళువుగా సేకరించడానికి వీలవుతుంది. అయితే వీటిని సేకరించడానికి కొంతపూర్వరంగం సంసిద్ధం చేసుకోవాల్సిన అవసరముంది.

పూర్వరంగం :-

సేకరణకు బయలుదేరేముందు, పెన్నూ, పెన్సిలు, కాగితాలు, కెమెరా, టేప్‌రికార్డర్ తదితర పరికరాలన్నీ సమకూర్చుకోవాలి. చిటికలో పాడవబడి త్రుటిలో విడవబడే పొడుపుకథలకు టేప్‌రికార్డర్ అనవసరమని కొందరు భావిస్తుంటారు. కాని పొడుపుకథల్లో పొడుగు పొడుపుల్ని (గేయప్రహేళికల్ని) సులభంగా సేకరించడానికి ఇది ఉపకరిస్తుంది. మాండలికాల్లోని యాసనూ, విచిత్ర ధ్వనుల్ని పట్టుకోడానికి కూడా టేప్‌రికార్డర్ అవసరమే అనాలి.

"పోతుంటిరా జాణ పోతుంటిరా
చార్‌కమాను కట్టమీన పోతుంటిరా
వాగన్ని నలుసుకుంట
వాగన్ని సుట్టుకుంట
వాగని కోసరం నేను వోతుంటిరా !
పొ వ్వాకు నలుసుకుంట
సుట్టాకు సుట్టుకుంట
ఇంగలం కోసరం నేను వోతుంటిరా !...."

ఇది సుదీర్ఘ గేయప్రహేళిక. విరుపులూ మలుపులూ తెలియాలన్నా టేప్ రికార్డర్ అవసరమే మరి. వీటినే కోలాటాలమీద కూడా వేస్తుంటారు. అలాంటి దృశ్యాల్ని నాగరికలోకానికి అందజేయాలంటే కెమెరా ఉండాల్సిందే.

మరొకవిషయం గుర్తుంచుకోవాల్సిన అవసరం ఉంది. పొడుపుకథల్ని సేకరించే పరిశోధకుడు పురుషుడైతే భార్యనో తల్లినో చెల్లినో వెంబడితీసుకోని వెళ్ళడం ఉత్తమం. స్త్రీ అయితే కేవలం తోడుగా ఉండడానికి భర్తో, తండ్రో, సోదరుడో అవసరం. సేకరణ సులభంగా జరగడానికి ఈ తోడు ఎంతో ఉపకరిస్తుంది. ముఖ్యంగా తెలుగుదేశంలో మధ్యతరగతి స్త్రీలల్లో కొందరు పరాయి వారిముందు మాట్లాడ్డానికి జంకుతారు. పలాన ఆయన భార్యకు పొడుపుకథలు బాగావచ్చు అని తెలిసిన పరిశోధకుడు మొదట ఆయన్ని కలుస్తాడు. సేకరించే పరిశోధకునికీ తన భార్యకూ మధ్య వారధిగా ఆయన ఉంటాడు. అయినా ఆమె ఇతనిముందుకురాదు. గోడ చాటుకు ఉంటుంది. ఏదో గొణుగుతుంది అది సరిగా

వినిపించక అవినిపించిన దానికే అదీఇదీ కలుపుకొని యేదో అయిపోయిందనిపించి దంపం పెట్టి బయటపడాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. పరిశోధకుని ఆ అసంతృప్తి యెవరితో చెప్పుకుంటే తీరుతుంది. మరికొంతమంది ఉంటారు. ఎదురుగా వస్తారు, చెప్తారుగాని కొన్ని పదాలు ఉచ్చరించడంలో అర్థాన్ని స్పష్టంగా వివరించడంలో జంకుతారు. అందుకే పరిశోధకుని భార్యో, సోదరో ఉంటే సేకరణలో కలిగే క్లిష్టత తీరిపోతుందని అనడం. అయితే ఇద్దరూ వెళ్ళడంవల్ల కలిగే కొన్ని అసౌకర్యాల్ని భరించుకోవాల్సి ఉంటుంది. సేకరణ ఒక పద్ధతిగా జరగాలంటే తప్పదు మరి !

ఇంకొక విషయం గమనించాల్సి ఉంది. తానే ఊరికైతే వెళ్ళాలని పరిశోధకుడనుకుంటాడో ఆ ఊళ్ళో తనకు తెలిసినవారు గాని మిత్రులుగాని బంధువులుగాని ఉంటే వారికి మొదటే ఉత్తరాలు రాయాలి. ఎవరూ తెలియకుంటే ఆ ఊరి గ్రామాధికారి పేరిటో, ప్రధానోపాధ్యాయుల పేరిటో ఉత్తరం రాయాలి. ఏదైనా పనిఉండి ఊరు విడిచి వెళ్లేవాళ్ళు కూడా ఒక్కోసారి అదృష్టంకొద్దీ ఉండిపోవచ్చు. వారివల్ల వసతిసౌకర్యం లభించడమేకాకుండా ఆ గ్రామంలో విచిత్రాలు చెప్పేవారి పరిచయం ఏర్పడుతుంది. పని సానుకూలమవుతుంది.

పొడుపుకథలు సేకరించాల్సిన ప్రదేశాన్ని ఎన్నుకోడంలో కూడా మెళుకువ చూపించాల్సి ఉంటుంది. జిల్లాకు నడిబొడ్డున ఉన్న గ్రామాన్ని సాధారణంగా ఎన్నుకొవాలి. జిల్లా సరిహద్దుల్లోని గ్రామాన్ని కూడా విడువరాదు. మన దేశంలోని రాష్ట్రాలన్నీ భాషా ప్రాతిపదికమీద నిర్మింపబడ్డాయి. కాబట్టి సరిహద్దుల్లోని గ్రామాల్ని తప్పకుండా దర్శించాలి. ఒక భాషా ప్రహేళికపై మరొక భాషాప్రహేళిక యొక్క ప్రభావాన్ని తులనాత్మకంగా పరిశీలించడానికి వీలు కలగడమే కాకుండా, పదాల ఆదానప్రదానం వల్ల భాష ఏ విధంగా పరిపుష్టమవుతుందో తెలుసుకునే అవకాశం లభిస్తుంది.

క్షేత్రరంగం :-

పూర్వరంగం పూర్తిగా సంసిద్ధం చేసుకొన్నపిదపనే క్షేత్రకార్యంలోకి దిగాలి. పొడుపుకథాకర్త – వ్యవహర్త మానవుడే కాబట్టి అతని ఆధారంగానే

వ్యవహర్తలలో జానపదుల్ని - నాగరికుల్ని, స్త్రీలు - పురుషులు - పిల్లలు అని మూడు రకాలుగా విభజించుకోవాల్సి ఉంటుంది. అప్పుడు మొత్తం ఆరు విభాగాలవుతాయి. సిద్ధాంతీకరణ సందర్భంలో కలగాపులగం గాకుండా ఆ ఆరు విభాగాల్లో వేర్వేరుగా వ్రాసిపెట్టుకోడం ఉత్తమం. ఆధునిక ప్రపంచంలో జానపదులు నాగరికులు కలిసిపోతున్న ఈ తరుణంలో ఈ కార్యం మరీ క్లిష్టమవుతుంది. అందువల్ల వ్యవహర్త యెదిగిన పరిసరాల్ని, అనుభవాల్ని, నేర్చిన విద్యల్ని పరిగణనలోకి తీసుకోడం మంచిది. ఉదాహరణకు ఓ పల్లెలో పుట్టి పల్లెలో పెరిగి, తాలూకా నగరంలో ఇంటర్‌వరకు చదువుకొని, పట్నంలో డిగ్రీ పూర్తిచేసి పల్లెకువచ్చి వ్యవసాయం చేసుకునే వ్యవహర్త దొరికాడనుకుందాం. ఇతడు జానపదుల - నాగరికుల పొడుపుకథల్ని చెప్పేవాడైనందువల్ల ఇరువురికీ ప్రతినిధి అనాలి. ఈ రెండురకాల పొడుపుకథల్ని వేర్వేరుగా రాసుకోవాల్సి ఉంటుంది.

కార్యక్షేత్రంలో పరిశోధకునికి వ్యవహర్తలతోటే పని ఉంటుంది. కాబట్టి వ్యవహర్తల్నిబట్టి ఏర్పాటుచేసుకొనే ఈ ఆరు విభాగాలు ఉత్తమం అనడం.

జానపదమహిళ కూలీనాలి పనులు చేసుకుంటుంది. వ్యవసాయం లేదా ఇతర వృత్తులకు సంబంధించిన పనుల్లో తన కుటుంబీకులకు తోడుగాఉంటుంది. తన ఇంటినీ తన పిల్లల్నీ తీర్చిదిద్దుకుంటుంది. కొన్ని కుటుంబాలతో సాన్నిహిత్యం తప్పిస్తే పెద్దగా లోకం తెలియనిది జానపద మహిళ. ఆ కారణాన్నే సేకరణ సందర్భంలోనే జానపదమహిళల పొడుపుకథలు వేరుగా రాసుకోవాల్సిన అవసరముంది.

ఇక వృత్తి వ్యవసాయాది రంగాల్లో రెక్కలు ముక్కలు చేసుకుంటూ తన పొట్ట పోసుకునేవాడు, తన కుటుంబపు ఆకలితీర్చేవాడు జానపద పురుషుడు. గ్రామీణ జీవితాలకు సంబంధించిన కొంత అవగాహన, గ్రామ రాజకీయాలకు సంబంధించి కొంత అస్పష్టావగాహన జానపద పురుషునికి ఉంటుంది. వీరినుండి సేకరించినవి కూడా వేరుగా రాయాలి.

జానపదుల పిల్లలు గోళీలు, చిట్టగెనలు ఆడడం, పశువుల్ని కాయడం, పనిపాటల్లో తలిదండ్రులకు తోడుగా ఉండడం సర్వసాధారణం. పశువులు -

పక్షులు - కొండలు - కోనలు - తమ తోటిపిల్లలు - ఇదే లోకంగా పెరిగే ఈ పిల్లల పొడుపుకథలకొక ప్రత్యేకత ఉంది. అందువల్ల సేకరణలోనే వాటిని గుర్తుంచుకోవాల్సిన అవసరముంది.

ఇక నాగరక మహిళ, నాగరక పురుషుడు, నాగరక బాలలపై అధునాతన ప్రపంచ ప్రభావం ఉంటుంది సాధారణంగా అందరూ అక్షరాస్యులై గ్రంథాలు తిరగేసే జ్ఞానం ఉన్నవారే. అయితే వీరి పూర్వాశ్రమంలో జానపద జీవన ప్రభావం రాజ్యంచేసి ఉంటే, అలాంటి పొడుపుకథల్ని జాగ్రత్తగా గమనించి జానపద ప్రహేళికల్లో చేర్చాల్సిన అవసరముంది. ఒక్కోసారి పరిశోధకునికి వీరంతా ఒకేచోట తటస్థపడే అవకాశం లేకపోలేదు. అప్పుడు నాల్గురకాల కాగితాలు తిప్పితిప్పి రాసుకోడం విసుగు కలిగిస్తుంది. తబ్బిబ్బవడానికి అవకాశముంది. అలాంటి సమయంలో అన్ని ఒకేచోట రాసుకొని జానపద మహిళలు చెప్పినవాటికి FW అని, జానపద పురుషులనుండి సేకరించిన వాటికి FM అని, జానపదుల పిల్లలు చెప్పినవాటికి FB అని గుర్తులుంచుకోవాలి. ఇక నాగరక స్త్రీలకు CW అని, నాగరక పురుషులకు CM అని, నాగరక బాలలకు CB అని గుర్తులుంచుకోవాలి. సావకాశాన్ని బట్టి వీటన్నిటిని ఆయా వర్గాల క్రింద కూర్చుకోడానికి ముమ్ముందు ఈ పద్ధతి బాగా ఉపయోగపడుతుంది.

క్షేత్రకార్యంలో హ్రస్వప్రహేళికల సేకరణలో పెద్దగా ఇబ్బంది అంటూ ఏమీ ఉండదు. అయితే కథాత్మక ప్రహేళికలు మధ్యమధ్య వచ్చినప్పుడు కొంత ఇబ్బంది తప్పదు. పొడుపుకథ పొట్టిది లేదా కొంత పొడుగుది కావచ్చు. కాని దాని ముడివిప్పి కథ చెప్పుకుంటూ పోతుంటే కొండవీటి చేంతాడవుతుంది. దీనిని ఉన్నది ఉన్నట్లుగా టేపు కెక్కించాల్సి ఉంటుంది. అయితే మధ్యలోనే "ఆముడి అలా విప్పరాదు. ఇలా విప్పాలి" అని మరొక రందుకునే అవకాశం లేకపోలేదు.

లేదా మరోచోట మరోరకంగా ముడివిప్పేవారు కనిపిస్తారు. ఇవి కథసంలో వచ్చిన పాఠాంతరాలు. ఇవన్నీ రికార్డు చేసుకోవాలి.

నానుడులు, పలుకుబళ్లు, జాతీయాలు, సామెతలు జాగ్రత్తగా గమనిస్తుండ డంవల్ల, విచిత్రధ్వనుల్ని, విలక్షణ ప్రయోగాల్ని గుర్తుంచుకోడంవల్ల - సిద్ధాంతీ కరణ సందర్భంలో గాడితప్పని విధంగా నడవడానికి వీలవుతుంది.

శ్రీ త్రిలోచన్ పాండేగారు "A guide to field study"లో క్షేత్రకార్యజ్ఞు నికి కొన్ని సూచనలు చేశారు. ఈ సూచనలు పొడుపుకథలు సేకరించే వారికి కూడ సరిపోతాయి.

1. సేకరణకు సంబంధించిన అన్నిమార్గాల్ని పరిశీలించాలి. వ్యవహర్త పేరు, పూర్వచరిత్ర, సేకరించిన సమయం తేదీలతో సహా రాయాలి. విలాసం మరియు వృత్తి రాసుకోవాలి.

2. జానపద విజ్ఞాన ప్రక్రియ శీర్షికను వివరించే ప్రధాన సందర్భంతో పాటు, ఒకవేళ ఉంటే ఆ శీర్షిక కూడా రాసుకోవాలి.

3. ఆ ప్రక్రియ స్త్రీపురుషుల్లో అధికంగా ఎవరి ప్రచారంలో ఉందో గమ నించాలి. అది సామూహికమైందా లేక వైయక్తికమైందా గుర్తించాలి.

4. గ్రంథరూపంలో జానపద విజ్ఞాన ప్రక్రియయైతే రచయిత పేరు, రచనాకాలాన్ని గుర్తించాలి.

5. అన్ని జానపద విజ్ఞాన ప్రక్రియలకు సంక్షిప్తంగా పీఠికముందే ఉంటే అది విషయ వర్గీకరణ సందర్భంలో సహకరిస్తుంది.

6. ప్రధాన విషయంలో ఏదైనా ఉపవిషయం చెప్పబడి ఉంటే గుర్తుంచు కోవాలి.

7. వివిధ సంగీతవాద్యాల్ని గుర్తించాలి. వాద్యబృందం సహాయం లేని జానపదగేయమేదైనా ఉంటే దానిని గుర్తించాలి.

8. సంగ్రహించిన విషయాల్లోని భాషను ఏ కారణంచేత గూడా మార్పు చేయరాదు. పదాలు, పదబంధాలు ఉన్నవి ఉన్నట్లే రాసుకోవాలి.

9. చెప్పే వ్యక్తులతో మిత్రత్వంలో వర్తించే ప్రకృతి ఎప్పుడూ మంచి ఫలితాల నిస్తుంది."

జానపద విజ్ఞాన వృక్షంలో పరుచుకొనిపోయిన ప్రక్రియాశాఖల్ని దృష్టిలో ఉంచుకొని శ్రీ పాండేగారు పై సూచనలు చేశారు. వారు ఇంకా సేకరణస్థలం, వ్యవహర్త, వివరాలు అన్ని సూచించే ఒక మాదిరి కార్డు (Spicemen Card) మొదటే తయారుచేసుకో మంటారు. ఇలా కార్డు తయారుచేసుకోడంవల్ల సమయం తగ్గడమే గాకుండా ఒక క్రమపద్ధతిలో వ్యవహర్తల్ని, సంగ్రహించే ప్రదేశాల్ని సందర్శించే వీలు కలుగుతుంది. పొడుపుకథల్ని దృష్టిలో వుంచుకొని ఈ మాదిరి కార్డును ఈ విధంగా తయారుచేసుకోవచ్చు.

**A.** వ్యవహర్త :

1. పేరు, 2. వయస్సు, 3. వృత్తి, 4. విలాసం, 5. విద్యార్హత, 6. ఇప్పటి హోదా.

**B.** సేకరణ స్థలం :

1. జిల్లా, 2. తాలూకా, 3. పోలీసు స్టేషన్, 4. పోస్టాఫీసు, 5. గ్రామం.

**C.** వివరాలు :

1. ప్రతిపాదిత విషయం, 2. వ్యవహర్త చెప్పే అర్థం, 3. ప్రక్రియా విశేషం, 4. ఆచార వ్యవహారాలు, 5. భాషావైలక్షణ్యం,

ఒక వ్యక్తి వంద పొడుపుకథలు చెప్పేవాడైనప్పుడు సేకరణస్థలం-వ్యవహర్త, మాటిమాటికి రాసుకోడం శ్రమే అనిపిస్తుంది. పొట్టి పొడుపులకు కూడా ఇదే పద్ధతి అనుసరించడం విసుగుపుట్టిస్తుంది. అయితే దీర్ఘ ప్రహేళికలకు ఇది బాగా ఉపకరిస్తుంది. ఈ మాదిరి కార్డులో పేరు రాసుకోడంలో ఒక ప్రయోజన ముంది. మరెవరైనా సేకరించినప్పుడు ఆ వ్యక్తినే కలుసుకొంటే చెప్పే మార్పులు

పరిశీలనచేయడానికి వీలుకలుగుతుంది. అంటే మౌఖిక ప్రచారంలోఉన్న పొడుపు కథల్లో ఒక సంవేదకుడు ఎన్నిరకాలుగా చెబుతాడో గుర్తించడానికి వీలుంటుంది. చాలావరకు మౌఖికాలైన ఈ పొడుపు కథల్లో ఇంతగా మార్పులు రావడానికి ఉన్న కారణాలేంటో తెలుసుకోడానికి వీలు కలుగుతుంది. ఇక వయస్సును సూచించడంవల్ల ఏయే వయస్సుల వారు ఏయే రకాలైన పొడుపుకథల్ని చెబుతున్నారో గుర్తించి మనస్తత్వాల్ని బేరీజు వేయడానికి వీలవుతుంది. వృత్తిని గుర్తించడంవల్ల ఏయేవృత్తులవారు ఏయేరకాల పొడుపుకథలు చెబుతున్నారో గమనించవచ్చు. విలాసంవల్ల మరో వ్యవహర్తను కలవటానికి వీలుకలుగుతుంది. విద్యార్హతనుబట్టి వ్యవహర్తను ఆచితూచి పరిశీలించడానికి అవకాశం లభిస్తుంది. హోదావల్ల వ్యవహర్తను తొందరగా కలుసుకునే వీలవుతుంది. అంతేగాక ఇతరులతో అతనికున్న పరిచయాల ప్రభావంవల్ల పరిణమిస్తున్న మనోభావాల్ని విశ్లేషించే వీలవుతుంది.

ఇక సేకరణ స్థలం సులభంగా తెలియడానికి మొత్తం ప్రాంతంలో ఏయే మండలాలకు వెళ్ళడం జరిగిందో గుర్తుంచుకోడానికి, ముమ్ముందు ఎక్కడికి వెళ్లాలో నిర్ణయించుకోడానికి అనేక రకాలుగా పరిశోధకునికి ఉపకరిస్తుంది. భావి పరిశోధకులకు కూడా ఈ పద్ధతి సహకరిస్తుంది.

ఇక వివరాల్లోని ప్రతిపాదిత విషయంవల్ల పొడుపుకథ ప్రకృతిని సూచించేదా, గృహజీవనానికి సంబంధించిందా, వృత్తుల్ని తెలిపేదా అని తొందరగా గుర్తించే అవకాశం కలుగుతుంది. ఆయా వర్గాల క్రింద వాటిని చేర్చేప్పుడు ప్రతిపాదిత విషయం అనే అంశం ఎంతో ప్రాధాన్యం వహిస్తుంది. వ్యవహర్త చెప్పే అర్థం అనేచోట అన్యజానపద సాహిత్య ప్రక్రియలకైతే పౌరాణికమో, చారిత్రకమో, సాంఘికమో, కాల్పనికమో ఏదోఒకటి కేవలం సూచించడం జరుగుతుంది. అయితే పొడుపుకథల విషయంలో ఈ చోట విడుపురాసే బదులు కథాత్మక ప్రహేళికలకు మాత్రమే దీనినుపయోగించుకొని పౌరాణికాదుల్ని గుర్తించడం మంచిది.

జానపద సాహిత్యంలో పొడుపుకథే ఒక ప్రక్రియగా పొడుపుకథల్లో మళ్ళీ ప్రక్రియా విశేషమేంటి అని కొందరనవచ్చు. తెలుగు పొడుపుకథల్లోనూ అన్ని

భాషల పొడుపుకథల్లోనూ పద్య, గేయ, వచన, వచనగేయ ప్రక్రియలు కనిపిస్తున్నాయి. ఆ విధంగా వర్గీకరించుకునే పక్షంలో ప్రక్రియను గుర్తించడం ఎంతో ఉపకరిస్తుంది. జానపద గేయ వచన సాహిత్యంలో బహుళంగా కనిపించే ఆచార వ్యవహారాలు పొడుపుకథల్లో అంతగా కనిపించవు. అయితే కొన్ని ఆచారవ్యవహారాల్ని పొదుగుకొన్న పొడుపుకథలు లేకపోలేదు. వీటిని సూచించడంమూలాన ప్రజాజీవనం ఎలా ప్రతిబింబిస్తుందో గుర్తించడానికి వీలుకలుగుతుంది. భాషా వైలక్షణ్యం అన్ని పొడుపుకథల్లో కనిపించకపోవచ్చు. కనిపించిన వాటినైనా సూచించడంవల్ల భాషాశాస్త్రవేత్తలకు మార్గం సుగమమవుతుంది.

ఈ విధంగా క్షేత్రకార్యంలో ఎప్పటికప్పుడు మాదిరి కాపీను నింపుకోడం వల్ల పరిశోధకులకనేక లాభాలు సమకూర్తాయి. భావి పరిశోధకులకు మార్గదర్శనం చేసినట్లవుతుంది. పొడుపుకథల్ని ఇలా ప్రత్యక్షంగా పరోక్షంగా సేకరించుకోడం, జానపదుల్ని - నాగరికుల్ని స్త్రీ పురుష బాలలుగా విభజించుకోడం మాదిరి కాపీను సిద్ధంచేసుకోడం మొదలైన పద్ధతుల్ని పరిశోధకుడు విధిగా అనుసరించాలి.

ఉత్తరరంగం :-

ముద్రితాముద్రితాలనుగూర్చి మౌఖికాలనుగూర్చి ఒక నిర్ణయానికి వచ్చాక, పూర్వరంగాన్ని సంసిద్ధం చేసుకున్నాక, క్షేత్రరంగంలో కార్యం సానుకూలమయ్యాక, ఇక ఉత్తరరంగాన్ని గూర్చి సమగ్ర ప్రణాళిక సంసిద్ధం చేసుకోవాల్సిన అవసరముంటుంది, ఇదే సిద్ధాంతీకరణం (Theorisation). ఈ సిద్ధాంతీకరణంలో వర్గీకరించుకొనే పద్ధతి ఆయా పరిశోధకుల అభిరుచినిబట్టి కూడా ఏర్పరుచుకోడం జరుగుతుంది.

Folklore and Folklife అనే గ్రంథంలో పొడుపుకథల్ని అయిదు విధాలుగా వర్గీకరించడం జరిగింది. 1. వివరణాత్మకాలు (Descriptive riddles), 2. పరిహాస ప్రశ్నలు (Joking Questions), 3. వివేక ప్రశ్నలు (Wisdom Questions), 4. విడికథలు (puzzles), 5. అనుకరణకథలు (parody riddles), ప్రధానంగా ప్రశ్ననే దృష్టిలో పెట్టుకొని ఈ వర్గీకరణ జరిగినట్టనిపిస్తుంది.

Introducing Folklore అనే గ్రంథంలో కూడా అయిదు రకాలుగా పొడుపుకథల విభజన జరిగింది. 1. మనుష్యులు జంతువులు అని గుర్తించరాని ప్రాణులతో పోలిక. 2. జంతువులతో పోలిక. 3. మనుష్యులతో పోలిక. 4. వృక్షాలతో పోలిక. 5. వస్తువులతో పోలిక. ఇందులో కేవలం సాదృశ్యాల్ని దృష్టిలో పెట్టుకొని వర్గీకరణ చేసినట్టనిపిస్తుంది.

భాషా శాస్త్రపరంగా పొడుపు కథల్ని గొలుసుకట్టు పదాలు, సామాన్య వాక్యాలు, సంకీర్ణవాక్యాలు, వ్యతిరేక సూచకవాక్యాలు, పద్యరూపపు పొడుపు కథలు, కథారూపపు పొడుపుకథలు అని విభజించవచ్చునని జానపద సాహిత్య స్వరూపం గ్రంథంలో డా॥ ఆర్వియస్ సుందరంగారు వ్రాకుచ్చారు.

డా॥ తంగిరాల వెంకటసుబ్బారావుగారు తమ రాయలసీమ మారుకతలు వ్యాసంలో జాతిదేశి, పామరదేశి, నిబద్ధదేశి అని మూడువిభాగాలు చేసి అందులో మళ్ళీ అనేక ఉపవిభాగాలు చేశారు. శ్రీ జి. శంకరరావుగారు తమ పొడుపుకథలు గ్రంథంలో వచనరూపంలో ఉన్న పొడుపుకథలు, గేయరూపంలోని పొడుపు కథలు, పద్యరూపంలోని పొడుపుకథలు అని మూడు విధాలుగా విభజించారు. డా॥ జి. యస్. మోహన్‌గారు పొడుపుకథల్ని -విషయాన్నిబట్టి వర్గీకరించడమే అనుకూలమైందని తమ జానపద విజ్ఞాన వ్యాసావళిలో 8 రకాలుగా విభజించారు, "1. ప్రశ్నార్థకములు, 2. వినోదాత్మకములు, 3. కథాత్మకములు, 4. గొలుసు కట్టుకథలు, 5. వృత్తిసంబంధులు, 6. సంఘజీవన సంబంధులు, 7. చిత్ర శబ్దాత్మకములు, 8. అశ్లీలార్థకములు". ఇందులో కొన్ని విషయవిభజన పరిధి లోనికి రానివికూడా చేరాయి.

అయితే పొడుపుకథల్ని కేవలం స్వరూపాన్నిబట్టి ఏకపది, ద్విపది, త్రిపది చతుష్పది, పంచపది, షట్పది, సప్తపది, అష్టపదులుగా స్థూలవర్గీకరణం చేయ వచ్చు. అంతేకాక పద్యాలు, గేయాలు, వచన గేయాలుగా విభజించవచ్చు. వాటిలో మళ్ళీ ఉపవిభాగాలు చేయవచ్చు. అప్పుడు వాటి స్వరూపం ఇలా ఉంటుంది.



పొడుపుకథలు
పద్యాలు
వచనాలు
గేయాలు
వచనగేయాలు
వృత్తాలు
జాతులు
ఉపజాతులు
దీర్ఘవచనగేయాలు
హ్రస్వవచనగేయాలు
ఒక్క పొడుపు
పెక్కు పొడుపులు
ఒక్క పొడుపు
పెక్కు పొడుపులు
దీర్ఘవచనాలు
హ్రస్వవచనాలు
ఒక్క పొడుపు
పెక్కు పొడుపులు
ఒక్క పొడుపు
పెక్కు పొడుపులు
దీర్ఘగేయాలు
హ్రస్వగేయాలు
ఒక్క పొడుపు
పెక్కు పొడుపులు
ఒక్క పొడుపు
పెక్కు పొడుపులు

తెలుగువరకైతే ఇట్లా పద్యాల్లో మూడు, వచనాల్లో నాలుగు, గేయాల్లో నాలుగు, వచనగేయాల్లో నాలుగు విభాగాలై మొత్తం 15 విభాగాలుగా పొడుపు కథలు కనిపిస్తాయి. ఇది కేవలం పొడుపుకథా స్వరూపం దృష్టిలో పెట్టుకొని చేసిన స్థూలవర్గీకరణమేకాని, సమగ్రత ఇందులో కనిపించదు. అందువల్ల విషయాన్ని దృష్టిలో పెట్టుకొని విభజించడమే ఉత్తమమనిపిస్తుంది.

1. గృహజీవన ప్రహేళికలు, 2. గ్రామికజన ప్రహేళికలు, 3. ప్రకృతి సంబంధి ప్రహేళికలు, 4. తిర్యక్ సంబంధి ప్రహేళికలు, 5. క్రీడావినోద ప్రహేళికలు, 6. బాలబాలికా ప్రహేళికలు, 7. తాత్త్విక ప్రహేళికలు, 8. అస్పష్ట ప్రహేళికలు, 9. ఆత్మాశ్రయ ప్రహేళికలు. ఇందులో బాలబాలికా ప్రహేళికల్ని ప్రత్యేక ప్రత్యేకంగా వర్గీకరించుకోవాల్సి ఉంటుంది.

కేవలం ప్రజాజీవనాన్నే దృష్టిలోకి తీసుకున్నప్పుడు ఈ విధంగా విశ్లేషించుకోవచ్చు. 1. గృహజీవనం, 2. సాంప్రదాయాలు, 3 వృత్తివిశేషాలు, 4. క్రీడా వినోదాలు, 5. పారమార్థిక జీవనం, 6. ఆధునిక జీవనం, 7. ప్రకృతి పరిశీలనం, 8. శాస్త్రవిజ్ఞానం.

అయినా అప్పటికీ సమగ్రరూప సాక్షాత్కారం కలుగకపోవచ్చు.

1. అందుకే పరిశోధనా దృక్పథంతో ఉత్పత్తి వికాసాల్ని గూర్చి సమగ్రమైన చర్చ చేయబడాలి. 2. జానపద సాహిత్యంలో పొడుపుకథ స్థానం గుర్తించాలి. 3. కథాత్మకాలైన పొడుపుకథల్లోని సొగసులు వెల్వరించాలి. 4. పొడుపు కథ-సామెతల తులనాత్మక పరిశీలనం జరగాలి. 5. పొడుపుకథ ప్రతిబింబించిన ప్రజాజీవనం బహిర్గతం కావాలి. 6. ఆధునిక సాహిత్యంలో పొడుపుకథకున్న స్థానాన్ని చర్చించాలి. 7. చిత్ర కవిత్వాన్ని, పొడుపుకథనూ పరిశీలించాలి. 8. పొడుపుకథల్లోని అలంకారాలు వివరించాలి, అలంకారాలకన్నింటికి మూలభూతమైన ప్రతీకలు గుర్తించాలి. 9. పొడుపుకథల్లోని వివిధ రసాలు - ధ్వని కూలంకషంగా చర్చించాలి. 10. పొడుపు కథల్లోని ఛందశ్శిల్పాన్ని అనుశీలించాలి. 11. పొడుపుకథల్లోని భాషావైభవాన్ని గుర్తించాలి. 12. వివిధ భాషల్లోని ప్రహేళికల మధ్యనున్న సారూప్య సాధర్మ్యాలు వైవిధ్యాలు బహిర్గతం చేయాలి.

ఈ వ్యాసకర్త తెలుగు పొడుపుకథలు పరిశోధనా గ్రంథంలో ఈ పై పన్నెండింటిమీద కొంత కృషిచేయడం జరిగింది. భవిష్యత్తులో ఇంకా బృహత్తరమైన కృషి జరగాల్సి ఉంది. పొడుపుకథల యుగం అంతమయ్యిందనే మాటకు అంతం పలికి పొడుపుకథల యుగం ఆరంభమయ్యిందని అనిపించాల్సి ఉంది.



# అచ్చుతప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 24 | వినిపింతం | వినిపించడం |
| 5 | 4 | వ్యవహరింండంలో | వ్యవహరించడంలో |
| 5 | 8 | కొంన్ని | కొన్ని |
| 16 | 8 | కూర్ల | నూర్ల |
| 17 | 20 | తలగక | తగులక |
| 22 | 5 | చెల్లెంజ్రు | చెల్లెంద్రు |
| 29 | 9 | మిశ్రగతి | మిశ్రగతి |
| 34 | 18 | అవురుగుడ్డి | అవురుగడ్డి |
| 36 | 5 | చుంబించిని | చుంబించని |
| 45 | 18 | పొడుపుకథలని | పొడుపుసామెతలని |
| 45 | 24 | సారకత | సార్థకత |
| 57 | 23 | 38 | 38 వాడు ఖరనందన |
| 70 | 7 | ప్రకతుల్ని | ప్రకృతుల్ని |
| 72 | 11 | సేవతని | సేవతని |
| 72 | 19 | కుడుక్కుంటే | కడుక్కుంటే |
| 76 | 10 | వరిస్థితుల్లో | పరిస్థితుల్లో |
| 84 | 19 | చాక్యంగా | చాక చక్యంగా |
| 88 | 28 | రాజ్యపుభార్య | రాజ్యపుమంత్రిభార్య |
| 92 | 15 | గమనార్థాం | గమనార్థం |
| 95 | 26 | మనచుచుండు | మనచుచంద్రుడు |
| 96 | 2 | భూతనాథునీ | భూతనాథుని |
| 98 | 12 | తోడు | తోడ |
| 100 | 12 | నిద్ధముగను | నిబద్ధముగను |
| ,, | 14 | శిరుననగాండ్ల | శిరుననగండ్ల |
| ,, | 15 | జారునగర | జేరునగర |
| ,, | 19 | బెలగు | చెలగు |
| ,, | 20 | ధృతరాష్ట | ధృతరాష్ట్రి |
| ,, | 25 | మెపుడు | యెపుడు |

| | | | |
|---|---|---|---|
| 101 | 17 | హ్రదము | హ్రదము |
| 106 | 21 | వురహర | పురహర |
| 108 | 18 | హెమ | హేమ |
| 113 | 5 | వరిమళ్ళల్లో | వరిమళ్ళలో |
| 113 | 7 | తలపు | తలుపు |
| 115 | 14 | వెండిరంగు | వెండిరంగుల |
| 118 | 19 | తళుములో | తుళుములో |
| 119 | 8 | కెలకులకె | కెలకులకె1 |
| 121 | 2 | యోపగిది | యేపగిది |
| 124 | 8 | -- | (ద్విజ) |
| 129 | 10 | -- | మరియు నాయుత్త రంబులే వరుసగాను |
| 130 | 3 | బంబాధరోష్ఠి ! | బింబాధరోష్ఠి ! |
| 130 | 12 | కలము | కులము |
| 132 | 16 | రాలు | రాలి |
| 144 | 21 | [పషి! పషి!] | పక్షి! పక్షి! |
| 154 | 17 | ఎక్కడపడిడే | ఎక్కడపడితే |
| 156 | 19 | నిర్మింప | విభజింప |

# ఉపయుక్త సామాగ్రి

| | | |
|---|---|---|
| 1. | అభినవాచార్యకము | గొడవర్తి సూర్యనారాయణ |
| 2. | ఆంధ్రపత్రిక | 1911 విరోధికృత సంవత్సరాది సంచిక |
| 3. | ఆంధ్రభూమి | వారపత్రిక |
| 4. | కావ్యాలంకార సంగ్రహము | వ్యాఖ్య : సన్నిధానంసూర్యనారాయణ శాస్త్రి |

| | | |
|---|---|---|
| 5. | చమత్కార చంద్రిక | మంగిపూడి వెంకటశర్మ |
| 6. | చమత్కార పొడుపుకథలు | వెంకటేశ్వర ప్రింటర్స్, కామారెడ్డి |
| 7. | చమత్కార పొడుపుకథలు అను సామెతలు | ,, |
| 8. | చాటుపద్య మణిమంజరి | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 9. | జానపద సాహిత్య స్వరూపం | డా॥ ఆర్వీయస్. సుందరం |
| 10. | జానపద విజ్ఞాన వ్యాసావళి | డా॥ జి. ఎస్. మోహన్ |
| 11. | జానపదగేయ వాఙ్మయవ్యాసావళి | నేదునూరి గంగాధరం |
| 12. | తిరుమలేశ శతకము | బూరెల సత్యనారాయణ మూర్తి |
| 13. | తెలుగు సామెతలు | సాహిత్య అకాడమీ ప్రచురణ |
| 14. | తెలుగుజానపద గేయగాథలు | ఆచార్య నాయనికృష్ణకుమారి |
| 15. | తెలుగులో ఛందోరీతులు | డా॥ గిడుగు వెంకటసీతాపతి |
| 16. | తెలుగు జానపద గేయసాహిత్యము | ఆచార్య బిరుదురాజురామరాజు |
| 17. | నీలిమ | మాసపత్రిక |
| 18. | నూతన చమత్కార పొడుపుకథలు | వెంకటేశ్వర ప్రింటర్స్, కామారెడ్డి |
| 19. | పల్లెపదాలలో ప్రజాజీవనం | డా॥ యెల్దండ రఘుమా రెడ్డి |
| 20. | పెద్దబాలశిక్ష | -- |
| 21. | పొడుపు పద్యాలు | ఉమ్మానారాయణ రెడ్డి |
| 22. | పొడుపుకథలు | డా॥ వెలగా వెంకటప్పయ్య |
| 23. | పొడుపు కథలు | జి. శంకరరావు |
| 24. | ప్రజాసూక్తం | యువభారతి ప్రచురణ |
| 25. | ప్రహేళికలు (I&II) | శ్రీభాష్యం విజయసారథి |
| 26. | భారతి | మాసపత్రిక |
| 27. | వయోజన విద్య | నర్రావుల వెంకట సుబ్బారావు |
| 28. | వివేచన | పరిశోధన పత్రిక, O. U. |
| 29. | వేమన పద్యములు | ఎన్.వి.గోపాల్ అండ్ కో. |
| 30. | రాతప్రతి (పొడుపు పద్యాలు) | కపిలవాయి లింగమూర్తి |
| 31. | రాతప్రతి (పొడుపు కథలు) | డా॥ కసిరెడ్డి |
| 32. | సాధన (సాహిత్యమాసపత్రిక) | జాతీయ సాహిత్యపరిషత్ ప్రచురణ |

33. సినిమాపాటలు — వివిధ చిత్రాలు
34. మహాభారతమ్ - అరణ్యపర్వ - సంస్కృతమ్

-: English :-

1. A guide to Field study
2. Encyclopaedia of Religion and Ethics
3. Folklore and Folk life
4. Introducing Folk lore
5. Indian Riddles
6. Standard Dictionary of Folk lore.

Acc-NO. 13897
398.61 VEN.
20-00.



